# అంకితం

ఇది ఏడుతరముల తపస్సుపంట! ఒక్క జీవితంలో కనుగొన్న సత్యం కాదు!

వేదపండితులుగా, ఇంగ్లీషు M.A. చదవి వైద్యవిద్యతో యోగాభ్యాసంచేస్తూ ఒకరిక్రింద ఉద్యోగం చేపట్టకుండా 'మనువు' ధర్మంప్రకారం 'అపరిగ్రహం' త్యాగం యోగం రంగరించి స్వేచ్ఛాజీవనం చేస్తూ 84-ఏళ్ళు జీవించిన శ్రీమాన్ ఎక్కిరాల అనంతాచార్యుల వారి తపస్సు పుణ్యం! నాలుగువేదాలపై వారి తపస్సు ఫలితమే నలుగురు ఋషులుగా ఆయన కుమారులైన మాకు ఋషి పేర్లు ఇవ్వటమే కాక 'ఋషితుల్యులు'గా తీర్చిదిద్దాలని ఆరాటపడిన ''ఆధునికులలో ఋషి! — శ్రీమాన్ అనంతాచార్యుడు!!'' — అన్న కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారి వాక్యాలకు జీవించే ఆకృతి అనంతాచార్యులవారు!

ఆ తపోమూర్తి నా తండ్రిగారుకావటం నా అదృష్టమూ పుణ్యం మాత్రమేకాదు! నాకు జన్మతః సంపాందించిపెట్టిన 'వారసత్వపు' ఆస్తిగా 'వేదవిజ్ఞాన ధనం' త్రవ్విపోశారు — ఆ ధనమే ఈ గ్రంథంలో ఇప్పుడు మీరుచదివే 'అక్షరవిజ్ఞానం' అనంతజ్ఞానం! ఇందులోనుంచి, మీ సంస్కారాలనుబట్టి మీరు విలువకట్టగల మణులను, దివ్యసత్యాలను ఏరుకోండి.

పితృపాదులు శ్రీ అనంతాచార్యులవారి గురుదేవులైన శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులవారిని, తండ్రిగారు మా తాతాగారైన శ్రీమాన్ గట్టుపల్లి

శ్రీనివాసాచార్యులవారినీ, ముత్తాతగారైన శ్రీమాన్ శేషాచార్యులనూ స్మరించి, దేశికాచార్య పరంపరగా ఏడుతరాలుగా 'ఆగిరి-పల్లి' దేవుని సేవించి — ఆలయ గురువులుగా ఆచార్య పీఠంపై వేదాత్ములుగా జీవించి బానిసత్వపు కొలువు ఎరుగని ఉద్యోగాలనీడపడని సూర్యులను ఈ తరుణంలో స్మరించి తరించి నా - 30- ఏళ్ల ప్రభుత్వ బానిసత్వ సేవవల్ల కలిగిన చెడుకర్మదోష నివృత్తికై ఈ గ్రంధాన్ని వారికి నా కృతజ్ఞతాంజలి ఘటిస్తూ పరమాత్ముడైన మా ఇలవేలుపు శ్రీవెంకటేశ్వర స్వామివారికీ శ్రీనివాసప్రభునకూ ఈ గ్రంధాన్ని అంకితం చేస్తున్నాను.

12-7-1995
వ్యాసపూర్ణిమ
బెంగుళూరు.

ఇట్లు
డా॥ వేదవ్యాస IAS., PhD.

# అణుయుగంలో హిందూమతం

## విదేశాలలో హిందూమతం

**Book - 1**





## హిందూ మతం - మూలసిద్ధాంతాలు

**Book - 2**



## సృష్టిరహస్యం

**Book - 3**





1

# 'హిందూమతం'-- అంటే ఏమిటి ?

ఎంతో సైన్సు అభివృది చెందిందని అనుకునే ఈ 'అణుయుగం'లో కూడా — మనిషి అంతరిక్షానికి రాకెట్లు పంపించి అంతా జయించాడని అనుకున్న యీ సైన్సురోజులలోకూడా మానవుడి మెదడుకు అందని, అంతుపట్టని ప్రశ్నలు, నిత్యం ప్రతివాడి ఆలోచననీ తొలుస్తున్నాయి - నేటికీ !

ఆకాశంలోకి తేరిపారజూస్తాం — అనంతంగా వ్యాపించి కనిపిస్తాయి వేలాదితారకలు, మిలమిలా మెరుస్తూ!

ఆదీ అంతంలేని యీ అగాధ సముద్రంలా వ్యాపించివున్న ఈఆకాశం అంచులు ఎవరైనా చూశారా? అంతులేకుండా విశ్వంవుండటం తర్కప్రకారం సాధ్యమా? అన్నిటినీ గణితంతో, ''జామెట్రీ'' కొలతలూ తూనికలతో కొలిచే''సైన్సు''కు ఈ అంతులేనిపదార్థం .... ఆదీఅంతమూ

లేని విశ్వం..ఎలా సాధ్యం? ఎవరు సృష్టించారీ సూర్యులనూ, గ్రహాలనూ, గెలాక్సీలనూ ....... ఈ అనంతకోటి బ్రహ్మాండాలనూ? అసలు నేనెవరు?

ఈ 'నేను' అనే వస్తువు ఎక్కడినుంచిపుట్టింది? ఆలోచనల్ని ఎవరుపుట్టిస్తున్నారు? అంతులేకుండా సముద్రంలోని అలలులాగ? ఈశ్వాస ఎవరుపీల్పిస్తున్నారు?

అన్నీకొలిచి అన్నింటినీ తెలుసుకుంటాననే ''సైన్సు'' కు మూలంఅయిన ఈమానవ మేధస్సు — మనస్సు! ఈమనస్సును ఎవరుపుట్టించారు?

మనిషి తల్లికడుపులో వుండగానే తొమ్మిదినెలల్లో తయారయి 'టంచన్'గా టైముకి బైట ప్రపంచంలోకి జన్మిస్తున్నాడే వర్క్సుషాపులోంచి బైటకి దొర్లివచ్చే ''ఇంపాలా'' కారులాగామిలమిల మెరిసే కళ్ళతో అంతులేని ఆశ్చర్యపోతూ — పాపాయిగా! ఎలా!

...... ఎలా చచ్చిపోతున్నాడు మనిషి? చచ్చి ఎక్కడికిపోతున్నాడు? తయారైనశరీరంలో మళ్ళీ ఎప్పుడు ఎలా ప్రవేశిస్తున్నాడు? అన్నీతెలిపే ఈ''జ్ఞాపకం'', ఈఆలోచనా — ఈతెలివీ, చచ్చిపోయిన తరువాత తిరిగి తానేమౌతున్నాడో అన్న ఈ అగాధ రహస్యాన్ని ఎందుకు భేదించలేక పోతున్నవి?

ఈ'జ్ఞప్తి' అంటే చనిపోయిన యితరులను గుర్తుంచుకునే — తెలివికి తన చావుతరువాత తానుపుట్టేముందూ, తానేమౌతున్నాడో ఎందుకు గుర్తుండదు? ఏమిటీవింత? ఏమిటీసత్యం? ఈ జీవితం ఇలా తెర యెత్తటంతో ఆరంభించి తెరపడినతోడనే అంతమయ్యే ఈనాటకీయతకు గ్రంధకర్త ఎవరు?

జీవిత ''కధ''కు రచయిత వున్నాడా? వుంటే ఏడీ? కనిపించడేం?

పిలిస్తే పలకడేం? ఏడిస్తే ఓదార్చడేం? మనిషి విశాలవిశ్వంలో ఎలుగెత్తి పిలిస్తే నక్షత్రాల అవతలనుంచి పలకడేం? మౌనమే అతనిసమాధానమా? అసలు వున్నాడా? లేడా?

ఎవరూలేకపోతే ఇంత సృష్టి ఎవరుచేసారు? దానంతటదే సృష్టించుకుందా? మరిఅలా అయితే ఎంతవద్దనుకున్నా మనిషికి చావుయెందుకు ఆగదు? చద్దామనుకునేవానికి చావెందుకు **రావడంలేదు?** ఈ గుండె, గడియారంలా ఇలా కొట్టుకుంటూవుండటం మనిషిచేతిలో లేదే ?....మరి, కర్త .... మనిషికాదా? ఎవరీ కర్త? 'కర్మ' కనపడుతోంది గాని కర్త కనిపించడేం? ఈ ప్రశ్నలు మొట్టమొదట వేసినవారు ఋషులు! వారి ప్రశ్నలే అనాది సత్యాన్ని తవ్వి తెలుసుకునే మొదటి విజ్ఞాన దీపాలు! యుగయుగాలు గడచినా నేటికీ మానవుడికి అవే శేషప్రశ్నలుగా నిలిచిపోయాయి ! ఎన్ని రాకెట్లు పంపినా, ఎన్ని ఆటంబాంబులు కనిపెట్టినా మనిషికి అంతుపట్టని ఈ అనాది ప్రశ్నలు మాత్రం అలానే **నిలిచిపోయాయి!** ఈ ప్రశ్నలే వేదంలోనూ ప్రతిధ్వనిస్తాయి. ఈ ప్రశ్నోపనిషత్తే **'హిందూమతానికి'** మూలం! దీర్ఘతపసుడనే ఋషికి గోచరించిన వేదమంత్రాలలో సైన్సుకి అందని ఈ ప్రశ్నలకు వేదఋషులు కనుగొన్న సమాధానమే ఈనాటి మన **''హిందూమతం''**!

**''హిందూమతం అంటే ఏమిటి?''**

అన్న ఈ ప్రశ్నయే అనంత ప్రశ్న! ఈ ప్రశ్నకు సమాధానమే ఈ నా గ్రంథం!



2

# అణుయుగంలో – హిందూ మతం సందేశం

ఈ అణుయుగంలో మనకి 'హిందూమతం' యొక్క సందేశం ఏమిటి ? ఈనాడు మనం జీవిస్తున్నది సైన్సుయుగం ! మానవుడు చంద్రమండలంమీద కాలుపెట్టి ఇతర గ్రహాలైన కుజుడు, గురువు, శనిని దాటి ప్లూటో గ్రహంవరకూ రాకెట్లను పంపిస్తున్న ఈ తరుణంలో ఇంత ఆధునికసైన్సు అభివృద్ధి చెందిన ఈ 20వ శతాబ్దం చివరలో కూడా ఇంకా హిందూమతం అంటూ పూజలూ, పునస్కారాలు, దేవుడూ అంటూచెప్పే ప్రాచీనమతం గురించి - ఓ గ్రంథం వ్రాయాల్సి నంత అవసరంవున్నదా ? సైన్సు యుగంలోకూడా మానవుడికి హిందూమతాన్ని తెలుసుకోవాలిసిన అవసరం వుందంటారా ? అని చాలామందికి సందేహం రావచ్చు !

## చికాగో –– ప్రపంచ సర్వమతాల పార్లమెంటు :–

దీనికి సమాధానం కావాలంటే ఈ ఇరవైయ్యవ శతాబ్దపు ఆధునిక ప్రపంచానికి కేంద్రమైన అమెరికా గడ్డలోని చికాగో మహానగరంలో సమావేశమైన

ప్రపంచంలోని అన్నిమతాలవారూ చర్చించిన ప్రశ్న--దానికి సమాధానం తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది !

నూరేళ్లక్రితం స్వామి వివేకానందుడు అమెరికాలోని ఇదే చికాగో మహానగరంలో 'ప్రపంచ సర్వమతాల పార్లమెంటు' ("World Parliament of Religions") మహాసభలో ప్రసంగించడానికి 5 నిమిషాల టైము అతి కష్టంమీద లభించింది ! ఆనాడు ఆయన చేసిన ప్రసంగం ఫలితంగా ఈనాడు అమెరికాలో 'హిందూమతం' పై ఆసక్తి చిలవలు పలవలుగా పెరిగిపోయింది. మళ్ళీ సరిగ్గా ఈ 'ప్రపంచ సర్వమత మహాసభ' జరిగిన నూరేళ్ళకే -- అంటే సెప్టెంబరు 1993, నాటికి మళ్ళీ అదేమహాసభ చికాగోలో జరిగింది ! అందులో **'అణుయుగంలో వేద ఋషుల సందేశం'** అన్న నా ప్రసంగాన్ని అన్నిదేశాలవారూ ఎంతో ఆసక్తిగా విన్నారు ! ఆసమయంలో ప్రపంచ సర్వమతసభ అధ్యక్షుడు చేసిన ప్రసంగం ఈ నాటి మనలోని ప్రతీ హిందువుడికీ కనువిప్పు కలిగిస్తుంది ! దాని సారాంశమే ఈ క్రింద మీకందిస్తాను!

"ఈనాడు మానవుడు రోదసిలోకి రాకెట్లు పంపించగలుగు తున్నాడు! అణువును బ్రద్దలుచేసే అణుశక్తితో ప్రపంచాలనే నాశనంచెయ్యగల ఖండాంతర రాకెట్లు(ICBM) సాధించాడు ! కాని, మానవుడు ప్రపంచాన్నే జయించినట్టు కనిపించినా ఈనాటి మానవుడు ఒక్కసారి వెనుకకు తిరిగి, భూమిమీద వున్నపరిస్థితిని ఆత్మపరిశీలనతో గమనిస్తే ఏం కనిపిస్తోంది?"

ప్రపంచంలో అంతటా, వాతావరణ కాలుష్యం పెరిగిపోతోంది! అనేక దేశాలలోని ఫ్యాక్టరీలు, పెట్రోలియం ఉత్పత్తి యంత్రాల వంటివి వదలిన పొగతో భూమిలోని ప్రాణవాయువే ఖర్చైపోయి **'భూమిమీద ప్రాణికోటి కొద్ది సంవత్సరాలలోనే అంతరించిపోయే ప్రమాదంలో వున్నది'!** భూమిపై వున్న ఓజోన్ పొర చిరిగి సూర్య మండలంనుంచి గామాకిరణాలు, ఆల్ఫాకిరణాలు ప్రాణికోటిని భస్మంచేసే ప్రమాదం అతిచేరువలో వున్నది ! వీటన్నిటినీ అదుపుచేయడం అలావుంచి కనీసం ఏమీచెయ్యలేని నిస్సహాయ స్థితిలో

ప్రపంచ ప్రభుత్వాలున్నాయి! (ఇది రాస్తూంటే గోదావరి జిల్లా పాసర్లపూడి పెట్రోలుబావి "బ్లో-ఔట్" (Blow-Out) రావణాసురుడి కాష్ఠంలా మండుతోంది 20 రోజులుగా)!

దీనికితోడు ప్రపంచ జనాభా పదేళ్ళకొకసారి రెట్టింపౌతున్నది! ఈ భూమిమీద మనుషులకి చివరికి నిలబడే స్థలంకూడా దొరకని స్థితి అతిచేరువలోనే వున్నది ! దీనికితోడు, ప్రతీ ఏడూ క్యాన్సరు (Cancer) తో మరణించే రోగులసంఖ్య పెరిగిపోతున్నా క్యాన్సరు రహస్యం ఇంతవరకూ మానవుడు కనుక్కోలేకపోయాడు ! ఇంతలోకే ఎయిడ్స్వ్యాధి ప్రజ్వరించి మానవజాతినే తుడిచిపెట్టే స్థితిలో ప్రమాదసూచిక (Danger Signal)గా నిలబడివున్నది !" అన్నారు.

ఇకపోతే భూకంపాలు అగ్నిపర్వతాలు సముద్రపు ఉప్పెనలూ, వేలాదిమందిని ఆహుతి చేసుకుంటున్నాయి! నా గ్రంథం **"1999కలియుగాంతం"** లో వ్రాసినట్టు పదివేలమందిని సమాధిచేసింది. వారందాకా ఇంకా భూమి కంపిస్తూనేవున్నది జపాన్ భూకంపం - ఇది రాసేముందు దాకా!! ఏయేటికాయేడు త్రాగటానికి మంచినీళ్ళు కరువైపోతున్నాయి! ప్రపంచదేశాలు ఒకరినొకరు నాశనం చేసుకోవడానికి సిద్ధపడుతున్నాయి! ఈ స్థితిలో మానవుడు భూగోళానికి రాజునని, ప్రకృతిని జయించానని గొప్పలు ఎలా ఏముఖం పెట్టుకుని చెప్పుకోగలడు? క్షణంలో లక్షలాదిమందిని నశింప చేయగలిగిన అణుబాంబులు కనుగొన్నాడు సరే కాని మానవుడు - ఒక్క చీమయినా చచ్చిపోతే బ్రతికించగలడా ? మరణించిన మనిషి గుండెకాయను కరెంటుతో లేక సైన్సుతో ప్రారంభింపచేసినా చనిపోయిన మనిషి తిరిగి కలకాలం జీవించగలడా ? లేదు !!

## విశ్వ- రహస్యం :

"కారణం ప్రాణంయొక్క రహస్యాన్ని సైన్సు భేదించలేదు !

కొమ్ములుతిరిగిన కంప్యూటర్ సైంటిస్ట్ రూపొందించిన ఏడవ అంతస్తు కంప్యూటర్‌ను నిర్మించే ఆ కంప్యూటర్‌సైంటిస్టు మెదడును విశ్వంలోని ఏ శక్తి ఏలా నిర్మించిందో మనకి తెలుసా ?

కనీసం ఈ ఆకాశంలో మొత్తం ఎన్ని కోట్ల నక్షత్రాలున్నాయో తెలుసా? లేక ఈ విశాలవిశ్వంలో ఖాళీ ఆకాశం ఎంతవైశాల్యం వుందో సైన్సు కొలవగలదా ? ఈవిశ్వంలో 'ప్రాణం' అనేది ఎలాపుట్టిందో ఈనాటికీ సైన్సు చెప్పలేకపోతోంది! 'మనస్సు' అనేది ఏ పదార్థంతో తయారవు తున్నది? జీవశాస్త్రానికీ అంతుపట్టని ప్రశ్న! ఇన్ని ప్రశ్నలెందుకు? మనిషికి తాను ఎంతకాలం జీవించి వుండగలడో తెలుసా ? మరణం అన్నది జీవులకు తన ముగింపు కార్యాన్ని ఎక్కడినుంచి ప్రారంభిస్తుందో సైన్సుకుఅంతుపట్టలేదు! అసలప్పుడే పుట్టిన పిల్లవాడి శరీరంలోకి జీవం ఎక్కడినుండి ప్రవేశిస్తున్నదో తెలుసా ?

సైన్సుకు ఇవన్నీ శేష ప్రశ్నలుగానే నిలిచిపోయాయి ! మనిషికి ఏదీ అంతుపట్టదు! ఏదీపూర్తిగా తెలియదు ! దేనిమీదా ఆధిపత్యం, కనీసం తన మనస్సుపైనకూడా కంట్రోలు మనిషి చేతిలోలేదు! ఈతరుణంలో మానవజాతికి, ప్రపంచమతాలన్నింటినీ కలిపి అధ్యయనంచేస్తే మానవజాతికి లభించే సందేశం ఏమిటి ?

## అనాది ప్రశ్నలు :

ఈ సృష్టి ఎక్కడినుండి పుట్టింది? దీన్ని ఎవరు సృష్టించారు? కంటికి కనపడని ఏ శక్తి - అతిసూక్ష్మంగావున్న 'అణువు హృదయంలోని 'పరమాణువు' నుంచీ -- 'గెలాక్సీ' దాకా క్రమబద్ధంగా పరిభ్రమించేటట్టు ఒక చక్కని గడియారంలాగ పనిచేసేలా నిర్మాణంచేసిన మహత్తర మేధస్సు -- ఈ విశ్వం వెనుక ఎక్కడ దాగివుంది ? ఈ రహస్యాన్ని ప్రాచీన మహర్షులకు యోగులకు అందించిన సందేశమే వేద మతం ! ఈ

ప్రపంచమతాలు ఈ విశ్వాన్ని సృష్టించిన శక్తి లేక భగవంతుని గురించి ఏమి చెపుతాయి ? అన్నదే ఈనాటి ఆనాటి ప్రపంచ సర్వమత పార్లమెంటు మహసభముందు నిలబడివున్న శేషప్రశ్నలు!

పై అధ్యక్షప్రసంగంలోని ఆర్తి, ఆవేదన, ఆ సందేశం తెలుసుకోవాలన్న జిజ్ఞాసయే -- ఈనాడు మనకి వేదకాలపు ఋషుల సందేశమైన హిందూమతాన్ని గురించి తెలుసుకోవడానికి మానవుడ్ని ప్రేరేపిస్తున్న ఏకైక కారణం !

భగవంతుడు సృష్టించిన ఈ విశ్వంలో, గ్రహమండలాలలో ఒకటైన భూమిపై నిలిచిన మానవుడికి ఆదికాలంలో ఇంకా సైన్సు, లేనట్టి రోజులలో దైవం ఇచ్చిన సందేశమే **వేదమతం!** ఇది, ప్రపంచ మతాలన్నిటిలోకి ప్రాచీనమైనది! వేదమతం గాని, వేదాలు గాని, ఏనాడు పుట్టాయో ఎవరూ చెప్పలేకపోతున్నారు! అసలు హిందూమతం ఎప్పుడుపుట్టిందో ఆ తేదీకూడా ఎవరూ పరిశోధించి తేల్చలేక పోతున్నారు ! కాని మిగతామతాలైన క్రైస్తవమతం క్రీస్తుతోనూ, మహమ్మదీయమతం మహమ్మద్‌తోనూ - బౌద్ధమతం బుద్ధుడితోనూ పుట్టాయని చరిత్రకారులు చెప్పగలుగుతున్నారు ! అలా చెప్పలేనిదీ అతి ప్రాచీనమైనదీ, అయిన సనాతనధర్మమే!! దీన్ని గురించి తెలిపే గ్రంధాలు ఈనాడు ఇంగ్లీషులోకాని, తెలుగులోకాని యదార్థాన్ని తెలిపేవి లేనేలేవు. అందుకే **"అణుయుగంలో హిందూమతం"** అనే ఈగ్రంధాన్ని యధాతధంగా నేను వ్రాయవలసివచ్చింది, మీ అందరి ఉపయోగార్థమే!

## సృష్ట్యాదిలోని ప్రపంచమతం

## మానవజాతి - ఆదిమ మతము ప్రాచీన వేదమతమే

ఈనాడు మనలో చాలామంది హిందూమతం అంటే-ఒక్క మనదేశంలోనే, మనగ్రామాల్లో మాత్రమే కొనఊపిరితో రూపురేఖలే మారిపోయి మీమనస్సుల్లో మిగిలివున్న మీరెరుగున్న మూఢవిశ్వాసాల కట్టయే,

అనుకుంటారు! అంతేకాదు! అలానే హిందూమతం కేవలం మన దేశానికే సంబంధించినది అని చదువుకున్నవాళ్ళు సహితం చాలామంది తెల్లదొరల చదువుల మాయలోపడి భ్రమిస్తారు! నిజానికి ఈ మతం పేరు హిందూమతమూ కాదు. ఇది కేవలం మనదేశంలో మాత్రమేవున్న మతమూ కాదు!

## ప్రపంచం అంతా – హిందూమతం :

ఈ విషయాన్ని గుడ్డివాళ్ళకుకూడా కళ్ళు తెరిపించే చారిత్రక త్రవ్వకాలు ప్రపంచంలో అన్నిదేశాలలోనూ దొరికినవి నిరూపించాయి! ఇలాంటివాటిలో తుర్కిస్థాన్‌లో గణేశుడు, చైనాలో గణపతి, సోవియట్ రష్యాలో తవ్వకాలు జరిగినచోటల్లా బయటపడ్డ గణపతి విగ్రహాల్లా, గుడ్డివాళ్ళకు, మూర్ఖులకు సహితం కనువిప్పు కలిగిస్తున్నాయి! ముస్లిం దేశాలలో దొరికే సంస్కృత మంత్రశాస్త్ర గ్రంథాలు ఆఫ్ఘనిస్తాన్‌లోనూ, తుర్కిస్థాన్‌లోనూ లభించిన మహాదేవుడు, శివుడు, మధ్య ఆసియాలో దొరికిన ఇంద్రుడు, బ్రహ్మ, గ్రీసుదేశంలో క్రైస్తవులు మతమార్పిడి చేయకముందు వేలసంవత్సరాల తరబడి అక్కడ నెలకొనివున్న భాగవత ధర్మము మధ్య ఆసియాలో లభించిన హిందూదేవతలు, చైనాలో బౌద్ధధర్మం ఇవన్నీ ఘంటాపదంగా ఋజావుచేస్తాయి – ఏమని ? అంటే హిందూమతం సృష్టి ప్రారంభం నుంచే భూమిపైన ఏర్పడివున్న ఆదిమ మతం అనీ ఇది మానవజాతి మూలపురుషుడైన మనువుతో ఈ భూమికి తేబడ్డదని ! అంతేకాదు, హిందూమతం అనబడే ఈ సనాతన వేదధర్మం ఈ ప్రపంచం అంతటా మానవజాతికి ప్రాచీనకాలంలో వుండి వున్న– ఏకైక ప్రపంచమతం (World Religion) అని ఈ చారిత్రక త్రవ్వకాలు రుజావు చేస్తున్నాయి.

## ప్రాచీన మతాల అడుగున – హిందూ దేవుళ్లు!

ఒకవేళ విగ్రహాలు తర్వాత కాలంలో విదేశాలకు హిందూమతం వ్యాపించినవి అని తెల్లదొరల పక్షపాతం విడిచిపెట్టడం ఇష్టంలేని కుహనా

చారిత్రక పరిశోధకులు వాదించినా ప్రాచీన మతాలలో సైతం లభించిన సాక్ష్యాలు చూడండి!

ఈజిప్టులో సింహంతలతో మనిషిశరీరంతో లభించిన నరసింహమూర్తి. ప్రాచీనగ్రీసులో లభించిన చతుర్ముఖ బ్రహ్మ, జపాన్‌లో శివపార్వతులు, సరస్వతి, పంచముఖ బ్రహ్మ - ఇవేకాక రోమ్ అంతటా ఆనాడు వ్యాపించిన హిందూ దేవుళ్ళు - ఇదంతా నేటి యూరప్ సంస్కృతికి మూలం హిందూమతమే అని ఇన్ని సాక్ష్యాధారాలు ఋజువు చేస్తున్నాయి. ఇలా కలిసికట్టుగా చెప్పుకుంటూ పోతే ఈ ప్రపంచ - సత్యం యెక్క నిజం, చాలామంది బుర్రలకు ఎక్కదు. అందుకని నేను కష్టించి దేశ విదేశాలలోని దేవుళ్ళ చిత్రాలు ఫోటోలు ఇతర సాక్ష్యాధారాలతో సహా సేకరించినవి సంగ్రహంగా ఈ తరువాతి అధ్యాయాలలో మీకు అందిస్తున్నాను ! ఇవి జాగ్రత్తగా పక్షపాతంలేని మనసుతో చదివి, మన కాలేజీలలో చదువుకునే చరిత్రవల్ల ఈ ప్రాచీనమైన వేదాలకు ఎంత ఘోరమైన అన్యాయం జరుగుతోందో గ్రహించడానికి ప్రయత్నించి, రానున్న తరాల చిన్నపిల్లలకైనా సరైన హిందూమతం బోధించే సద్బుద్ధి దేశభక్తి మీలో కొందరికైనా కలగాలనే ఆశతోనే ఈ అధ్యాయాలు మీ ముందుంచబోతున్నాను !

రామాయణంలో పుష్పకవిమానం గురించి ఎవరైనా ఉదహరిస్తే... ఈనాటి, ఆధునికులమనుకునే కొందరు ప్రబుద్ధులు - దాన్ని పుక్కిటి పురాణాల కథ అని కొట్టిపారేయటం మామూలుగా మనం ఎక్కడ బట్టినా చూస్తూంటాము! అందులోనూ, వారపత్రికలపైన బతికే బూటకపు ఆధునికులు, మిధ్యా సైన్సువాదులు మన సంస్కృతిలో ఏమీలేదని వాదించే విదేశీ మానస పుత్రులు, మన వేదాలగురించీ పురాణాల గురించీ తరచుగా విమర్శలు చేసేవారు విసిరే అజ్ఞానపు విసురులూ ఇటీవల కొందరు రష్యన్ సైంటిస్టులు, జర్మన్ రచయితలూ, జెకోస్లోవాకియాలోని పరిశోధకులూ బయలుపరిచిన విశేషాలు వింటే ఆశ్చర్యపోతారు!

సోవియట్ రష్యా పరిశోధకుడు ఐ. జైట్‌సేవ్ (I. Jaitsev) హిందూపురాణాలు రామాయణ మహాభారతాలలోని విమానాల గురించి, అంతరిక్ష నౌకలగురించి ఎంతో పరిశోధన చేశాడు. ఈయన ప్రచురించిన పరిశోధనా గ్రంథము 'ఎగిరే విమానాలు – ఆలయ విమానాలు' ("Temples and Space-ships") అనే పుస్తకంలో అనేక ఆశ్చర్యకరమైన విషయాలను వెల్లడించారు. అందులో ముఖ్యమైన విశేషం ఒకటి ఉన్నది -- ఈనాటి ఆధునికుల మనుకునేవారు, ప్రాచీన యోగశాస్త్రాలపై విరుచుకుపడే భారతీయసంస్కృతి ద్వేషులు ప్రత్యేకించి గమనించవలసిన విషయమిది.

ఈనాటి సైన్సుయుగము ప్రపంచంలో ఉదయించకపూర్వం, బహుశా కొన్నివేల సంవత్సరాలకు పూర్వమే ఈ భూమిమీద ఇతర గ్రహాలనుంచి, వేరే గ్రహమండలాలకు సంబంధించినవారు, మానవజాతికంటే కొన్నివేల సంవత్సరాలు సైన్సులోనూ, విజ్ఞానంలోనూ పురోగమించినవారు ఈ భూమిమీదకు వచ్చి దిగారని ఈ మహాసత్యం ఎంతో విప్లవాత్మకమైంది. !!!

## రష్యనుల పరిశోధనలు :

ఇదే గనక నిజమైతే, ఈనాడు మనం నమ్మే మానవచరిత్ర అంతా తల్లకిందులైపోతుంది! ఒక్క చరిత్రే ఏమిటి? సైన్సు గురించి ఈనాడు మనకున్న ఆలోచనలన్నీ ఒక్కసారిగా గల్లంతైపోతాయి. ఇందులో మొదటిది - ఈనాడు అంతరిక్ష నౌకలు, రాకెట్లు నిర్మాణం చేయబడిన సాంకేతిక వివరాలతో సరిపోయేలాగ సరిగ్గా రామాయణంలోని పుష్పక విమానంయొక్క వర్ణనలు తు.చ. తప్పకుండా సరితూగుతున్నాయని రష్యన్ శాస్త్రజ్ఞుడు 'జైట్సేవ్ ఋజువు చేయటమే!

## జర్మను పరిశోధకులు – పురాణాలు :

అంతేకాదు జర్మన్ పరిశోధకుడు 'ఎరిక్ డానికిన్' ప్రపంచంలోని అనేక ప్రాచీన శిథిలాలను ఇతర చారిత్రక స్థలాలను పరిశోధించి కనుగొన్న

ఆశ్చర్యాలు, వింతలూ. సరిగ్గా రష్యన్ పరిశోధకుని సైన్సు పరిశోధనలతో సరిపోవడమే!

ఈయన ప్రాచీన దేశాలయిన ఈజిప్టు, ఆఫ్రికా, లాటిన్ అమెరికా, మెక్సికో. చిలీ, పెరూ వంటి దేశాలలోని పురాతన మతగ్రంధాలను పరిశోధించి సరిగ్గా మన హిందూపురాణాలలో కనబడే వర్ణనలలాంటివి హిమాలయాల గురించి, అంతరిక్షయానం గురించిన సాంకేతిక వివరాలతోవున్నవాటిని ప్రపంచం దృష్టికి తీసుకొచ్చాడు. ఈయన రాసిన దాదాపు పది పుస్తకాలు **"The Chariots of the Gods"** అన్న గ్రంధము **"The Gods and Their Grand Design"** అన్న గ్రంధము **"In Search of Ancient Gods"** అనబడే పరిశోధనా గ్రంధాలలో **Erik-Danikin** రాసినవి **Miracles of the Gods, Signs of the Gods' Return to the Stars** అన్న పరిశోధనా గ్రంధాలు అటు యూరపు ఇటు అమెరికా దేశాలలోనేకాకుండా చివరికి నిద్రపోతుండే మన దేశంలోని మేధావులను సహితం ఆశ్చర్యంలో ముంచివేశాయి.

ఇందులో కేవలం పురాణాల గాధల్ని పట్టుకొని, దానిపైన ఊహలు, కల్పనలు, వాదప్రతివాదాలుచేసే మామూలు విమర్శ సాహిత్యంలాగ కాకుండా - డానికిన్ స్వయంగా తానుచూసిన ప్రదేశాలను యధార్ధంగా ఫొటోలుతీసి అక్కడ దొరికిన శిల్పాలతో, చిత్రాలు ఇంకా ప్రాచీన విశేషాలతో బోలెడన్ని విశేషాలతో సహా ప్రచురించాడు. అవన్నీ ప్రచురించాలంటే కనీసం మూడు, నాలుగు గ్రంధాలవుతాయి. ఇందులో హిందూ సంస్కృతిని పురాణాలలోని గాధలను దుమ్మెత్తిపోసి బ్రహ్మజ్ఞానం అన్నా, బ్రాహ్మణ సాహిత్యం అన్నా కళ్ళల్లో నిప్పులు పోసుకునే మన విదేశీ మానసపుత్రులకు తెలియనివి అనేకం వున్నాయి.

## దేవతల - విమానాలు :

అందులో మొదటి పరిశోధనా సత్యం కొన్నివేల సంవత్సరాల క్రితం

భూమిమీద విమానాలు తిరిగేవనీ, అంతేకాకుండా ఇతర గ్రహాలనుంచి భూమికి ప్రయాణించగల అంతరిక్షనౌకలు ఈ భూగోళంమీద వాలటం కూడా జరిగిందని తెలిపే పరిశోధనలు మన కళ్ళు తెరిపిస్తాయి! ఇది మొదటి సత్యం.

ఇకపోతే రెండవ విశేషం ఏమంటే ఇతర గ్రహాలనుంచి భూమ్మీదికి వచ్చిన ఈజాతి, ఈనాడు మనకంటేకూడా కొన్ని వేలసంవత్సరాల సైన్సు పురోగతిలో ముందువుండేవారని తేలిన పరిశోధనాసత్యం! ఆనాటి మానవజాతి ఇతర గ్రహాలనుంచి భూమ్మీదకు దిగిన ఈనూతన విమానాలను దాంట్లోంచి వచ్చిన సైన్సుపరికరాలను చూసి దిగ్భ్రాంతులై వాళ్ళను దేవుళ్ళుగాను వారు ఉపయోగించిన లేజర్‌వంటి సైన్సు పరికరాలను; అణుశక్తి ఆయుధాలను దేవతల అస్త్రాలుగానూ వర్ణించారనీ - ఈ దృష్టితో చూస్తే ప్రాచీన దేశాల సాహిత్యంలో ఇతర గ్రహమండలాలలోంచి భూమికి దిగిన అతిమానుష జాతి వదిలివెళ్ళిన విజ్ఞానము, సైన్సు తెలిపే ప్రాచీన సాహిత్యం ఎంతో వున్నదని! ఈ సాహిత్యాన్ని అంతా సైన్సుదృష్టితో ఈనాడు సైన్సుయుగంలో జీవిస్తున్న మనం చేపట్టవలసినపరిశోధన ఎంతోవున్నది - ఇది రష్యన్ పరిశోధకులు కనుగొన్న రెండవ మహాసత్యం.

ఇలా ఒక్క రామాయణంలోనే కాక మానవుడు అంతరిక్షంలో ప్రయాణం చేయటం ఇతర గ్రహాలకూ, వేరే లోకాలకూ వెళ్ళిరావడం మొదలైన అంశాలు భాగవతంలోనూ, మహాభారతంలోనూ వివరాలతో సహా వర్ణించబడివున్నాయి. వాటిని ఆధారం చేసుకొని జర్మన్ పరిశోధకుడైన "రిక్ డేనికిన్" "దేవతలూ వాళ్ళ రథాలు" అన్న పరిశోధనాగ్రంథంలో ఎన్నో వివరాలతో సాంకేతిక ఇంజనీరింగు విశేషాలతోసహా వివరించారు. దీనివల్ల పుక్కిటి పురాణాలు అనుకుని పౌరాణికుల అతిశయోక్తి వర్ణనలు అని, శతాబ్దాలుగా తెల్లదొరలు కొట్టిపడేసిన పురాణాలలోని అనేక విశేషాలను, అవి ఒకనాటి సైన్సు యుగానికి సంబంధించిన జ్ఞాపకాలని సహేతుకంగా నిరూపించారు!

విశేషమేమంటే ఈ పురాణాలలోని సైన్సురహస్యాలను నిరూపించినవాడు హిందువుడు కాదు!! విదేశీయుడు! ఆపురాణాల మీద దుమ్మెత్తిపోసుకొని తమ సంస్కృతిని తామే తిట్టుకుంటూ ఆత్మహత్యా మనస్తత్వంతో కుళ్ళుతున్నారు మనదేశ సైంటిస్టులు విదేశీ భావదాస్యంతో బతుకుతున్న మనవాళ్ళు కాదు!

ఇంకా మహాభారతంలో అర్జునుడు ఇంద్రలోకం వెళ్ళడం భీముడు ఆకాశంలోకి ఎగిరే రధంలో అంతరిక్షయానం చేసి తిరిగి రావడమూ కనిపిస్తుంది! ఈ రధాల వర్ణనను గనక గమనిస్తే అవి ఈనాడు ముఖాలకు రంగులుపూసుకున్న మన సినిమా హీరోలు ఎక్కితిరిగే గుర్రపు బగ్గీలవంటి రధాలు కావు! అని తెలిసిపోతుంది.

"తే రథై ర్నగరా కారైః కంపయంతో వసుంధరామ్"

ఇక్కడ వ్యాసమహర్షి రథములను నగరములవంటి ఆకారము కలిగినవి అని వర్ణిస్తున్నాడు! మాములు తెలుగు సినిమా రధాలైతే అవి నగరాలలాగ వుండవుకదా? మరి, నగరాకారంవంటి రథం అంటే అర్ధం ఏమిటి? అని పరిశోధకులు ఆలోచించగా ఒక అద్భుత విషయం తేలింది.

విమానంలోంచి చూస్తే అమెరికా రష్యావంటి దేశాలలో "నాసా" వద్ద తీసిన ఫోటోలు గమనిస్తే అవి అంతస్తులు అంతస్తులుగా కట్టబడి ప్రయోగానికి సిద్ధంగావున్న రాకెట్లను అంతస్తులా కనిపించే నగరంవలెనే ఆనాటి వారి పోలికసరిగ్గా ఈనాటి మనకి సరిపోతుందీ వర్ణన.

"తేరథైర్నగరా కారైః"

అన్న పై వ్యాసమహర్షి వర్ణనకు సరైన సాంకేతికపరమైన అర్ధం ఈనాటి జర్మన్, రష్యన్ సైంటిస్టుల దగ్గర్నుంచి రావటమే గమనార్హము.

అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళి అక్కడ అంతకాలం గడిపి తిరిగి

భూలోకానికి వచ్చినపుడు ధర్మరాజు అతనికి స్వాగతం చెప్పటం, అర్జునుడు దేవలోకానికి వెళ్ళినప్పటికన్న మరింత యవ్వనవంతుడు గానూ మరింత చిన్నవయస్సు లోనూ కనబడటం అంతా ఎలా సాధ్యం?

దీనికి సరైన అర్థం తెలియాలంటే ఐన్‌స్టీన్ పరిశోధనలలోని రెలెటివిటీ సిద్ధాంతము **(Theory of Reditivity)** గూర్చి తెలియాలి. ఆకాశంలో మన సూర్యమండలం దాటి కాంతికంటే వేగంగా ప్రయాణం చేస్తే ఏం జరుగుతుంది అన్న విషయం ఐన్‌స్టీన్ కనుగొన్న సాపేక్ష సిద్ధాంతంలో గోచరిస్తుంది. ఏదైనా వస్తువు కాంతికంటే వేగంగా ప్రయాణిస్తే అప్పుడు కాలమానంలో వెనక్కు ప్రయాణిస్తుంది- అని సైన్సు కనుగొన్న మహాసత్యం.

కాబట్టి భూమండలం ఇతర గ్రహమండలాలుదాటి కాంతి వేగంతో ప్రయాణించిన రాకెట్ అనగా దేవతల రథంలో ప్రయాణించిన అర్జునుడు కాలంలో వెనక్కు ప్రయాణించి వయస్సులో చిన్నవాడుగా కనిపించటానికి సైన్సు పరమైన వివరణ ఇదే!

అంతేకాదు, అర్జునుడు జీవిత మధ్యకాలంలో మీసాలులేని పేడిమూతి వాడనికూడా మహాభారతంలో వర్ణించబడినది. కాలంలో ప్రయాణించేటప్పుడు గడ్డాలు, మీసాలుగల వ్యక్తి జీవితకాలంలో వెనక్కు ప్రయాణిస్తే ఆ మీసాలు మాయమై చిన్నవాడుగా కనబడటం భూమ్మీద అందరికీ కనిపించటానికి కారణమైంది. అంతేకానీ అతను నిజంగా మగతనాన్ని కోల్పోలేదని ఇంకో విషయంవల్ల కూడా తెలుస్తుంది. అదేమంటే, అర్జునుడు మగతనం కోల్పోయినవాడైతే సంతానం కలగటం అసంభవంకదా? కాని తరువాత కాలంలో అర్జునుడు సుభద్రను వివాహం చేసుకున్నప్పుడు వారికి అభిమన్యుడు పుట్టడం, మణిపురం నాగకన్యతో వివాహం అయినప్పుడు బభ్రువాహనుడు పుట్టడంవల్ల అసలది నిజంగా మగతనం కోల్పోవడం కాదు! ఇది అంతరిక్షయానంలో వయస్సు వెనక్కు జరగటంవల్ల జరిగిన మార్పేనని

తెలుస్తోంది?

అంతేగాక అర్జునునికి కలిగిన పేడితనంకూడా ఈ తరువాత సమయంలో అంటే భారత యుద్ధం ముందు లేనట్టుగా వర్ణించబడింది. అందరు రాజులకువలెనే మీసములవంటి పురుష చిహ్నములు కలిగిన రాజశ్రేష్ఠుడుగా అర్జునుడు వర్ణించబడ్డాడు. (చూ. విరాటపర్వం ఉత్తర గోగ్రహణం) ఇది అంతరిక్షయానంలోని సైన్సు రహస్యాలను గురించి పరిశోధన తెలిపే సత్యం?

## భాగవతంలో అంతరిక్ష విమాన యాత్రలు

వ్యాసమహర్షి భాగవతంలో ఈభూమిమీద మానవసృష్టి ఎలాజరిగిందో చాలా విచిత్రంగా వర్ణించాడు. అది ఈనాటి డార్విన్ సిద్ధాంతానికి పూర్తిగా వ్యతిరేకం.

మానవజాతి ఈ భూమ్మీద కోతులనుండి ఉద్భవించలేదు డార్విన్ అనుకున్నట్లుగా ! దేవతలు అనబడే ఇతర గ్రహమండలాలనుంచి వచ్చిన బుద్ధిజీవులు భూమ్మీద విమానాలలో దిగి ఎన్నో సైన్సు పరిశోధనలు చేసిన ఫలితంగా ఈనాటి మానవజాతి ఉద్భవించింది. కృత్రిమ గర్భధారణవంటి ప్రయోగాల ద్వారా అనేక రకాల రూపాలు కలిగిన మానవస్వరూపాలను సృష్టిచేశారు.

దివ్యపురుషుల ఈ జాతిని మాతృకగా తీసుకొని మానవజాతి అభివృద్ధిచేయబడినది. ఇది భాగవతంలో వ్యాసమహర్షి వర్ణించిన సృష్టిక్రమం వివరణః

అందుకే మానవజాతి మాతృకలను ప్రసాదించినవారు శతరూప (అనేక రూపములు కలది) తల్లియనీ, తండ్రి (జనకుడు) కర్దమ ప్రజాపతి అనీ, వర్ణించబడినది. "ప్రజాపతి" అంటే అర్థం సృష్టిని రూపొందించిన వైజ్ఞానికులైన పెద్దలు అని అర్థం. అలాకాక ప్రజాపతిఅంటే బైబుల్ లో వర్ణించినలాగ ఒక్క

ఆదిమానవుడు కాదు. ఇదెలాగ తెలుస్తుందంటే, భాగవత పురాణంలో ప్రజాపతులు అనేకమంది వున్నట్టు వర్ణించబడివుంది కాబట్టి ప్రజాపతి అంటే అర్థము మానవజాతిని కన్న ఒకే మూలపురుషుడుకాదు అని తెలుస్తోంది. అందుకే ప్రజాపతులు అనేకమంది వున్నారు.

## "కర్ధమ" – అంటేః

కర్ధమ ప్రజాపతి అన్న పేరుకూడా చాలా అర్ధవంతమైనది. సంస్కృతంలో కర్ధమం అంటే జిగురువంటి, బురదవంటి జిగురు పదార్ధం అని అర్ధం! మరి ఈ కర్ధముడు అనేక యుగాలకు ప్రాచీనమైనవాడని జీవులందరికీ ప్రజాపతి అంటే దీనికి అర్ధం ఈనాటి సైన్సుకు అంతుపట్టని ఒక పెద్ద ప్రక్రియ? ఇతర గ్రహమండలాలనుంచి ఈనాడు రాకెట్లు అనబడే దేవతల రధాలనుండి దిగివచ్చిన బుద్ధిజీవులు చేసిన ఈ ప్రక్రియవల్ల ఈ కర్ధముడు శతరూప వల్ల మానవజాతి కలిగినట్లు వర్ణించటంలో గల రహస్యం ఇదే!!

అంతేగాక మొదటిది అయిన స్వాయంభువ మన్వంతరంలో (స్వయంభువ=తనంతట తాను పుట్టినవాడు అనగా తల్లి తండ్రులు లేకుండా జన్మించినవాడు) సైన్సు ప్రక్రియద్వారా జన్మించినవాడని, రహస్య ఆయన భూమికి విమానంలోనే వచ్చినట్టు వర్ణించబడింది.

స్వాయంభువ మనువు దేవతలు ఇచ్చిన విమానంలో భూగోళమంతా స్వేచ్ఛగా తిరిగినట్లు ఈ విమానయానం మానవజాతి ఆదినుంచీ వున్నట్లు వర్ణించబడివున్నది అంటే దేవతలు అనబడే బుద్ధిజీవులు విమానం ద్వారా ఈ భూగోళంపైన మానవజాతి సృష్టిని తయారుచేసి నిలబెట్టారన్నమాట.

## సైన్సు పరిశోధనా ధృష్టితో–హిందూ మతం

అందుకే ఈనాటికీ విమానాల గురించిన వాటి యంత్రవిభాగాలు గురించిన సంస్కృత గ్రంథాలు ప్రాచీన ఋషుల పేరుతో రచించి

వున్నాయి. అందులో ఒకటి భరద్వాజ మహర్షి రచించిన విమానసంహిత. ఇక రెండవది మరీచిమహర్షి కృతమైన విమానార్చనా కల్పం. రష్యన్ సైంటిస్టు జైట్‌సెవ్ రాసిన టెంపుల్స్ అండ్ స్పేస్ షిప్స్ (Temple and Space Ships) అన్న గ్రంథంలో మన ఆలయాలలోని గోపురం పైభాగాన్ని విమానం అని పిలవటంలో అర్థం ఏమిటో సైన్సు పరంగా ఇలా విశ్లేషించాడు.

అంతరిక్షంనుంచి భూమ్మీదవాలి దేవతల రాకెట్లనుచూసి, భూమి మీద కాపీలుగా (నమూనా) నిర్మించినందువల్ల "విమానం" అన్న ఈ పేరు వచ్చింది. మరీచి అనే మాటకు సంస్కృతంలో కిరణం అని అర్థము వుంది. వేదంలో బ్రహ్మకిరణం మరీచీనాం పదమిచ్చంతి వేధసః అని వర్ణించబడినది. ఈనాడు సైన్సు పరిభాషలో కాంతికిరణంగా పరిగణింపబడుతున్నలేజరు ఇదేనేమో?

దీనికి ఒక ఉదాహరణ కనిపిస్తుంది. ఈనాడు మనం ఏగుడికైనా వెళ్ళి ఆలయ విమానం నాలుగువైపులా తిరిగి పరిశోధనా దృష్టితోచూస్తే మనకు కనిపించేదేమిటి? ఎగిరే రెక్కలు కలిగిన సింహాలూ, శరభాలో లేక రెక్కలు కలిగిన గరుడునివంటి సగం మనిషిలా అంతరిక్షయానాన్ని సూచించే విగ్రహ ప్రతీకలూ!! వీటన్నిటి గురించి మనం బాగా ఆలోచించాలి. సైన్సుదృక్పథంతో ఆలోచించాలి. దీనికి ఈనాటి సైన్సుగురించిన అవగాహన ఎంతో కావాలి. అంతేకాదు మన ప్రాచీన శాస్త్రాలు గురించిన అవగాహనకూడా చాలా కావాలి. ఇంత మాత్రమే చాలదు. మన శాస్త్రాలనూ పురాణాలను, విమర్శనాదృష్టితో పరిశీలించాలి. అదికూడా ఎంతో సానుభూతితో సైన్సు దృష్టితో చూడాలి. కేవలం తర్కంతోకాదు, సైన్సు దృష్టితోటి చేసేవిశ్లేషణ దీనికి అవసరం. అన్నిటికన్నా విశాల దృక్పథం కావాలి ! ఇది ఈనాటి భారతీయులమైన మనకు వున్నాయా? లేకపోతే విదేశీయులైన జర్మనులు, రష్యన్లు చేస్తారు. కనీసం అదిచూసి అయినా నేర్చుకుందాం. మన ప్రాచీన సంస్కృతికి మూలధనమైన వేదాలను, పురాణాలను, దానికి రక్షకులైన బ్రాహ్మణాలను,

వేదాలకు మూలకారణమైన బ్రాహ్మణులను, బ్రాహ్మణ సంస్కృతిని ఇకనైనా దుమ్మెత్తిపోయటం ఆపుదామా! ఇకనైనా ఆలోచిద్దామా?

హిందూమతం అంటే ఇంతవుంది! ఇంకా ఎంతవుందో తెలియదు పరిశోధకులకే? అయితే ఈనాడు హిందూమతం అంటే అందులో ఏముంటుందో తెలియనివాడే హిందువుడు ! హిందూమతంఅంటే ప్రపంచంయొక్క పుట్టుక, పంచభూతాలయొక్క ఉత్పత్తి, కాలంయొక్క కొలతలు, జనన మరణాలను తెలిపే పునర్జన్మసిద్ధాంతం, కష్ట సుఖాలను కలిగించే కర్మసిద్దాంతము, కర్మ నివృత్తి చేయగల యోగశాస్త్రము, ధ్యానము, అవతార సిద్ధాంతము చాతుర్వర్ణ వ్యవస్థ మంత్రములు వాని రహస్యములు, పూజ, జపము దాని విధానము, జననమరణాలను దాటి చివరకు మనిషి ఆత్మ చేరుకోవలసిన గమ్యం (మోక్షం) అంటే ఏది? ఇదివరకు ఇలా ముక్తిపొందినవారు సాధించిన యోగసిద్ధులు ఆధ్యాత్మిక జ్ఞానము, దైవిక శక్తులు యదార్ధమా ? అది కదిలించే కుండలినీ శక్తి అంటే ఏమిటి ?

మనిషి అంటే ఈ కనపడే మాంసపు శరీరమేనా ? మరణించినపుడు బయటకు పోయే జీవుడు దీనిలోపల ఎలావుంటాడు? తిరిగి ఆ జీవుడు జన్మించే ప్రక్రియ ఎలా జరుగుతుంది ? మరణానికీ జననానికి మధ్య ఆత్మలు ఏస్థితిలో ఎక్కడవుంటాయి ?

అనే శతకోటి సమస్యలకు ప్రాచీన వేదాల్లోని సమాధానాలే ఈనాడు దిక్కు! ఇవి మహర్షులు విశ్వాత్మఅయిన పరమాత్మనుంచి యోగంవల్ల ధ్యానంవల్ల తెలుసుకున్న సమాధానాలే ఇవి ! ఇటువంటి ఆధ్యాత్మికసత్యాలు ఎన్నో వున్నాయి. అవన్నీకలిసి వేదమతం లేక సనాతనధర్మం అనబడే ఈనాటి హిందూమతానికి మూలం ఈ ప్రాచీనవిజ్ఞానమే !

ఇలాటి ప్రాచీనవిజ్ఞానము మనదేశ సంస్కృతికి పునాదిగా వున్నది. మనదేశ చరిత్ర వెనక మనల్ని వేలాది సంవత్సరాలు దండయాత్రలతో

శ్రుతువుల రక్తపాతాలతో బానిసత్వంతో ఛిన్నాభిన్నం కాకుండా నిలబెట్టినశక్తి ఈ సనాతనధర్మమే ! ఈనాడు అనేక రాష్ట్రాలు అనేకభాషలు అనేక జాతులు మనుషులు కలిసిన ఈ హిందూదేశాన్ని ఒక్కదేశంగా ఒక్కత్రాటిపై నడసిన 5000 సంవత్సరాల చరిత్రవెనక మనల్ని ఐక్యం చేసివుంచిన జాతీయశక్తి ఈ వేదమతమే!

## భౌద్ధ-సిక్కు మతాలకీ హిందూ మాతృక

గురునానక్ - హరిమందిర్ హరినామ్ హరిభజన అంటూ ఉపాసించింది ఈమతాన్నే! బుద్ధుడు కర్మసిద్ధాంతం జాతక కథలు కర్మచక్రం అంటూ వ్యాఖ్యానించిందికూడా ఈ సనాతనధర్మమే! సైన్సు చేసే ఆటంబాంబుల ప్రళయాలతో విసుగెత్తిన మానవజాతికి ప్రపంచ యుద్ధాలతో రక్తపాతాలతో నీరసించిన ప్రపంచదేశాలకు అహింసాజ్యోతి ఒక్కటే బ్రతికివుండేలా నిలిపే ఆధ్యాత్మికశక్తి !

ఈశక్తి మనకి ఎక్కడినుండి వచ్చింది ? ప్రాచీనఋషుల సనాతన ధర్మమే ! గాంధీ మహాత్ముడి జీవితాన్ని వెలిగించిన జ్యోతి ఎక్కడనుండి వెలిగింది ? ఈ సనాతన ధర్మంనుంచే! దీని స్వరూపమేమిటి ? దీని సందేశం ఏమిటి ? అన్న ప్రశ్నలకు సమాధానమే ఈ గ్రంథం ! మొదటి అధ్యాయం జాగ్రత్తగా చదివితే ఇది ఏ వెలుతురును మీకుచూపించే లాంతరువంటి దీపమో ఆవెలుగు చూడవచ్చును - వెళ్లండి ! ఈ మొదటి అధ్యాయం తలుపు తెరుచుకొని హిందూమతంలోకి ! అనేక కొమ్మలుగల ఈ హిందూమతం అడుగున మానుగా నిలిచివున్న వ్యాసమహర్షి వేదాలను విభాగించి మనకిచ్చిన విజ్ఞానమే ఈనాడు మీకు అందిస్తున్నాను! అందుకోండి! దేవతల రుణాన్నితీర్చుకోండి ! జీవితలక్ష్యాన్ని తెలుసుకోవాలంటే మనదేశం ఏమిటో తెలియాలంటే మనసంస్కృతిని గురించి తెలుసుకోవడానికి మీకీదీపం అవసరం.



3

# జపాన్‌లోని హిందూ దేవుళ్ళు

చాలామంది ప్రాచీనకాలంనుంచీ జపాన్‌లోకూడా హిందూమతం వ్యాపించి వున్నట్లు వ్రాస్తే నమ్మలేరు కూడా! అందుకని, జపాన్‌లో దొరికిన అనేక విగ్రహాల లేఖాచిత్రాల నమూనాలు ఇక్కడే ఉదాహరణగా ఈ క్రింద చూపబడ్డాయి.

హిందూమతం జపాన్‌లోకి క్రిష్టియన్ మతంలాగ ప్రచారాల ద్వారా మతప్రచారకులద్వారా ప్రవేశపెట్టబడినది కాదు. అలా జపాన్‌లో ప్రవేశపెట్టబడింది బౌద్ధమతం ఒక్కటే -అశోకుని కాలంలో. ఆ తరువాత బౌద్ధమతం చైనాకూ, బర్మాకూ వ్యాపించినప్పుడే జపాన్‌లోకూడా వ్యాపించింది. కాని అంతకుముందే ప్రపంచమంతటా నెలకొని వున్న హిందూమతం ఏ ఒక్కరిచేతా వ్యాప్తి చేయబడినది కాదు.

దీనికి కారణం బౌద్ధమతాన్ని ప్రచారంచేసిన బుద్ధునిలాగ, క్రీస్తు మహమ్మదులలాగ "హిందూమతానికి" ఒక్క ప్రచారకుడుగానీ, స్థాపకుడు కానీ లేడు. అలాగే బౌద్ధ భిక్షకులవలెనూ, క్రిష్టియను ఫాదర్‌లలాగ

పనిగట్టుకొని మతప్రచారం చేసే ప్రచారకులు హిందూమతానికి నాటికీ... నేటికీకూడా లేకపోవడమే కారణం.

దీనికి మరొక్క కారణం కూడా వున్నది. అదేమిటంటే ఇతర మతాలలో వున్నట్లు 'మతం–మార్పిడి' హిందూమతంలో లేకపోవడమే. ఇది ఈనాటికీ కూడా మనకు కనబడుతున్న యదార్థ సత్యం.

ఈ కారణాలవల్ల జపాన్‌లో వున్న హిందూమతం - ఆ దేశంలో సహజంగావున్న ఆదిమ సంస్కృతిలో ప్రధాన మతం అని తెలుస్తున్నది. దీనికి జపాన్‌లో దొరికిన హిందూదేవుళ్ళ విగ్రహాలే, నిదర్శనాలు - ఇవి ఎవరూ కాదనలేని చారిత్రక సత్యాలు.



***Naraen-Das***

జపాన్‌లో కనిపించే దేవతలలో ముఖ్యమయినవాడు 'గణపతి' - ఆ తర్వాత 'విష్ణుమూర్తి'! జపాన్‌లో విష్ణుమూర్తి 'నారాయన్-దాన్' (Narean - Dan) అన్న మూర్తిగా గుర్తించవచ్చు. సంస్కృతంలోని "నారాయణ" అన్న శబ్దమే జపాన్‌లో 'నారాయెన్'గా మారినట్లు ఋజువవుతుంది.

## కంబోడియా విష్ణువు :

గరుడవాహనుడయిన విష్ణువు ఒక గ్రద్దమీద కూర్చుని వున్నట్లు చెక్కబడి వున్నది. కుడిచేతిలో చక్రము, తలపైన కిరీటము, మెడలో కౌస్తుభమణి అన్నీ స్పష్టంగా చెక్కబడి వున్నవి. అంతేకాక చెవులకు రెండువైపులా 'మకర-కుండలములు' మొసలి ఆకారంలో స్పష్టంగా కనబడేలాగు చెక్కివున్నవి ఈ శిల్పంలో గమనార్హమైనవి! గరుడ వాహ నుడైన నారాయణునిగా దీన్ని చరిత్రకారులు గుర్తు పట్టారు.



**విష్ణువు (జపాన్)**

## జపాన్‌లో బ్రహ్మ :

హిందూదేశంలో బ్రహ్మకు దేవాలయములు కనిపించవు -ఎక్కడో ఒకటి రెండుచోట్ల తప్ప. అలానే బ్రహ్మకు ఆరాధన కూడా లేదు. కాని జపాన్ లో చెక్కబడ్డ శిల్పాలలో అందమయిన చతుర్ముఖబ్రహ్మయొక్క మూర్తి చూడముచ్చటగా కనిపిస్తుంది.

ఈ విగ్రహములో బ్రహ్మదేవుడు మూడవనేత్రంతో (జ్ఞాన నేత్రంతో) స్పష్టమయిన జపానీయుల ముఖకవళికలతో చెక్కబడి వున్నాడు. ధోవతి (పంచ) మాత్రం హిందువులు కట్టినట్లు కుచ్చెళ్ళుపోసి కట్టుకున్నాడు. ఒక చేతిలో నిటారుగా పైకి మొలిచిన పద్మము బాగా విచ్చుకున్నట్లుగా, రేకలు విప్పారివుండి వాటిమధ్య స్పష్టంగా కనబడే తామర బొడ్డును (కర్ణిక) చిత్రంలో చూడనచ్చు. కుడిచేతితో వరమిస్తున్నట్లు వరదహస్తం ఎడమచేతిలో కమండలం ఉద్ధరిణెలతో చెక్కబడి ఉన్నాయి. ఈ కమండలం ఆకారం అమృత కలశంలాగ గుండ్రంగా చెక్కబడి వుంది. దీనికి కారణం బ్రహ్మత్వంవల్లనే అమృతత్వం సిద్ధిస్తుంది - కనుక బ్రహ్మత్వానికీ, అమృతత్వానికీ ప్రతీకగా కమండలం చెక్కబడి వుంది. కుడిచేతిలో శూలం వజ్రాకారంలో చెక్కబడి వుంది. దేవతలకు రాజైన ఇంద్రుని ఆయుధం వజ్రం - అది సూచించి నందువల్ల దేవతా సార్వభౌముడని సూచన!

పెద్ద తామరపువ్వులో పద్మాసనంలో కూర్చునివున్నట్లు చెక్కిన ఈ బ్రహ్మదేవుని విగ్రహంలో మనకింకొక్క విశేషం కనబడుతుంది. బ్రహ్మయొక్క మూడు ముఖాలు వరుసగా వుండి, నాలుగవ ముఖం పైగా వున్నట్లుగా చిత్రించబడి వుంది. కొందరు చిత్రకారులు జపాన్ లోని ఈ బ్రహ్మను "ఐదు-ముఖాల బ్రహ్మ"గా గుర్తించారు. మన పురాణాలలోని గాథలనుబట్టి చూస్తే ప్రథమంలో బ్రహ్మకు ఐదు శిరస్సులున్నట్లు తెలుస్తోంది. కాలాంతరాన శివుడు ఒక శిరస్సును ఖండించగా అతనికి బ్రహ్మ హత్యాదోషం ఏర్పడి ఆ



**బ్రహ్మ (జపాన్)**

శిరస్సు చేతికి అతుక్కుపోయినట్లు తెలుపబడి ఉంది. దీన్నిబట్టి చూడగా జపాన్‌లోని బ్రహ్మను అతి ప్రాచీన మూర్తిగా పంచముఖ బ్రహ్మగా గుర్తించవచ్చును. (నాలుగవ శిరస్సు, చిత్రానికి వెనుక భాగాన ఉంటుంది).

## శివపార్వతులు :

జపాన్‌లో కనిపించే శివపార్వతులు హిందూశాస్త్రాలలో

వర్ణించినట్లుగా స్పష్టంగా గుర్తించగలిగినవే. ఇందులో శివుడూ, పార్వతీ ఇద్దరూ జపానీయుల దుస్తులలో చిత్రించబడి వున్నారు. ముఖకవళికలు, కనుముక్కు తీరుకూడా స్పష్టంగా జపానీయుల వలే కనపడుతున్నాయి. చెవులకు ధరించిన ఆభరణాలూ, తలపై కేశాలంకరణా, శిరోభూషణాలూ అన్నీ స్పష్టంగా జపానీయుల పద్ధతిలోనే మలచబడి వున్నాయి.

భారతదేశంలో శివపార్వతులు నందివాహనులుగా వర్ణించబడి వున్నారు. శివుడూ, పార్వతీ ఇద్దరూ కలిసి నందిపైన ఎక్కినట్లు చిత్రించబడి వుండుట మనం సామాన్యముగా చూస్తూంటాము. కాని జపాన్‌లోని శివపార్వతులు ఇద్దరూ చెరొక వృషభంపైనా ఎక్కి, ఆసీనులైనట్లు చిత్రింపబడడం ఒక



**శివపార్వతులు (జపాన్)**

గమనించదగ్గ విశేషం! అంతేకాక వారి చేతిలోని త్రిశూలం ఆకృతీ, వారు ఎక్కిన ఎద్దుల పోలికలూ జపాన్‌వే. ఎద్దులే గాక వారి ముఖకవళికలు కూడా జపాన్ పద్ధతిలోనే ఉన్నాయి. అయితే వారు కూర్చున్న భంగిమమాత్రం భారతీయ శిల్పాల భంగిమవలే కుడికాలు మడిచి ఎడమ పాదం క్రిందికి వాలిపోతున్నట్లుగా (సవ్యంపాదం ప్రసార్య.... దక్షిణం కుంచయిత్వా) చెక్కబడి వున్నాయి.

## సరస్వతి :

జపాన్‌లో కనిపించే ఇంకొక హిందూదేవత సరస్వతి! సరస్వతి వీణాపాణి అయివున్నట్లు వర్ణించబడింది మన పురాణాలలో! అయితే జపాన్‌లో చిత్రించిన ఈ సరస్వతి మామూలు మన 'వీణ'ను కాకుండా జపాన్‌లో వాయించే సంగీత వాయిద్యమునకు ప్రతిరూపం ధరించినట్లు చెక్కబడి వున్నది. ఈమె ఏకాగ్రతతో సంగీతం వాయిస్తున్నట్లుగా చిత్రించబడి వుంది. చేతి కంకణాలు, మెడలోని ఆభరణాలు, కాలి అందెలూ హిందూదేవుళ్ళను పోలి వున్నాయి. ముఖమూ, కేశాలంకరణా మాత్రం జపాను దేశపు స్త్రీలను పోలివుండడం స్పష్టంగా చూడవచ్చు.

## విష్ణుమూర్తి :

కంబోడియాలో కనిపించే ఇతర దేవతల విగ్రహాలలో ముఖ్యమైనది విష్ణుమూర్తి విగ్రహము.

విష్ణుమూర్తి శంఖ, చక్రములు ధరించినట్టూ గరుడ వాహనంమీద ఉన్నట్టూ కంబోడియాలోనూ, జపాన్‌లోనూ చూపబడిన చిత్రాలను గమనించాము. అలానే విష్ణుమూర్తి వరాహావతారం ధరించిన విగ్రహం అపూర్వమైన శిల్పం మనకు కనబడుతుంది.



**సరస్వతి (జపాన్)**

ఈ చిత్రంలో విష్ణుమూర్తి చతుర్భుజములతో వరహావతార మూర్తి భూమిని పైకి ఎత్తుతున్నట్లు చిత్రించబడింది. అందులో భూమి అడుగున ఆదిశేషుడు భూమిని మోస్తూ ఉండడం - చిత్రంలో స్పష్టంగా శేషుని పడగలు వరాహమూర్తి వెనుకగా చూడవచ్చు. అంతేగాక సముద్రంలో మునిగిన భూమిని కష్టపడి పైకి ఎత్తుతున్నట్లుగా ఒక మోకాలు క్రింద ఆనించి కుడికాలి (అరికాలు) పాదంతో భూమిని ఎత్తుతున్నట్టు ఎంతో అందంగా చిత్రించిన ఈ శిల్పాన్ని మనం చూడవచ్చు. ఇందులో వరాహమూర్తి ముఖం ఎంతో గంభీరంగా రమణీయంగా చిత్రించబడినది. అలానే ఇతర దేశాలలో మనకు కనిపించే హిందూదేవతలు గమనించదగినవి.



4

# ప్రపంచమంతా వ్యాపించిన గణేశుడు

హిందూమతం కేవలం మన భారతదేశంలోనే పుట్టి, ఇక్కడే వృద్ధిపొందిన స్థానిక (local) మతంకాదని – ఇటీవల ప్రపంచంలో అన్నిచోట్లా జరుగుతున్న చారిత్రకపరిశోధనలద్వారా ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది. ఈ పరిశోధనా ఫలితాలు అస్సలు తెలియనివాడు ఈనాటి సమాజంలో ఎవడూ అంటే అతడు "హిందువుడే"! అందుకని విదేశాలలో అనేకచోట్ల శిల్పాలు, త్రవ్వకాల అవశేషాలూ, స్మృతి చిహ్నాలూ ఎన్నో చూస్తే ఆశ్చర్యం ...భయం రెండూ వేస్తాయి.

ఆశ్చర్యం ఎందుకంటే ఈ 'హిందూమతం' నిజంగా ప్రపంచం అంతటా వ్యాపించి వుండిన 'ప్రపంచమతం' (Universal Religion) అన్నసత్యం మనకు కొత్తగా వున్నందుకు! 'భయం' ఎందుకంటే ప్రపంచం అంతటా ఒకే కుటుంబంగా వుండే ఈ భూగోళంమీద మానవజాతి ఆరంభించిన నాటిదా -- ఈ మన హిందూమతం? మన ఈనాటి అజ్ఞానం ఇంత వుందా అని

భయం! అసలీ విషయం ఎంతలోతువుందో పరిశోధనలలో చూద్దాం!

## విదేశాలలో గణపతి!

'గణేశుడు హిందూమతానికి ప్రతినిధి' అని చెప్పవచ్చు! ఎందుకంటే- అందరి దేవుళ్ళలోకి గణేశుడు విధిగా ప్రతివారిచేతా పూజింపబడే దేవుడు! ఎందుకంటే శివుడిలా శైవులచేతా, విష్ణువులా వైష్ణవులచేతా, శక్తిలా శాక్తేయులచేతా మాత్రమే పూజింపబడినట్లుగా కాదు, గణేశుడితో వ్యవహారం! ఆయన విఘ్నకర్త - ఆ తరువాత విఘ్నహర్త కూడా ! అవసరం అనుకుంటే విఘ్నాలు - కల్పించగలడు, హరించనూగలడు! అందుకే వినాయకుని పూజించని వారు హిందువులలో వుండరు శైవులయ్యేది, వైష్ణవులయ్యేది, పెండ్లికి ముందు విఘ్నేశ్వర పూజా, వడుగు (ఉపనయనం) నకు ముందు విద్యావేత్తగా విష్వక్సేనపూజా - ఇలా గృహప్రవేశాలకేమి, బారసాల కేమిటి, పవిత్ర మంత్రాలతో చేసే ఏ మంగళకార్యానికైనా సరే గణేశుడు అగ్రపూజార్హుడు. అందుకే ఈ గణపతి ప్రపంచంలో ఎక్కడెక్కడ దొరికినా ఆయా స్థలాల్లో పూర్వం విధిగా హిందూమతం వ్యాపించి వుండినట్లు తెలిపే స్పష్టమైన చారిత్రక ఆధారంగా - విదేశాల్లోని చారిత్రక పరిశోధకులూ, పురావస్తు (Archeology) పరిశోధకులూ కూడా భావిస్తున్నారు.

దీన్నిబట్టి చూస్తే, ప్రపంచంలో ఎన్నెన్నిచోట్ల గణపతి విగ్రహాలు త్రవ్వకాలలో దొరికాయో -- పరిశోధిస్తే విదేశాలలో పూర్వకాలంలో అక్కడ అంతగా హిందూమతం వ్యాపించి వుండేదని ఈనాడు మనకు ధృవపడుతుంది.

## ఇరాన్‌లో గణేశుడు :

ఇరాన్ లో గణేశుడా! ఇరాన్ ముస్లిము దేశం కదా? ఇక్కడికి గణేశుడు ఎలా వచ్చాడు? అని ఆశ్చర్యం వేస్తుంది. నిజమే! ఇటీవలనే పశ్చిమ ఇరాన్ లోని 'లూరిస్తాన్' (Luristan)లో పురావస్తు పరిశోధన శాఖ త్రవ్వకాలు

జరిపినప్పుడు -- ఈనాటి ముస్లింల మత ప్రవక్త మహమ్మద్ పుట్టకముందు-అంటే ముస్లిం మతమే ఉద్భవించక ముందునాటి శిధిలాలు దొరికాయి. అందులో క్రీస్తుకు పూర్వం -- అనగా క్రైస్తవమతం కూడా పుట్టకముందు-వెయ్యేళ్ళకి ముందు, 1000 బి.సి. లోని అవశేషాలు దొరికాయి. అందులోనూ, ఆశ్చర్యంగా మన గణేశుడు ప్రత్యక్షం అయ్యాడు!

ప్రఖ్యాత ఇరాన్ చారిత్రక పరిశోధకుడు 'వాడెన్-బార్జి' (Waden Barge) ఈ అవశేషాలను గుర్తుపట్టి - ఇవి క్రీస్తుపూర్వం 1000-2000 బి.సి.కి మధ్యకాలంలోని గణపతిని పూజించిన దానికి సాక్ష్యాలుగా వున్న చెక్కడాలని కనుగొన్నాడు.

దీంట్లో ఏనుగు తల, తొండమూ ధరించిన మన గణేశులవారు - ముద్దుగా ఓ కిరీటం (ఇరాన్ వారు ధరించినట్టిది) ధరించి -- చేతిలో ఒక 'ఈక కలం' పట్టుకొని వున్నట్టు చెక్కిన విగ్రహంగా దర్శనమిస్తారు.

ఇందులో కలం పట్టుకున్నందువల్ల విద్యలకు అధికారి అని సూచితం! కిరీటంపెట్టుకొని కనిపించడంవల్ల -- విద్యలకు 'రాజు' (గణేశ్ మహరాజ్) అని సంకేతం! అంతేగాక రెండో చేతిలో ఒక పామును కూడా ధరించి (శివుని భైరవమూర్తివలె) ఉంటాడు. ఈ పాముగురించి పరిశోధకులు అనేక రకాల ఊహాగానాలు చేస్తున్నారు. ఇది 'సర్పదండం' అని కొందరు అంటున్నారు. కాని ఇది నిజం కాదు. 'సర్పదండం' అయితే ఈ పాముతల పిడివైపు నిలువుగా పట్టుకున్నట్టు చెక్కాలి. అలా లేదు! తల అడుగునకూ తోక మాత్రం చేతిలో పట్టుకుని వున్నది. (కాళిందిమర్దనలో శ్రీకృష్ణునివలే) కనుక -- అది 'దండము' (కర్ర) వలె గాక - గరుడుడు పామును కాలికింద తొక్కి లొంగదీసుకొంటున్న భంగిమ! కనుక, ఇది సర్పము (కుండలినీశక్తి)ను వశం చేసుకొని ఆధ్మాత్మిక 'సిద్ధి'ని పొందే, విద్యను జ్ఞానమును (ఈక-కలం) సూచించే సంకేతం అని నా విశ్లేషణలో తేలింది!

ఆయన దుస్తులు ఇరాన్ రాజుల అంగరఖా తొడిగినట్లు వున్నది. కనుక- ఈ గణేశుడు భారతదేశంనుంచి తీసుకుపోబడి ఇరాన్‌లో ప్రవేశపెట్టిన దేవుడు కాదనీ - అక్కడనే అనాదిగా ప్రజలు పూజించటాని కలవాటుపడిన- స్థానిక ప్రజల వేషభాషలలోకి మలచబడిన గణపతి అనీ తేలుతున్నది.

దీన్నిబట్టి ఋజువయ్యే ముఖ్యమైన చారిత్రక సత్యం ఒకటుంది. అదేమంటే, హిందూదేవుళ్ళని విదేశాలలో దొరికినప్పుడల్లా -- ఇంగ్లీషు దొరలూ, వారిమానస పుత్రులైన మన భారతీయ చరిత్రకారులూ కూడా, ఆ హిందూదేవుళ్ళు మనదేశంనుంచి తరలించుకొని పోబడి ఆ దేశంలో ప్రచారం అయిన హిందూ సంస్కృతి అని - మసిపూసి మారేడుకాయచేసి, చరిత్రలనే తారుమారు చేసిన అసత్యములని బయటపడుతున్నాయి, ఈ చారిత్రక త్రవ్వకాలవల్ల!

ప్రపంచమంతటా ఒకప్పుడు హిందూమతం నేటి (క్రిష్టియన్, ఇస్లాం, బౌద్ధ మతాల ప్రవక్తలు పుట్టకముందే) వ్యాపించివుండిన అతి ప్రాచీన మతం **(Ancient Universal Religion)** అనీ, అది తర్వాత తీసుకుపోయి అక్కడ ప్రచారంచెయ్యబడినది (ఇప్పటి క్రైస్తవ ప్రచారంలాగ) కాదనీ, తేలుతున్న చారిత్రక సత్యాన్ని ఇప్పటికైనా మనం కళ్ళు తెరిచి గుర్తించి, మేలుకొని, ఇంకా మన పిల్లలు చదివే తప్పుల చరిత్ర 'టెక్స్టు' పుస్తకాలను **(Text Books)** వెంటనే మార్చుకోవాలి.

ఎందుకంటే ఈ శిల్పాలు ఇతర దేశాలలో దొరికిన హిందూ దేవుళ్ళూ ఇక్కడి విగ్రహాలేగాక - అక్కడి, ఆయాదేశాల దుస్తులూ వేషభాషలతోనే స్థానిక ప్రజల సంస్కృతిలో ఒకటిగా అల్లుకు పోయిన కట్టూబొట్టూ ఋజువులతోనే దొరికినాయి.

అంతేకాదు. చైనాలో దొరికిన గణేశుడు చైనావారి ఉడుపులతో ముఖ కవళికలతోనూ, ఇరాన్‌లో దొరికిన గణేశుడు - ఇరాన్‌వాడిలాగానే స్పష్టంగా

ఇలా స్థానిక శిల్పులచే మలచబడడం - పై విషయాన్నే ధృవపరుస్తున్నాయి. ఇది ఇరాన్ గణేశుని వింత! ఇక ఈయన ఇంకా ఏయే దేశాలలో ప్రత్యక్షం అవుతున్నాడో చూద్దాం.

## ఆఫ్ఘనిస్తాన్ : (AFGHANISTAN)

ఇటీవలే దొరికిన చారిత్రక ద్రవ్యకాలలో 'గర్డ్ ఎజ్' (Gardez) అనే ప్రదేశానికి సమీపంలో ఒక పాలరాతి గణేశుని విగ్రహం బయటపడింది. దీనిని తర్వాత స్థానిక ప్రజలు 'పీర్-పాతన్-నాథీ దర్గా' ముస్లిం సమాధి) వద్దకు చేర్చి పూజలు చేస్తున్నట్లు డా॥ వి. రామదాస్‌గారి పరిశోధనలో తేలింది.

ఈ ప్రతిమ చాలా విచిత్రమైంది. దానిపైన వున్న ప్రాచీనమైన శాసనంలో 'పరమ భట్టారక మహారాజాధిరాజ షాహీ కింగళా (Shahi Kingala) , అనే రాజు కాలంలో "మహా వినాయక" అన్నదీ విగ్రహం- అయితే చరిత్ర పరిశోధకులకెవ్వరికీ ఈ 'షాహీకింగళ' అనే రాజెవ్వరో ఎంత కాలం క్రితం పాలించాడో, అసలు ముస్లిం దేశమైన ఆఫ్ఘనిస్తాన్‌లో 'మహా రాజాధిరాజ పరమ భట్టారక' (అంటే సూర్యుడు) అనే పేరుగల సంస్కృత నామంలో ఈ రాజు ఎప్పుడుండేవాడో అనేది అంతుతేలని ఆశ్చర్యం!

ఇందులో 'మహావినాయకుడు', 'ఆలీఢ-పాదము'తో (అనగా ఒక కాలు ఎత్తి, రెండవ కాలు జాపి) వీరావేశంతో నిలిచివున్నాడు. ముత్యాలహారం మెడలో ధరించి, 'సర్పయజ్ఞోపవీతము' ధరించి గుండ్రని రంగుకిరీటము శ్రీకృష్ణుడు బాల్యంలో ధరించినట్లు..... పులిగోళ్ళు కూడా చెక్కారు.

## కాబూల్ : (KABUL)

అలానే 'షకార్-ధార్' (Shakar Dhar) అనే ప్రదేశంలో కాబూల్‌కు 10 మైళ్ళ దూరంలో ఇంకొక గణేశుని ప్రతిమ దొరికింది. ఇది నాలుగు చేతులతో నిల్చున్నమూర్తి.

ఆయన పాదాలవద్ద ఇరువురు 'ఆయుధ పురుషులు' నిలిచి వున్నట్టు చెక్కబడి క్రింద రెండు చేతులూ వారివైపు (ఆయుధాలు) సాగుతున్నట్టుగా వున్నాయి. కుడివైపు పై చేతిలో పద్మం ధరించి వున్నది. ఎడమవైపు చేయి భిన్నమై వున్నది. దీనిప్రాచీనత ఎంతకాలం నాటిదో తేలలేదు.

## చైనా : (CHINA)

చైనా ప్రాచీన చరిత్ర (ఇప్పటి కమ్యూనిస్టు ప్రభుత్వం రాకముందు) గనక చూస్తే, అతిప్రాచీన కాలంనుంచీ, ఇక్కడా గణపతి దర్శనమిస్తాడు!

'తన్ – హుఆంగ్' (Tun Huang) వద్ద వున్న కుడ్యంలోని అరక్రింద



చిత్రం – 2
మధ్య అమెరికా (మెక్సికో)లోని దేవాలయం గోడపై చిత్రం

చెక్కబడిన రాతిశిల్పంలో ఈ గణపతి దర్శనమిస్తాడు. ఇంకొక గణేశమూర్తి 'కుంగ్–హ్షీన్' (Kung Hsien) అనేచోట దొరికింది. దీనిపై యున్న శిలాశాసనంబట్టి చూస్తే దీనిని 531 A.D. కాలంనాటిదిగా చారిత్రకులు అభిప్రాయపడుతున్నారు. అయితే ఈ విగ్రహం అంతకు పూర్వమే చాలాకాలంగా పూజింపబడుతూ వున్నట్లు సూచనలుకూడావున్నాయి.

దీనిలో గణపతి పద్మాసనం వేసుకొని కూర్చుని ఉన్నాడు. దాని క్రింద లిపిలో చెక్కిన దానిపై 'గజములకు పరమేష్టి' (Spirit King of Elephants) అని వ్రాసివున్నది. ఎడమవైపు చేతిలో చింతామణి వున్నది.

'చైనీస్–తుర్కిస్తాన్'లో కూడా ఇలానే అనేక గణేశవిగ్రహాలు లభ్యమైనాయి వీటి చిత్రములు కూడా ప్రొ॥ శివరామమూర్తిగారి గ్రంథంలో ప్రచురించారు. చైనాలో ఇంకా ఎన్నోచోట్ల ప్రాచీన శిథిలాలు త్రవ్వవలసినవి వున్నాయి. అక్కడక్కడా ఇలాంటి గణేశమూర్తులు అనేకం బయటపడే అవకాశం లేకపోలేదు. అయితే చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చాక మతమును రద్దుచేసి మత ప్రచారం రద్దుచేసి ఇలాంటి పరిశోధనలను ఆపివేశారు.

## మెక్సికో : (MEXICO)

మెక్సికోలో అనేకచోట్ల లెక్కలేనన్ని హిందూదేవుళ్ళ విగ్రహాలున్నాయి. అందులో గణేశుడు చాలాచోట్ల లభ్యం అవుతాడు.

'హెవిట్' (Hewit) వ్రాసిన పురాతన చరిత్రలో గణపతిని అదృష్టంకోసం మొదటిగా పూజించేవారని తెలుపబడివున్నది. మధ్య అమెరికాలో దొరికిన తాళపత్రాలలో పొట్టితొండం వంకర తిరిగి, నెలవంకలా వున్నట్లూ గణేశుడు, చిత్రించబడ్డాడు. కొన్ని శిల్పాలలో ఈ తొండం మరీ పొట్టిగా ఖడ్గమృగం కొమ్ములాగా చెక్కి(వరాహావతారం కోరలా) వున్నది.

## థాయిలాండ్ : (THAILAND)

థాయ్‌లాండ్‌లో దొరికిన గణపతి చాలా అందమైనమూర్తితో ముద్దుగా కూలబడి వున్నట్లు చెక్కబడినాడు. బాంకాక్‌లోని హిందూ దేవాలయంలో ఉన్న ఈ విగ్రహం కంచుతో చేయబడింది. కాళ్ళు బాసీపట్టులో కూర్చున్నట్లుగా కాక, ఒక అరికాలికి ఇంకొక అరికాలు ఆన్చి అభిముఖంగా వచ్చేటట్లు కూర్చున్నట్లుగా చెక్కబడి వున్నది. భుజాన నాగయజ్ఞోపవీతము ఎడమచేతిలో 'మోదకము' (కుడుము) కుడిచేతిలో విరిగిన దంతము పట్టుకొని నాలుగు భుజాలు కలిగిన మూర్తి! ఈ విగ్రహంలో కన్నులు అరమోడ్చి యోగ సమాధిలో వున్నట్లు చెక్కబడినది. వెనుకవున్న రెండుచేతులలో ఒకదానిలో పరశువూ, రెండవ దానిలో పాశమూ వున్నాయి. కుడివైపు దంతము భిన్నమైవున్నట్లు మలచబడింది.

ఈ విగ్రహంలోవున్న విశేషం ఏమిటంటే గణేశుడు కూర్చున్న సింహాసనం అడుగున ఎనిమిది పుర్రెలు(కపాలాలు) ఉన్నట్లుగా చెక్కబడినాయి. ఈ కపాలముల ప్రక్కగా సర్పములు చెక్కబడి వున్నాయి. కాళ్ళపైన జలతారునేసిన చెమ్కీతో కూర్చిన అంగరఖా వున్నట్లు చెక్కబడి వున్నది. దీన్నిబట్టి కంబోడియాలో, హిందూ దేవాలయాలు ఈనాటికీ స్పష్టంగా వుండటాన్ని గమనించవచ్చు. అందులో గణపతి ఉండడం విశేషమేమీ కాదు.

## నేపాల్ : (NEPAL)

నేపాల్‌లో అశోకుని కుమార్తె, ఒక ఆలయం కట్టించింది. అది బౌద్ధమత సంబంధమయిన దేవాలయమైనా - గణేశుడి పేరనే ప్రతిష్ట చేయబడింది. బౌద్ధమతంలోకూడా 'గణపతి' పూజింప బడడానికి గల అనేక నిదర్శనాలలో నేపాల్‌లోని ఈ గణపతి దేవాలయం ఒకటి.

ఇక్కడ గణేశుని నడుముకు నాగబంధం కట్టబడి తలపైన శేషుని పడగలు పట్టినట్లు చెక్కబడి వున్నది. నేపాల్ లో గణపతి అనేక రూపాలలో చెక్కబడి వున్నాడు. అందులో శివునివలే, నటరాజుగా, తాండవము చేస్తున్నట్లున్నవి విశేషమైనవి!

## జావా : (JAVA)

జావా (Java) లో దొరికిన అనేక హిందూ దేవతల విగ్రహాలు అక్కడనుంచి పాశ్చాత్యులచేత తీసికొనిపోబడినవీ, ఈనాటికీ, "ఆమ్‌స్టర్ డామ్" (Amsterdam), లైడాన్ (Leyden) లోని మ్యూజియంలోనూ స్పష్టంగా చూడవచ్చు. ఇక్కడి గణపతులలో కపాలములు ధరించో లేక పుర్రెలు కూర్చబడిన ఆసనంలో కూర్చున్నట్టివే ఎక్కువగా చూడవచ్చు.

## జపాన్ : (JAPAN)

ఇక్కడ గణపతి స్పష్టమయిన ఏనుగుతలతో చెక్కబడినట్లు జపానీయులు ధరించే బట్టలతో అలంకారాలలో దర్శనమిస్తాడు. అనేకచోట్ల దేవాలయాలలో గణపతి నవ్వుతున్నట్లుగా చెక్కబడి వున్నాడు. ఇంకొకచోట నిలబడి వున్నట్లు ఆరుచేతులు కలిగి మూడు నేత్రములతో మూడు శిరస్సులతో వున్నట్లు చెక్కిన విగ్రహము విశేషంగా చెప్పుకోదగ్గది. జపానులోని 'వజ్ర వినాయక మూర్తి' చేతిలో 'వజ్రం' (దోర్జీ) ధరించినట్లు చెక్కబడి వున్నది.

"కాకూ-జెన్-చో" (Kaku - Zen - Cho) అన్నచోట్ల రాజువంటి ఆకారములో చెక్కబడిన జపనీస్ గణపతి చేతిలో ఒక రాజదండం ధరించి ఇంకొక చేతిలో ముల్లంగిదుంప (మూలకం) ఖడ్గం, వజ్రాయుధము, పట్టుకొన్నట్లు మలచబడి వున్నది. జపాన్ లో అనేక హిందూదేవతాశిల్పాలు స్పష్టంగా ఈనాటికీ మనం చూడవచ్చు.



5

# గ్రీసు – ఈజిప్టు దేశాలలోని హిందూ దేవుళ్ళు

గ్రీసులోని చతుర్ముఖబ్రహ్మ విగ్రహాన్నికూడా ఈ చిత్రంలో (చిత్రం-9) చూడవచ్చు.

ఇందులో ముఖకవళికలు స్పష్టంగా గ్రీకుశిల్పాలను పోలి వున్నవి. కన్నులు అరమోడ్చి యోగధ్యానంలో ఉన్నట్లు రూపొందించబడ్డాయి. ఈ కన్నులు అజంతా చిత్రంలోని సోగ కన్నులను గుర్తుచేస్తున్నాయి. బుద్ధుని చెవులవలె పొడుగాటి చెవి తమ్మెలతో మహాపురుషునివలె చిత్రించబడ్డాయి. అంతేగాక బ్రహ్మ తపస్సుకు అధిష్టాన దేవత కనుక ఆయన తలపైన జుట్టు జడలు కట్టినట్టు ముడివేయబడి శిరస్సుపైన జటాకలాపంతో అందంగా చూపబడిన శిల్పంలో చతుర్ముఖాలు స్పష్టంగా చూడవచ్చు. ఈ శిల్పం సౌందర్యంలో గ్రీకు కళను, బౌద్ధ చిత్రకళలతో కలగలపు చేసిన గాంధార సాంప్రదాయమునకును దగ్గరగా కనిపిస్తున్నది. ఎందుకంటే గాంధార

శిల్పంలోనే గ్రీకు, హిందూ శిల్పాలు -- సమపాళ్ళలో మేళవించిన సంగతి మన దేశచరిత్రకారులు అంగీకరించినదే.

జపాన్, గ్రీసు దేశాలే కాకుండా ఇంకా అనేక దేశాల్లో కూడా హిందూదేవుళ్ళు స్పష్టంగా మనకు కనిపిస్తారు. అలాంటి దేశాల్లో మెక్సికో, పేరూవంటిదేశాల్లో ఎక్కువ కళాఖండాలు లభ్యమవుతున్నాయి. ఇవన్నీ విపులంగా వేరే అధ్యాయంలో పరిశీలిద్దాము. ఇక్కడ ఒక్క విషయం మాత్రం గమనించి ఈ అధ్యాయాన్ని పూర్తిచేద్దాం.

హిందూ దేవతలలో సగం మనిషి, సగం జంతువు ఆకారం కలిగిన విచిత్రమైన దేవతామూర్తులను మనం గమనిస్తాము. హయగ్రీవుడు (గుఱ్ఱం తల - మనిషి శరీరం) ఆంజనేయ స్వామి (కపి రూపం - మానవాకారం) గణపతి (ఏనుగు తల - మనిషి శరీరం) వరాహమూర్తి, నరసింహస్వామివంటి విగ్రహాలు మరి ఏ ఇతరమతాల్లోనూ కనిపించవు. ఇవి స్పష్టంగా హిందూమతానికి నిర్దిష్టమైన సాక్ష్యాలు.

సరిగ్గా ఇలాంటి విగ్రహాలే - సగం మనిషి, సగం జంతువు ఆకారం కలిగినవి మళ్ళీ ఈజిప్టులోనే దర్శనమిస్తాయి. ఈజిప్టులో కనబడే మతానికీ, హిందూమతానికి చాలా దగ్గర సంబంధం కలదని చాలామంది చరిత్రకారులకు తెలియదు. మచ్చుకు ఒకే ఒక ఉదాహరణనిచ్చి ఈ విషయాన్ని ముగిస్తాను.

ఈజిప్టులో సగం సింహం, సగం మనిషి - ఆకారం కలిగిన స్ఫిన్‌క్స్ **(Sphynx)** - ఈనాటికీ బ్రహ్మాండమైన పర్వతాకారంలో - పిరమిడ్‌లకు ఎదురుగా కనిపిస్తుంది. స్ఫిన్‌క్స్ దీనికి మనిషి తలా సింహం పడుకున్నట్టు శరీరం కలిగి, సగం మనిషీ సగం శరీరం సింహం ఆకారంగా చెక్కబడింది.

సరిగ్గా మనహిందువులకు నరసింహస్వామి కూడా సగం సింహం, సగం మనిషి రూపమే కనిపిస్తుంది. అయితే తల మాత్రం సింహం, శరీరం మనిషి

రఃపిష్టులో నరసింహస్వామి



ఉంటుంది కనుక హిందూమతంలో సింహం శిరస్సు ఈజిప్టులోని స్ఫిన్‌క్స్‌కు వున్న సింహం శరీరంతో అతుకుతుంది. అయితే స్ఫిన్‌క్స్‌యొక్క మానవశిరస్సు నరసింహస్వామియొక్క మానవ శరీరంతో అతుకుతుంది. దీనిలో ఏదైనా గూఢార్థము ఉండవచ్చు.

ప్రాచీన హిందూమతంలో అంతుపట్టనిగూఢ ఆధ్యాత్మిక రహస్యాలు, చిక్కుసమాధానాలు, ఈజిప్టులో దొరకవచ్చు. అలానే, ఈజిప్టుమతంలోని ఆధ్యాత్మిక రహస్యాలకు సమాధానాలు - హిందూమతంలో ఉండవచ్చు. ఈ విషయాన్ని ఆనాటి ప్రాచీన విజ్ఞానులైన పరమ గురువులు ఈ రెండు మూర్తులలోను విడివిడిగా రూపొందించి వుండవచ్చు!

సరిగ్గా నరసింహస్వామివంటి తలా, మనిషి శరీరమూ గల శరీరం ఈజిప్టులో దొరికింది. (చిత్రం - 10) -

ఈ విగ్రహం నరసింహస్వామిలాగే కూర్చునివున్నట్లు మానవ శరీరంతో చెక్కబడింది. తల స్పష్టంగా సింహం ఆకారంలో వుంది. అంతేకాక ఈ సింహం తలపై ఆదిశేషుని పడగలు సర్పాకారంగా గొడుగు పట్టినట్లు ఉన్నవి. మన హిందూ మతంలో నరసింహస్వామికి శేషుడు పడగలు పట్టినట్టుకూడా ఆదిశంకరాచార్యులు వ్రాసిన 'నృసింహ కరావలంబన స్తోత్రం'లో స్పష్టంగా కనిపిస్తుంది.

**"భోగేంద్ర భోగి ఫణిరాజిత పుణ్యమూర్తే"** అన్న శ్లోకంలో,

దీన్నిబట్టి ఈజిప్టులోనివి కూడా హిందూదేవుళ్ళేనని స్పష్టమవుతోంది. ఇదే విషయం మేకతల, మనిషి శరీరంవున్న దేవుళ్ళవిగ్రహాలు మరింత బలపరుస్తాయి. హిందూమతంలో దక్షుడు శిరస్సు ఖండించినప్పుడు (దక్షయజ్ఞం నాశనం చేసినప్పుడు) అతడికి మేకతల అతికించినట్లు చెప్పబడింది. ఇవే శిల్పాలు ఈనాటికీ ఈజిప్టులో కనిపిస్తాయి. ఇవే స్పష్టమైన సాక్ష్యాధారాలు -- ఈజిప్టులోని హిందూమతం ఛాయలను నిరూపించేది.



6

# యూరపు సంస్కృతికీ – హిందూ దేవతలే ఆధారం

మనం ఇంతకుముందు అధ్యాయంలో జపాన్‌లోనూ, కంబోడియాలోనూ ఇంకా ఇతర ఆసియాదేశాలలోనూ కనిపించే గణపతి, బ్రహ్మ, సరస్వతినంటి హిందూదేవతలను ఈనాటికీ ఎలా చూస్తున్నామో గమనించాము.

కానీ ఈ హిందూమతంయొక్క ప్రభావం ఒక్క ఆసియా లోనే ఉన్నదని అనుకోవటం పొరపాటు! యూరపు సంస్కృతికి ఆధారమైనవి గ్రీకు, రోమన్ సంస్కృతులే. ఈ అధ్యాయంలో హిందూదేవతలు మనకు ఈ గ్రీకు, రోమన్ సంస్కృతులలో కూడా ఎలాగ కనిపిస్తారో అన్నది ప్రత్యక్షమైన ఆధారాలతో సహా గమనిద్దాము.

కేవలం నా మాటలలోనే యూరపు సంస్కృతికి హిందూమతం మాతృక (తల్లి) వంటిదని వ్రాస్తే, ఒకవేళ ఆ యూరోపియన్ పండితులు

అంగీకరించినాగానీ, మనదేశంలోని హిందూ విదేశీ మానస పుత్రులు - ఇది నా హిందూమత అభిమానంవల్ల వ్రాసిన మాటలనుకోవచ్చుగదా! అందుకని స్వయంగా నా మాటలలో చెప్పకుండా విదేశీయులైన యూరోపియన్ పరిశోధకుల మాటలలోనే ఈ విషయాన్ని -- నూటికి నూరుపాళ్ళు క్రిష్టియన్ వాళ్ళకికూడా కాదనటానికి వీలులేని సాక్ష్యాలతోటే నిరూపిస్తాను.

## హిందూమతంపై బ్రిటీషువారి పరిశోధనలు :

భారతీయ సంస్కృతిని బ్రిటీష్‌వాళ్ళు, మనదేశాన్ని పరిపాలించడం మొదలుపెట్టిన రోజుల్లోనే తీవ్రమయిన పరిశోధనలు చేసి కాచివడపోశారు. "వారన్ హేస్టింగ్స్" మనదేశపు గవర్నరుగా వున్న రోజులలో మన హిందూమతంపైనా, పురాణాలు, శాస్త్రాలు, వేదాలపైనా పరిశోధన చేయడానికి ఒక సంస్థను ఏర్పాటుచేశాడు. దాని పేరు 'ఏషియాటిక్ సొసైటీ'. "సర్ విలియం జోన్స్" (Sir Willium Jones) దొర దానికి మూల పురుషుడు. ఈయన చేసిన పరిశోధనలవల్ల గ్రీసులో తమ దేవతలుగా చలామణి అవుతున్న అనేక పాశ్చాత్యదేవతలు నిజానికి సంస్కృత పదాల ఉచ్చారణలో పదాలు వికృతిపొందగా ఏర్పడ్డ హిందూదేవుళ్ళేనని ఆయన ప్రచురించిన రీసెర్చి (Research) వ్యాసాలలో తేలింది. అవేమిటో, ఒక్కొక్కటే వివరాలతో సహా పరిశీలిద్దాము.

## జేనస్ - గణేశుడు:

మన దేవతలలో జేనస్ అనే దేవత ప్రధముడుగా పూజింపబడుతున్నాడు. రోమన్‌లు పూజ ప్రారంభించే ముందుగా ఈ జేనస్‌ను ప్రార్థించనిదే ఏ పనీ చేయరు. నిజానికి ఈ 'జేనస్' అనే మాట 'గణేష్' అనే సంస్కృత పదానికి ఉచ్చారణ దోషంవల్ల ఏర్పడ్డ వికృతి. రోమన్ చరిత్రకారులయిన టెరెన్స్ హైటన్ స్పష్టంగా వ్రాసిన - 'గణేశుడే రోమన్ దేవుడయిన జేనస్' అని తెలిపే వాక్యాలు ఈ క్రింద చూడవచ్చు.

"Having no system of my own to maintain I shall not pursue a very regular method, but shall take all the Gods of whom I discourse as they happen to present themselves beginning, however like the Romans and Hindus, with Janus. Like Ganesa, Janus too, as the 'first book of Zasti prays to him 'O sagacious planter of all things and leader of deities".

అర్థం: ఈ దేవతలను వివరించడంలో నా స్వంత పద్ధతంటూ ఏ
లేకపోయినా హిందువులూ, రోమనులు ప్రారంభించినట్లే జేనస్ లేక గణేశుని
ప్రారంభిస్తారు. అలాగే మిగతా దేవుళ్ళను కూడా వరుసగా వివరిస్తాన
గణేశునిలాగానే ఈ జేనస్ కూడా దేవతలలో ప్రథమారాధ్యుడు అ
జాస్తిగ్రంథంలో ప్రార్థించి, ఈ గణపతి దేవతలందరిలోకి అధిపతి -- అన్ని
శుభకార్యములకూ ఆరంభకుడు.

పై వాక్యములనుబట్టి చూస్తే వేదమంత్రాలలో - 'ఓం గణేశాయ నమః
అనకుండా ఏ దేవతాపూజా ప్రారంభం కానట్టే -రోమన్ ల జేనస్కూడా మన
గణపతియొక్క రూపాంతరమేనని తెలిసిపోతున్నది. అందుకనే నెలల్లో
మొదటిదయిన జనవరి పేరు కూడా ఈ జేనస్ పేరుమీదనే ఆధారపడివున్నది.
ఇంకా జోన్సు ఇలా వ్రాశాడు.

The Indian divinity has precisely the same character. All the sacrifices and religious ceremonies all addresses even to superior Gods all serious compositions in writing and all worldly affairs of moment, are begun by pious Hindus with an invocation of Ganesa, a word composed of Isa, the governor or leader, and gana or a company of deities, nine of which companies are enumerated in the Amaracosha Instance of opening business auspiciously by an ejaculation to the Janus of India might be multiplied with ease, Few books are begun without the words 'salutation to Ganesa', and is first invoked by the Bramhins".

హిందువుల దేవతకూడా సరిగ్గా (రోమన్‌ల జేనస్‌వలె) ఒకే లక్షణం కలిగివున్నారు. ఏ పూజా, వ్రతము, హోమము లేక ఏ శాస్త్రాలు ప్రాయాలన్నా ప్రార్థనలయినా, ప్రాముఖ్యతగల శాస్త్ర గ్రంథాలేమయినా ప్రారంభించేముందు ఆచారవంతులయిన హిందువులు ఈనాటికీ గణేశుని పూజించనిదే ప్రారంభించరు. గణేశుడనే మాటలో గణ లేక గుంపు ఒకసమూహమునకు 'ఈశ' అనగా అధిపతి అని అమరకోశంలో తెలుపబడింది. ప్రతి శుభకార్య ఆరంభానికీ ముందుగా భారతీయుల జేనస్ అయిన ఈ గణపతిని ఆరాధించి ప్రారంభిస్తే సమృద్ధిగా జరుగుతాయి. బ్రాహ్మణులు వ్రాసిన ఏ పుస్తకమయినా గణేశుని స్మరించకుండా ప్రారంభించరు- అంటాడు జోన్స్ పై వాక్యాలలో!

## లక్ష్మీదేవి(సిరి)యే – సిరీస్ : (CERES)

గణేశుడు ఎలాగయితే రోమనుల నోట్లోపడి జేనస్‌గా వికృతి పొందాడో అలాగే భారతీయుల అదృష్ట దేవతయైన లక్ష్మీదేవి -- **'సిరి'** (శ్రీ) కూడా రోమనుల 'సిరీస్' దేవతగా మనకి దర్శనమిస్తుంది. ఈ విషయాన్నే జోన్స్ దొర వాక్యాలలో తెలపాలంటేః

> "She is also named padma and camalam from the sacred Lotus or Nymphoea, but her no remarkable name is Shri, or in the first cause, Siris, which has a resemblance to the Latin, and means fortune or prosperity. It may be contended that, although Lacshmi may be figuratively called the Ceres of Hindustan".

అర్థంః ఆమె పద్మ లేక కమల అన్న పేరుతో పిలువబడింది పద్మం లేక తామరపువ్వులో పుట్టడంవల్ల! కాని ఆమె పేరులోని విశేషమయిన శ్రీ 'సిరి' అనబడే ఈ దేవత పేరు లాటిన్ భాషలో అదృష్టానికి ఐశ్వర్యానికి ప్రతిరూపమయిన లక్ష్మీయే మార్పుచెందిన హిందువుల భాషలోని రోమన్ దేవత 'సిరీస్'గా పేర్కొనవచ్చు. అంతేగాక గయవద్ద పురాతనమయిన దేవాలయాల్లో ఇప్పటికీ ఈ లక్ష్మీదేవియొుక్క విగ్రహాలు పూర్ణస్తనాలతోనూ

చేతి క్రిందిభాగాన్ని రోమన్ గ్రీకుల దేవత అయిన సిరీస్ బొమ్మలో వున్నట్లే సంపదను సూచించే కొమ్మవంటి ఆకారంతోనూ చెక్కబడి వున్నది. దీన్నిబట్టి భారతీయుల అదృష్టదేవత అయిన లక్ష్మియే ఇటలీ, రోమన్, లాటిన్ వారి సిరీస్ దేవతగా గ్రహించవచ్చు.

## జ్యూస్ - పితర్ లేక జూపిటర్ :

రోమనుల జ్యూస్ పీటర్ (Zeus Pater) అనబడే దేవుడు దేవతలకు రాజుగా వర్ణింపబడ్డారు. మన హిందూపురాణాలలో శాస్త్రాలలో దేవతలకు రాజు ఇంద్రుడు! ఈయన నివసించేది 'స్వర్గం' లేక దివం. ఈ దివమునకు అధిపతి కాబట్టి 'దివస్పతి' అని సంస్కృతంలో జ్యాస్పితా - జనితా జనిత్ర అని వేదమంత్రంలో వర్ణింపబడ్డవాడు.

ఈయనే ఇటలీలో జనిటరుగా (Jenitor) లేక తండ్రిగా జూపిటర్ లేక జ్యాస్పితర్ స్వర్గంలోనుండు తండ్రి (తండ్రి = Pater = పితర్)గా మార్పు చెందాడు. ఈ విషయాన్నే ఈ క్రింది విధంగా వర్ణిస్తున్నాడు.

"We are advised by Plato himself to search for the roots of Greek words in some barbarous, that is foreign soil."

"Let us apply this key to their king of Gods - Zeus himself, This Jupiter or Diespiter is the Indian God of the visible heavens, called Indra or the King, and Divespetar, or Lord or the Sky."

ప్లేటో మనకు అందించిన సూత్రంప్రకారం చూస్తే గ్రీకు మాటకు మూలమయిన శబ్దాలు విదేశీయుల సంస్కృతినుంచే (నేలనుంచి) పుట్టినవి.

ఈ జూపిటర్ లేక జ్యాస్పితర్ హిందువుల దేవుడయిన ఇంద్రుడు లేక దేవతలకు రాజు - స్వర్గమునకు ప్రభువు అని తెలుస్తుంది.

## ప్రణవం ఈజిప్టులో :

హిందూమతంలో అన్ని శబ్దాలకు ప్రణవమే మూలమైన బీజాక్షరం.

ప్రణవమే బ్రహ్మ స్వరూపం. హిందూ దేవతలు ఎలాగైతే కొద్దిపాటి మార్పుతో రోమన్ దేవతలలో కనిపిస్తున్నారో అలాగే ఈజిప్టులోని 'ఒన్ (ON) అనబడే బీజాక్షరంగా మారి వేదాలలోని 'ఓం' ఈనాటికీ ఎలా కనిపిస్తున్నదో జోన్సు వాక్యమే ప్రమాణం. మంత్రశబ్దమైన 'ఓం' ఎప్పుడూ పవిత్రుడయిన హిందువుల నోట్లోనే ఆడుతూ వుంటుంది. దానిమీదే అతడెపుడూ ధ్యానిస్తూ వుంటాడు. అదే శబ్దం ఈజిప్టులోని 'ఒన్'గా మారి వుండవచ్చు. ఈ మాటకు అర్థం సూర్యాంతర్వర్తి అయిన దేవుడు.

The mystical word "OM" a word which never escapes the lips of a pious Hindu, who meditates on it in silence, whether the Egyptian on which is commonly supposed to mean the sun".

## రోమన్ ఏక్విల్లాగా మారిన గరుడుడు :

జోన్సు మన దేవతల పుట్టు పూర్వోత్తరాలు హిందూమతంలోనే ఆరంభించినాయని బుజువుచేసిన వాటిలో గరుడుని గురించికూడా పరిశోధించాడు. వేదాలలోనూ, పురాణాలలోనూ, విష్ణుమూర్తి వాహనమయిన ఈ గరుడుడు గ్రద్దరూపంలో వర్ణింపబడి వున్నాడు. సరిగ్గా రోమనుదేవత అయిన ఏక్విల్లాకూడా గ్రద్ద రూపంలోనే వర్ణింపబడినాడు. ఈ విషయాన్నే జోన్సు మహాశయుడు -

"I rather conceive the Garuda to be fabulous bird; but agree with him that the Hindu God, who rides on it, resembles the ancient Jupiter".

"హిందూ దేవుడయిన గరుత్మంతుడు ప్రాచీన పురాణగాధల్లో పక్షిరూపంలో వర్ణించబడివున్నాడు. ఆయన రోమనుల ఏక్విల్లాగాను, గరుత్మంతునిగాను, గరుడునిపై ప్రయాణించే దేవుడు, జూపిటర్‌గాను, భావిస్తున్నాను."

జోన్సు మహాశయుడు ఇలా తన పరిశోధనను ఇంతటితో ఆపుచేయక

ఇతర హిందూదేవతలలోకూడా అపూర్వమయిన రహస్యాలు తెలియచేస్తూ హిందువులైన మనకే ఆశ్చర్యం కలిగిస్తూ మన హిందూ దేవుళ్ళగురించి, హిందూమతంగురించీ తన పరిశోధనా వ్యాసాల్లో విశదీకరించాడు. అవన్నీ ఇక్కడ ఉదహరించాలంటే ఒక్క రోమను, గ్రీకుదేవుళ్ళయొక్క హిందూమతంనుంచి పుట్టుక తెలిపే విషయం వ్రాస్తేనే ఒకపెద్దగ్రంథమవుతుంది.

ఉదాహరణకు త్రిలోచనుడైన శివుడు హిందూదేవుడైన పాలాక్షుడే రోమను భాషలో 'త్రై ఆప్తాలమస్'! (త్రై) అంటే మూడు, 'అప్తాల్మస్' అంటే కన్ను. మూడు కన్నులుకల త్రిలోచనుడైన శివుడు రోమను దేవుడైన "త్రై ఆప్తాలమస్"గా మారినట్లు రోమను రచయిత 'పాష్యాలమస్' వల్ల తెలుస్తుంది. ఈయన యొక్క విగ్రహంలో కూడా నుదుట మూడవ కన్ను ఉన్నట్లుగా కనుగొనబడిందని సరిగ్గా హిందువులకు దేవుడయిన శివునకు మూడవకన్ను ఉన్నట్లే ఇది కనిపిస్తున్నదని 'జోన్సు' వ్రాశాడు. అంతేకాక శివుని చేతిలో త్రిశూలం ఏ ఆకారంలోఉంటుందో సరిగ్గా రోమను దేవత "నెప్ట్యూను" కూడా అలానే త్రిశూలాన్ని ధరించి వుంటాడు.

## వీనస్ – రంభ :

'ఇంద్రుని సభలో నాట్యం చేసే రంభ రోమను దేవత అయిన వీనస్ లేక అందాల రాణిగా మనకి దర్శనమిస్తుంది' అంటాడు సర్ విలియమ్ జోన్స్ తన పరిశోధనలో.

అలానే హిందూ దేవుడయిన కార్తికేయునికి ఆరు ముఖాలున్నాయి. సహస్రాక్షునికి అనేక నేత్రాలున్నాయని చేయబడిన వర్ణనతో తమ దేవుడయిన ఆర్గస్‌కు (Argus) అనేకమయిన నేత్రాలు వర్ణించబడినవి. ఇదే విధంగా ఇటలీలోని మార్స్ (Mars) యుద్ధానికి సంబంధించిన దేవత! ఇతన్ని హిందూ పురాణాలలో స్కందుడుగా వర్ణించారు. సర్ విలియమ్ జోన్స్ ఏమంటాడంటే పురాణాల్లో 'స్కందుడు' అని చెప్పబడిన దేవతయే ఉచ్చారణదోషం వల్ల "సికిందర్' (స్కందర్) పర్షియను భాషలోనుంచి మాసిడోనియను గ్రీకులూ మార్చుకున్నారని కనుగొన్నాడు.

Though Carticeya with him six faces and numberous eyes, bears some resemblance to Argus.

జోన్స్ యొక్క పై పరిశోధనలు నిశితంగా చూస్తే గ్రీకు, ఇటలీ దేవతలు కేవలం పేర్లలోనూ, ఆకారంలోనూ హిందూదేవతల పోలికలు మాత్రమే కలిగివున్న దేవతలు కాదు - నిజానికి రెండూ ఒకే దేవతలు!

స్కాంద పురాణంలో స్కందునిగా వర్ణించిన దేవత ఎలాగయితే పర్షియాలో సికిందర్ గా మారిందో అరబ్బుల భాషలో ఇస్కందర్ గా వికృతి చెంది కనిపిస్తుంది. అలానే ఈశుడయిన శివుడూ, ఆయన భార్య అయిన ఈశానీ రోమనుల ఈశి (Isis) గా మారిందని కూడా జోన్సు పరిశోధనవల్లే తెలుస్తుంది.

He seams clearly to be the Orus of Egypt and the Mars of italy his name Scand, by which he is celebrated in one of the Puranas has connection. Ia m persuated with the old Secunder of Persia, whom the poets rediculously confound with the Mecedonian.

కేవలం యూరోపియను సంస్కృతికి ఆధారభూతమయిన రోమన్, గ్రీకు పురాణాలలోని దేవతలను పరిశోధించిన "జోన్స్" రీసెర్చివల్ల తెలిసే విషయాలన్నీ మనకు ఒకే ఆశ్చర్యకరమయిన సత్యాన్ని తెలుపుతుంది. అదేమిటంటే హిందూ దేవతలు కేవలం పాశ్చాత్య దేశాలయిన చైనా, జపాన్, కంబోడియాలలో మాత్రమే కాకుండా - రోమ్ పర్షియను, అరేబియను సంస్కృతులలో కూడా వ్యాపించివుండి అతి ప్రాచీనకాలంనుంచీ కొద్దిపాటి మార్పులతో నిలిచిన హిందూ దేవతలుగా ఈనాటికీ గుర్తించవచ్చు.

నిజానికి హిందూ దేవతల పేర్లే ఉచ్చారణా భేదంవల్ల మార్పులను పొంది కొన్నిశతాబ్దాల తర్వాత వేరువేరు దేవతలు అనుకొని వేరు వేరు మతాలుగా వారిని పొరపాటుగా అర్థం చేసుకోవడంవల్లనే మతకలహాలు

ఏర్పడ్డాయి. ఈ మతాల్లోని భేదాలు పోవాలంటే ఏనాటికయినా సైన్సు దృష్ట్యా ఇలా పరిశోధనలు చేసి అనేక దేవతలుగా, అనేక మతాలుగా వేరు అని భ్రమపడుతున్న సత్యాన్ని ఒకే విశ్వవ్యాప్తమయిన ప్రాచీనమయిన మతంగా తెలుసుకోవడమే దీనికి సరియైన నివారణ !

ఈనాడు హిందూమతంగా అనుకొంటున్నది కేవలం ఒక్క హిందూదేశంలోని మతమే కాదు - ఒక్క హిందూదేశంలోనే మిగిలివున్న - ప్రాచీన మతంయొక్క అసలు స్వరూపం! ఇలానే పెరూ, మెక్సికో, మాయా, ఇంకాస్ సంస్కృతులలో చూసినా ఈ హిందూదేవుళ్ళే మళ్ళీ దర్శనమిస్తారు.

ఈ విషయాన్ని మెక్సికను, అమెరికను చారిత్రకులు తమ పరిశోధనలద్వారా ఎలా కనుగొన్నారో - అది వచ్చే అధ్యాయంలో గమనిద్దాము.



7

# జపాన్‌లో హిందూమతం

బ్రహ్మ దేవుడికి జపాన్‌లో వున్నన్ని ఆలయాలు మరే ఇతర హిందూ దేవుడికీ లేవు. ఆయనను అక్కడ 'బొంటెన్ సామా' అన్న పేరుతో కొలుస్తారు. శివుణ్ణికూడా అక్కడ ఎక్కువ మంది పూజిస్తారు. హిందూ దేవుళ్ళందరిలోకి ఈయనకే ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇస్తారు. 'ఫూడో' అనే దేవుడు అచల, రుద్ర, అగ్ని, వాయు మొదలైన నామాలతో అర్చింపబడుతున్నాడు. మనకు కాశీ ఎటువంటిదో జపాను వారికి "కోయాసాన్" అంత గొప్ప పుణ్యస్థలం. అక్కడ 'ఫూదోడు' ఆలయంలో 'అచల' పేరుతో శివుణ్ణి కొలుస్తారు. శివుడి ప్రతిమను అక్కడ పూజారి 1198లో స్వయంగా చెక్కాడని స్థలపురాణంలో వర్ణించ బడింది 'కోయా'లోని 'నావిన్' ఆలయంలో శివుడు 'నమికిరి - అచల' అన్న పేరుతో పూజలందుకుంటున్నాడు.

ఈనాటికీ 2000 - సంవత్సరాల క్రితం సిద్ధ నాగార్జునుడు స్థాపించిన బౌద్ధమత కేంద్ర స్థానము ఈనాటికీ 'మౌంట్ కోయా' లోనే వుంది. ఇక్కడి ప్రతిమను 'కోబోడాయిషీ' అనే మునీశ్వరుడు స్వయంగా చెక్కి చైనానుంచి సముద్ర మార్గముగా తీసుకు వస్తూంటే అతడి నావ తుఫానులో చిక్కుకుంది.

అప్పుడు దాన్ని జపానుకు సురక్షితంగా చేర్చవలసిందిగా అతడు ఆ దేవుణ్ణి ప్రార్థించాడు. అప్పుడుదారిలో ఏర్పడ్డ ఆ తుఫాను అంతరించి, సముద్రుడు శాంతించాడు. అందుకని ఆ దేవుడు 'నమికిరి – అచల' అన్న పేరు గలవాడుఅయ్యాడు. 'నమికిరి – అచల' అంటే సముద్రుడినే శాంతింపచేసే శివుడు అనిఅర్థం.

1281లో మంగోలియన్ రాజు కుబ్లాయఖ్రాస్ సైన్యం జపానుపై దండయాత్ర జరుపడానికి సన్నాహాలు చేసింది. దాంతో జపాను దేశస్థులు ఈ 'నమికిరి – అచల' దేవుణ్ణి సముద్రతీరానికి తీసుకొని పోయి తమకు విజయాన్ని చేకూర్చుమని భక్తితో ప్రార్థించడంతో సముద్రుడు పొంగడం ప్రారంభించి కుబ్లాయిఖ్రాస్ సైన్యాన్నంతటినీ మార్గమధ్యంలోనే నాశనం చేసినట్లుకూడా జపానుచరిత్ర తెలుపుతుంది ఈ ఆశ్చర్యాన్నింకా ఈనాటికీ చెప్పుకుంటారు.

జపాన్‌లో ఈనాటికీ ఆబాల గోపాలం యముడంటే చాలా భయపడతారు. మృత్యువుకు అధిపతి ఆయన – అంతేకాదు. న్యాయాధిపతి కూడా ఆయనే. ఆయన్ను 'ఎమ్మాసాన్' అంటారు. 'ఎమ్మా అంటే యామ్మాక్యోటో, ప్రాంతంలోవున్న ఆలయంలో దున్నపోతుపై అధిష్టించిన యమధర్మరాజు అని అర్థం! ఆ విగ్రహం ఈనాటికీ వుంది.

## యముడు – నచికేతుడు :

యముణ్ణి గురించి అనేక కథలు అక్కడ ప్రచారంలో వున్నాయి. ఒక బౌద్ధమతప్రచారకుడు మూడు రోజులపాటు యముడితో బాహాబాహి వాగ్యుద్ధంచేసి గెలిచి (నచికేతుడు) తిరిగివచ్చాడని జపానులో అందరూ నమ్ముతారు. ఆ మత ప్రచారకుడు చనిపోయాడు. కాని ఆయన శరీరంమాత్రం చల్లబడలేదు. దాంతో ఆయన శిష్యుడు గురువుగారు మళ్ళీ

బతుకుతారనే నమ్మకంతో ఆ భౌతికకాయానికి జరుపవలసిన అంత్యక్రియలు జరుపలేదు. మూడు రోజులనాటికి ఆయన ఆశ్చర్యంగా నిద్రలోంచి లేచినట్లుగాలేచి, తాను యమలోకం వెళ్ళినట్లు అక్కడ ఇద్దరు యమభటులు తనను యమధర్మరాజుముందు నిలిపినట్లు అంతలో ఆయన తనను గౌరవంతో మళ్ళీ భూలోకానికి - ధర్మసందేశాన్ని ప్రజలకు బోధించమనిచెప్పి తిరిగి పంపినట్లు శిష్యులకు వివరించాడు. ఇది క్రీస్తు చనిపోయి లేచుటవంటి గాథ-యమ నచికేతులగాథ వంటిది.

స్వర్గలోకాధిపతియైన ఇంద్రుడిపేర - మన దేశంలో ఎక్కడా ఆలయాలు లేకపోయినప్పటికీ జపానులో మాత్రం చాలానే వున్నాయి.

టోకియా నగరానికి వెలుపల వున్న 'ౖటైపాన్ టెన్'గా పిలువబడే ఇంద్రుడి ఆలయము చెక్కిన శిల్పకళకు మిక్కిలి ప్రసిద్ధి చెందింది. ఇంద్రుడి ఆలయం ముందు హనుమంతుని విగ్రహాలు రెండింటిని కూడా ప్రతిష్ఠించారు.

"షో-టెన్" అంటే పవిత్రమైన దేవుడు అని అర్థము. ఆ పేరుమీద వినాయకుణ్ణికూడా అక్కడ పూజిస్తారు. ఆయన ప్రేమికులకు సంతోషాన్ని ప్రసాదిస్తాడని అక్కడివారి నమ్మిక. జపానులో అక్కడక్కడ ఆడ, మగ వినాయకులు (వైనాయకి) ఆలింగనము చేసుకున్నట్లుకూడా విగ్రహాలు ఉన్నాయి.

సరస్వతీదేవిని అక్కడ 'బెంటెన్ సామా' పేరుతో విరివిగా కొలుస్తారు. 'ఇనోషియా' ద్వీపాన్ని 'బెంటెన్' ద్వీపముగా నామాంతరీకరించి సరస్వతిపై గల భక్తిని ప్రదర్శించుకున్నారు. భాగ్యానికీ, అందానికీ, అదృష్టానికీ, చదువరులకు ప్రతీక, బెంటెన్ అని వారి ఉద్దేశ్యము. ఆ కారణంతోనే వేలాది భక్తులు నిత్యము "ఇనోషియాలో" ఆమెను పూజిస్తారు.

అక్కడ చాలా ఆలయాలలో గౌతమ బుద్ధుడు ప్రధానదైవము! అయితే గర్భగుడిలో బుద్ధుని సరసనగాని, ఇతర దేవతల సరసనకానీ,- మన

హిందూ దేవుళ్ళను తప్పకుండా ప్రతిష్ఠిస్తారు.

దీన్నిబట్టి చూస్తే జపాన్ దేశంలో హిందూదేవుళ్ళకూ - బుద్ధుని ప్రతిమలకూ కొదువలేదు. మనం పూర్తిగా మరిచిపోయిన దేవుళ్ళను కూడా వారు నేటికీ కొలుస్తారు. బ్రహ్మ, ఇంద్ర, శివ, గణేశ, సరస్వతి, రుద్ర. పృథ్వి, సూర్య, సోమ, కార్తికేయ, సహస్రబాహు, కుబేర, యమధర్మరాజులు జపానువారు ఇంటింటా నిత్యమూ కొలిచే ఇష్టదేవతలే.

ఇది సూక్ష్మంలో చెప్పాలంటే జపానులో కనబడే - హిందూ మతమునకు ప్రతీకలుగా ఈనాటికీ నిలిచిన హిందూ దేవుళ్ళు.



8

# చైనాలో హిందూమతం

"ఇరవై శతాబ్దాలకు పైబడి చైనాను భారతదేశం జయించింది సాంస్కృతికంగా, ఎప్పుడూ ఒక్క సైనికుడ్ని అయినా పంపకుండానే భారతదేశ సరిహద్దు దాటి-ఏ ఒక్క ఆయుధమూ ప్రయోగించ కుండానే, చుట్టుప్రక్కల దేశాలపై ఏనాడూ భారతదేశం తన అధికారాన్ని బలాత్కారంగా చలాయించలేదు. పైగా అన్ని పరిసర దేశాలూ ఇష్టంతో వెతుక్కుంటూ భారతీయ విజ్ఞానాన్ని అధ్యయనం చేయటానికి యాత్రలు చేసి సంపాదించుకునేవి! చైనా హృదయపూర్వకంగా ఈ భారతీయ సంస్కృతిని అంగీకరించి జీర్ణం చేసుకున్నది".

ఈ మాటలు అన్నది భారతీయుడు కాదు! చైనా రాయబారిగా అమెరికాలో పనిచేసిన 'హు-షిహ్' (Hu-Shih) వాక్యాలే, స్వయానా! చాలామంది భారతీయులకు తెలియని 'బహిరంగ రహస్యం' (Public Secret) ఏమిటంటే అతి ప్రాచీన కాలంనుంచీ చైనామతం, సంస్కృతీ, విజ్ఞానం ఆధ్యాత్మిక

శాస్త్రములూ అన్నీ భారతదేశంవే. ఈనాడు చైనా చరిత్ర తెలియని మనవారికిది (మన చరిత్రే తెలియదు గదా సరిగ్గా) ఎంతో విడ్డూరంగా వుంటుంది.

ఇది కేవలం నా స్వదేశంపై అభిమానంతో చెప్పే అభిప్రాయం కాదు. చైనా విజ్ఞానులు ప్రత్యక్షంగా చాటిచెప్పినదే. భారతీయ విజ్ఞానంపైనా, చైనా వేదాంతశాస్త్రంపైనా ప్రపంచ ప్రఖ్యాతి వహించిన ప్రఖ్యాత చైనీస్ వేదాంతి 'లిన్-యు-తాంగ్' (Lin - Yu - Tang) ఇలా చెప్పాడు. 'భారతీయ విజ్ఞానం' అన్న తన గ్రంథంలో -

"చైనాకు గురువు, భారతదేశం! మతంలోనూ వేదంలోనూ భావనా ప్రాధాన్యతగల సాహిత్యంలోనూ భారతదేశం చైనాకు గురువు. గణితంలో జ్యామెట్రీ (ట్రిగ్నామెట్రి)లోనూ, వ్యాకరణము, ఈక్వేషనులూ, భాషా శాస్త్రము, చదరములోనూ, జంతువులకథలు, అరేబియన్ నైట్స్‌లలో ప్రపంచానికే గురువు! జర్మను మహాకవులైన గోథే (Gothe) షోఫెన్ హెూయర్, బొకేషియా ఎమర్సన్‌ల వంటి మేధావులను ప్రభావితం చేసింది కూడా!

ఈనాడెవరైనా లిన్-యు-తాంగ్* మాటలను సంశయిస్తే మన దేశ చరిత్ర - హిందూ మహాయుగం పుటలు తిరగేస్తే చాలు. ఎందరెందరు చైనా యాత్రీకులు మనదేశానికి కాలినడకన బహుదూరంనుంచి శ్రమించి వచ్చారో ఆశ్చర్యం వేస్తుంది !

హ్యూయన్-సాంగ్ గురించి విననివాడు వుండడు. ఈనాటికీ బ్రిటీషువారు తర్జుమాచేసిన ఈ హ్యూయన్-సాంగ్' వర్ణన చదువుతూంటే ఆనాటి భారతదేశాన్ని ఎలా కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడో మనకి ఆశ్చర్యం

---

* భారతీయ విజ్ఞానం (Wisdom of India) అన్న గ్రంథం !

వేస్తుంది. మన రచయితలెవరూ వ్రాయని వింతలూ, విశేషాలు, ప్రజల అలవాట్లు, దేశ పరిస్థితులూ ఎన్నో వర్ణించాడు. అలానే ఇత్-సింగ్, ఫాహియాన్ వంటి వారిరచనలు పెద్ద గ్రంథాలుగా ముద్రితమై వున్నాయి. అంతెందుకు? గౌతమ బుద్ధుని సరైన జాతకం కావాలన్నా, ఆయన జీవితంలోని అనేక ఘట్టాల్ని ఏ టైమ్‌కి ఏమి జరిగిందో చదవాలన్నా తిథివార నక్షత్రాలతోసహా అతి జాగ్రత్తగా అన్నీ వ్రాసిపెట్టుకున్నారు-ఈ చైనీస్ యాత్రికులు, బౌద్ధమత భక్తులే!

మహాభారతములో సిల్కు బట్టలకు సంస్కృతంలో చీని-చీనాంబరాలు పాండవులు ధరించినట్టు - అనగా చైనా నుంచి (చినీ) వచ్చిన చైనీసు సిల్కు (చీనాంబరము) ధరించినట్టు వర్ణనలు స్పష్టంగా వున్నాయి. అంతేకాదు. తూర్పుదేశాలను 'ప్రాచీన (ప్రా + చీనా = చీనాకు ప్రాచ్యంగా వున్న) దేశాలని వర్ణించటం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

అయితే బౌద్ధ మతంతోనే ఈ చైనా భారతదేశాల మత సంబంధం ఆరంభమైందని కొందరనుకునే ఊహ నిజం కాదని చైనాచరిత్ర పరిశోధన చేసినవారికి ఇట్టే అవగతమవుతుంది. "రింగ్-తారో-నాగసావా' అనే జపాను పండితుడు ఏమన్నాడో వింటే ఆశ్చర్యం వేస్తుంది. బౌద్ధమతం పుట్టకముందు చాలాకాలం క్రితమే జపానుకు భారతదేశంనుండి అతి ప్రాచీనమతం వచ్చింది - అది ముందు చైనాకు వచ్చి కొరియానుంచి జపానుకు చేరింది. దాని పేరు 'బ్రహ్మణ-ఒకియా' అని! ఈ మాట 'బ్రహ్మణ-ఒకియా' **(Brahman - Okyo)** బ్రహ్మ(ణ) వాక్యం * అన్న పదానికి వికృతి. బౌద్ధమతం పుట్టడానికి శతాబ్దాల ముందునుంచీ వున్న దేవాలయాలూ, హిందూ దేవుళ్ళ విగ్రహాలూ చైనాలో ఎక్కడ చూసినా ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి.

చైనీస్-తుర్కిస్థాన్‌లో దొరికిన గణేశుడి మూర్తిగురించి ఇంతకు

ముందు అధ్యాయాలలో గమనించాము. అశ్వత్థామ కంబోడియా రాక
ముందు అధ్యాయాలలో గమనించాము. బ్రిటీషు విజ్ఞాన
గురించి - చైనా చరిత్ర తెలిపే విశేషాలను చదివాము. బ్రిటీషు విజ్ఞాన
సర్వస్వంలో చైనీస్ రాజనీతి గురించి వ్రాసిన సర్ జార్జి గ్రీర్‌సన్ చైనావారు
హిందూ రాజకీయ సాంప్రదాయాన్ని అవలంబించేవారనీ ఈ చైనా జాతి,
ఒకప్పుడు 'క్షత్రియ' వంశాలుగా పరిగణింపబడేవారని రాస్తూ ఈనాటికీ
'గిల్గిత్'లోని ఒక తెగవారిని 'షిన్' (Shine) అని పిలుస్తారనీ, సిల్కు తయారీ
మల్బరీ చెట్లూ --ఈనాటికీ చైనాలోలాగే పెంచుతున్నారని-షిన్ అన్న
శబ్దం సంస్కృతంలో 'చీనీ' శబ్దానికి వికృతి అనీ, వ్రాశాడు!

## ప్రాచీన చైనాలో 'మనుస్మృతి' :

అమెరికాలోని యేల్ (Yale) యూనివర్సిటీలో డాక్టరేట్ కోసం
పరిశోధన చేస్తున్న రోజుల్లో(1935) డా॥ మోట్‌వానీ - అమెరికాలో దొరకని
అపూర్వ గ్రంధాల కోసం బ్రిటీషు మ్యూజియం గ్రంథాలయం వారికి
వ్రాశాడు. చాలాకాలంవరకూ, సమాధానం రాలేదు. చివరికి తన పరిశోధన
దాదాపు పూర్తి అయిపోతున్న సమయంలో ఆయనకు ఈ విధంగా ఒక లేఖ
వచ్చినది!

"జపాన్ యుద్ధంలో 1932లో చైనాపై బాంబులు కురిపించిన
సమయంలో చైనాలోని పెద్దగోడ (Great wall of China) ఆ బాంబులకుకొన్ని
చోట్ల పగిలిపోయి పడిపోయింది. ఆ పునాది క్రింద ఒక పేటిక దొరికింది
అందులో ఒక అపూర్వమైన ప్రాచీన తాళపత్ర గ్రంథం దొరికింది.

---

* 'అక్షరం బ్రహ్మ- వాక్ బీజం' అని ప్రశనం సంస్కృతంలో వర్ణించారు
గదా! కాబట్టి - బ్రాహ్మ+ వాక్+ యం= బ్రహ్మ ఓకియో అయింది!

ఆ గ్రంథాన్ని పరిశోధించితే - దానిముందు పుటలో దానికి సంబంధించిన చరిత్ర క్లుప్తంగా వున్నది. అది చైనా చక్రవర్తి 'చిన్ - ఇజ్ - వాంగ్' (Chin-ize-Waing) కాలంనాటి సంగతులు తెలిపింది. ఆయనకు మానవ చరిత్రలో - విజ్ఞానమంతా తన కాలంలో తననించే వచ్చిందని, తనతర్వాతి తరాలవాళ్ళు భావించేలాగా చెయ్యాలని ఓ పిచ్చి పట్టుకున్నది. దాంతో చైనాలో అతి ప్రాచీనయుగాలనుంచి భద్రంగా, దాచబడిన గ్రంథాలన్నింటినీ తగులబెట్టమని ఆజ్ఞలు జారీ చేశాడు. ప్రాచీన చైనా సంస్కృతి గురించి దాని ఆచూకీ గురించి తెలిపేవన్నీ ప్రత్యేకంగా తగులబెట్టబడ్డాయి. ఆ సమయంలో ఒక పండితుడు ఎలాగో అతి కష్టంతో ప్రాణాలకు తెగించి, ఈ గ్రంథాన్ని అతి భద్రంగా పేటికలో దాచి చైనాగోడ కట్టుతుండగా పునాదుల క్రింద రహస్యంగా పాతి వేశాడు. దానిపైన గోడ నిలిచిపోయింది. కొన్ని వేల సంవత్సరాల తర్వాత అది బాంబులకు పేలి ఈ పేటిక, దాంట్లో ఈ గ్రంథమూ దొరికాయి.

"ఆ గ్రంథాన్ని సర్ అగస్టిస్ ఫ్రిట్జ్‌జార్జి (Sir Augustus Fritz George) మహాశయుడు చాలా ఖరీదుకు కొని, చైనానుంచి బ్రిటీషు మ్యూజియంలో భద్రపరిచాడు. దానిని బ్రిటీషు పండితుడైన 'ఆంతోని గ్రీయన్' (Amthony Graene) చైనా భాషావేత్త - పరిశోధించగా 10,000 సంవత్సరాలనాటి గ్రంథమనితేలింది. దీన్ని పరిశీలించిన సర్ వ్యాలెస్ బడ్జ్ (Sir Walce Budge) ఇలా అన్నారు.

"ఈ తాళపత్రం కోడెక్స్ నయాటికస్ కన్నా అతి పురాతనమైనది. ఇందులో వేదంలోని భాషతో 10,000 సంవత్సరాల క్రితం వ్రాసిన మనువుయొక్క శాసనాలు సహితం వివరించిన ప్రమాణ గ్రంథమిది. దీనిలో ఈనాడు డార్విన్ వివరించిన పరిణామ సిద్ధాంతం గురించి స్పష్టంగా ప్రాచీనుల విజ్ఞానంగా వ్రాయబడి వున్నది. మొదటి జీవులు చెట్లు. ఆ తర్వాత పరిణామ దశలలో భూమి అడుగున పాకుడువంటి జిగురునుంచి

బ్రహ్మాండమైన రాక్షసి జంతువులు పుట్టాయి. వాటినుంచి దశలు దశలుగా మానవుడు వచ్చాడు" అని వ్రాసి వున్నది.

ఇంకా ఆ గ్రంథంలో అనేక వందల ఏళ్ళు జీవించటానికి పనికివచ్చే ఆయుర్వేద మూలికల గురించి రహస్యాలు వ్రాసివున్నాయి. ఆ చెట్లు ఎక్కడ దొరుకుతాయో వివరిస్తూ, నేటి 'పెరూ' అడవులవద్ద దొరుకుతాయని వివరంగా వ్రాసి వుంది' అంటూ వచ్చిన బ్రిటీష్ మ్యూజియంవారి జాబులోని విషయాలను డా॥ మోట్ వానీ "1936లో కలకత్తాలోని ఒక పత్రికకు పంపిస్తే వారు ప్రచురించారు" అని కూడా వ్రాస్తున్నాడు.

ఈనాటి భారతీయ వేదాంతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ మన దేశంనుంచి చైనాకు వెళ్ళిన మొట్టమొదటి పండితులు - కాశ్యప మతంగుడు అని ఈయన 67 **A. D.** నాటివాడని వ్రాస్తున్నాడు. కాని క్రీస్తుకు 1122 పూర్వమే చైనాకు భారతీయ విజ్ఞానం పోయింది" అని వ్రాశాడు, "హిందూ అమెరికా" అన్న పుస్తకం గ్రంథకర్త (పే. 103)!



9

# బర్మాలో హిందూమతం

ప్రాచీన కాలంలోనే భారతదేశానికి ఆసియాలో చాలా ప్రాంతాలతో సన్నిహిత సాంస్కృతిక, మత సంబంధాలేర్పడ్డాయి. ఇది జరిగి పద్దెనిమిది వందల సంవత్సరాలైనా ఆ ప్రభావం ఈనాటికీ అనేక దేశాలలో మనకు కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ముందుగా బర్మాలో హిందూ సంస్కృతి ప్రభావం చూద్దాం.

క్రీస్తుశకం ప్రారంభంలోనే (2వ శతాబ్దంలో) భారతీయులు భూ, సముద్రమార్గాల ద్వారా బర్మా చేరుకున్నారు. వారితో భారతీయ సంస్కృతి ఆధ్యాత్మికత బర్మాలో కూడ వ్యాపించాయి. అలావెళ్ళిన భారతీయులలో కొందరు థాటన్ ప్రాంతంలో నివాసమేర్పరచుకోగా, మరికొందరు దక్షిణంగా పయనించి సియామ్ ప్రాంతంలో స్థిరపడ్డారు. బందన్ తీర ప్రాంతంలోనూ, టాకూర్ ప్రాంతంలోనూ భారతీయసంతతి ఆవాసాలు నేటికీ వున్నాయి. బర్మాలో ఇప్పుడు తలాయంగ్ (Talaing) జాతిగా పిలువబడుతున్న వారు (మాన్ – Mon) భారతదేశం తూర్పుతీరం ఉన్న తెలంగాణ (కళింగ) ప్రాంతం

నుండి వచ్చి ఇక్కడ స్థిరపడ్డారని విశ్వసిస్తున్నారు. హమాల్ జా (Hamalza) వద్ద మవుంగన్ ప్రాంతంలో దొరికిన ఆధారాలనుబట్టి, క్రీ.శ. 5వ శతాబ్దానికి చాలా ముందుగానే హిందూమతం, బౌద్ధమతం బర్మాలో ప్రాచుర్యం పొందాయి. మవుంగన్ ప్రాంతంలో పాళీభాషలో బంగారు రేకులపై వ్రాసిన బౌద్ధసూత్రాలు లభించాయి. ఈ లిపి దక్షిణభారతభాషైన కదంబ లిపిని పోలిఉంది. అవి 6వ శతాబ్దినాటికే ప్యూ రాజులు 'తేరవాదా'ను (Therevada) పాటించేవారని సూచిస్తున్నాయి. బర్మాలో అనేక ప్రాంతాలలో బౌద్ధమతానికి చెందిన ఆధారాలేకాక, హిందూ దేవతల ప్రతిమలు కూడా లభించాయి. మాల్ జా వద్ద విష్ణువు, బ్రహ్మ, గణేశుని మూర్తులూ, మెర్గ్వీ (Mergui) లో విష్ణువు, గరుడుడు, హనుమాన్, అరకాన్ (Arakan) లో విష్ణువు, సూర్యుడు, దుర్గాదేవి ప్రతిమలు లభించాయి. కాలాగంగాన్ (Kalagangan) గ్రామంలో శివలింగం శేషాలు లభ్యమవడం -- ఈ ప్రాంతంలో బౌద్ధమతంతో పాటు, అదే సమయంలో శైవమతం కూడా ప్రాచుర్యంలో ఉండేదని సూచిస్తుంది.

అరకాన్ లో హిందూగుర్తులు కలిగివున్న మట్టిఫలకాలు, నాణాలుకూడా దొరికాయి. హమాల్ జాలోనే బోధిసత్త్వల మూర్తులు కూడ లభ్యమయ్యాయి. ఇవి 9వ శతాబ్దానికి చెందిన బుద్ధగయలోని మూర్తులను పోలివున్నాయి దీనినిబట్టి, క్రీశ. 3వ శతాబ్దంనుండి 9వ శతాబ్దంవరకూ, బర్మాలో బౌద్ధమతం, హిందూమతం కూడా అవలంబించేవారని తెలుస్తోంది.

బర్మీయుల జీవనంలో హిందూసంస్కృతి అన్ని రంగాల లోనూ, ప్ర[illegible]ంది. భారతదేశంలో 'ప్యూ' (Pyu) రాజ్యాన్ని 'శ్రీక్షేత్రం' అనే వారు. శ్రీక్షేత్రం అనేది ప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన 'పూరీ' పవిత్ర నామం మారుపేరు. అలాగే పెగూ (ఒరిస్సా పదంనుండి వచ్చినది) 'ఉస్సా' అని పిలువబడేది.

థాటన్ ప్రాంతంలోని మాన్ రాజ్యం (Mon Kingdom) పూర్వం 'రామన్నదేశం'గా పిలువబడేది. దీనిలో పెగూ (Pegu) థాటన్ (Thatan)

ముఖ్యపట్టణాలుగా ఉండేవి. మధ్యసియామ్ (Central Siem) ప్రాంతంలోని లోప్‌బరీ (Lopburi) లో ఒక స్థంభంపై చెక్కి ఉన్న అతి ప్రాచీనశాసనం క్రీశ. 5వ శతాబ్దానికి చెందిన 'పల్లవ' లిపిని పోలివుంది. అక్కడ దొరికిన శాసనాలలు ఇతర అవశేషాలు కూడా ఇది దక్షిణ భారతలిపినుండి వచ్చినదనే సూచిస్తున్నాయి. ఈ శాసనాలలో మతానికి సంబంధించి వున్న వాక్యాలు సంస్కృతంలో ఉండడంబట్టి వారికి భారతదేశంతో ప్రత్యక్షసంబంధాలుండేవని, హిందూమతం ఇక్కడ ప్రబలంగా వ్యాపించిందని తెలుస్తోంది.

టిబెట్ జావా కాంబూజ (కాంభోజ) కంపా (Campa) దేశాలలో హిందూమతం, బౌద్ధమతం రెండూ ఒకేసారి వృద్ధిచెందాయి. కొన్ని ప్రదేశాలలో రెండూ కలగలిసిపోయాయి. బర్మాలో జరిగే ఉత్సవాలన్ని బ్రాహ్మణుల ఆధ్వర్యంలో జరిగేవి. బర్మా, కాంబూజీ, సియామ్ ఆ స్థానాలలోవారే జ్యోతిష్కులుగా ఉండేవారు. హిందూమత ప్రభావం వారిపై ఎంతగా ఉండేవో దీనివల్ల తెలుస్తోంది. బర్మా భారతదేశాల మధ్య ఉన్న ప్రకృతి సంబంధమైన అవరోధాలు--పర్వతాలు, సముద్రమూ హిందూసంస్కృతి బర్మాకు వ్యాపించడానికి అవరోధం కాలేకపోయాయి. బర్మీయులు భారతీయ సంస్కృతిని అభిమానించి, ఆ అభిమానంతో వారి ప్రాంతాలకు హిందూ పేర్లు పెట్టుకున్నారు. బర్మా ఎగువభాగాన్ని (Upper Burme) "అపరాంతక" (పశ్చిమ భారతంలో ఒక జిల్లా పేరు) అని, ప్రోమ్ (Prom) ను శ్రీక్షేత్రం అని పిలుస్తారు. ఇరావాది (Irreweddy) అనే పేరు ఐరావతి నుండి దారావాడి తారావా, తావాతి అనే పేర్లు శ్రావస్తి లేక శావత్తి నుండి వచ్చాయి.

బుద్ధుడు శ్రీలంక, బర్మాలలో కూడా పర్యటించాడని భావించబడుతోంది. బర్మాకు వచ్చినపుడు మాండలే (Mondalay) లోని అరకాన్ పగోడా (Arekan Pagoda) లోని మూర్తికి తన శక్తిని కొంత ధారపోసాడని అంటారు. బర్మాలో బౌద్ధధర్మం గురించి చెప్పే సింహళకథ, 'దీపవంశ' లోని సోమ, ఉత్తరుల కథ, సువర్ణభూమిని రామన్నదేశం (థాటన్ జిల్లా) గా

గుర్తించడం హిందూమతం వివిధ దేశాల సాహితి, సంస్కృతులను ఎల్ల
ప్రభావితం చేసిందో తెలుపుతుంది.

బర్మా దిగువ ప్రాంతం క్రీ.శ. మొదటి శతాబ్దాలలో బౌద్ధదేశంగ
పేరుపొందింది! పదకొండో శతాబ్దంలో తలైంగులను (Thalainges) అనువ్రతుడ
జయించడంతో బౌద్ధధర్మం ఇంకా బలమైన శక్తిగా రూపొందింది. తలాయింగ్
భాషలో సంస్కృత పదాల వాడకం తలాయింగ్ రికార్డుల్లో దక్షిణ భారతదే
ప్రసక్తి ముఖ్యంగా కాంజివరం (కంచి) గురించి, ధర్మపాలుడు, ఇంకా ఇత
పండిత శ్రేష్ఠుల గురించి ప్రస్తావన తరుచుగా కనిపిస్తాయి. పాగన్ (Pagan) కు
దక్షిణ భారతానికి చెందిన శిల్పకళలో ఉన్న పోలికలను ఫోర్ష్‌హామర్ (Forcshamu
గుర్తించి, ప్రకటించాడు. పూర్వం తలాయింగ్ భాషలో ఉండే అక్షరాల
క్రీ.శ. నాలుగవ శతాబ్దానికి చెందిన వెంగీ (Vengi) భాషలో అక్షరాలవ
ఉంటాయని అతడు తెలిపాడు.

బర్మాలో హీనయాన, మహాయాన, తాంత్రిక బౌద్ధమార్గాలూ, బెంగాల్
ఒరిస్సాల నుండి హిందూమతం వ్యాపించాయి. బర్మాలోని పురాత
భవనాలు శిల్పాలపై వాటి ప్రభావం తేలికగా గుర్తించవచ్చు. కాంబూజ, చంప
ప్రాంతాలలో శైవమతం, లింగారాధన ప్రాచుర్యంలో ఉండగా, బర్మాలో
శైవచిహ్నాలు తక్కువగానూ, వైష్ణవ దేవతల విగ్రహాలు ఎక్కువగాను
దొరికాయి. పాగన్ వద్ద ఒక గ్రామంలో బోధిసత్వుని మధ్యచిత్రాల
కనిపిస్తాయి. ఒక గుడిలో 1248సం॥అని తేదీ వేసివున్న ఒక శాసనంలో
మతాచార్యులకు (Priests) బియ్యమూ, తమలపాకుల వంటివి ఇవ్వాలని
వ్రాసివుంది. ఈ ఆచార్యులెవరో తెలియక పోయినా వారు బౌద్ధ శక్తితత్వాన్ని
(Extreme form of Buddhist Seletism) అవలంబించేవారని మాత్రం ఖచ్చితంగా
తెలుస్తోంది.

క్రీ.శ. 1060వ సంవత్సరం నుండి 13వ శతాబ్దం వరకు పాగన్ బౌద్ధ
సంస్కృతికి కేంద్రంగా విరాజిల్లింది. ఇది బర్మాకే కాక, తూర్పు

ప్రాంతానికంతటికీ జ్ఞానానికీ శిల్పకళను, విద్యలకు కేంద్రంగా విలసిల్లింది. అప్పుడు నిర్మించిన పగోడాలు నేటికీ ఆనాటి శిల్పకళా వైభవానికి ప్రతీకలుగా కనిపిస్తున్నాయి. అనవ్రతుని తరువాత వచ్చిన రాజులు అనేక ఆలయాలు నిర్మించారు.

బర్మా దేశీయులు శిల్పకళలో గొప్పదిగా పేర్కొనదగిన 'ఆనంద' ఆలయం హిందూవాస్తుశాస్త్రం ప్రకారం నిర్మించారు. దానిని అరిమర్దనపురి చక్రవర్తి క్యాంజితరాజు (Kyenjitha) (క్రీ.శ. 1084-1112) పాగన్‌లో నిర్మించాడు.

బీహార్‌లో ప్రసిద్ధమైన బుద్ధగయలోని ఆలయాన్ని అనుసరించి బర్మాలో జయసింహ (Zeyatheinkta) మహాబోధి అలయాన్ని నిర్మించాడు. బర్మాలో ఆలయాల నిర్మాణంలోనే కాకుండా స్థలాల పేర్లపై కూడా హిందూ సంస్కృతి ప్రభావం ఎక్కువగానే కనిపిస్తుంది. హిందూ పేర్లైన అవంతి, వారణాసి ద్వారావతి, గాంధార, కాంభోజ, కైలాస, మిథిలా పుష్కర, ఉత్కళ, వైశాలి ఇలా చెప్పాలంటే ఎన్నో ఉంటాయి.

## బర్మాలో పాళీబాష :

క్రీ.శ. 1064లో ఆనంద ఆలయానికి చెందిన మఠంలోనివసించే ధమ్మ సేనాపతి (Dhamma Senapathi) కారిక (Karika) అనే వ్యాకరణ గ్రంథాన్ని వ్రాయడంతో, బర్మాలో పాళీ సాహిత్యం ప్రారంభమయింది. త్రిపిటిక (Tripitika) భాషపై అఘవంశ (Aggevamsa, 1154 A.D.) రచించిన సాదనితి (Saddaniti) బర్మాలోనేకాక సిలోన్‌లోకూడా ఖ్యాతి పొందింది. క్యోక్వ (Kyocve, 1230 A.D.) పరిపాలనలో పాళీ సాహిత్యానికి ఇంకా ప్రోత్సాహమూ లభించింది. స్త్రీలు కూడా పాళీ వ్యాకరణంలో ప్రవీణులై ఉండేవారు.

## బర్మీయుల న్యాయశాస్త్రానికి ఆధారమైన మనుస్మృతి

బర్మాలో ఇప్పటికే వారసత్వం, ఇతర గృహసంబంధ విషయాలతో అంగీకరించబడుతున్న బర్మా న్యాయశాస్త్ర గ్రంధాలు లేక ధమ్మధాత్‌లు (Dhammathets) హిందూ ధర్మాలను అనుసరించి వుంటాయి. వాటిలో ప్రాచీనమైన ధమ్మవిలాసుని (Dhammavilas 1174 A.D.) న్యాయశాస్త్రం, మార్తబాన్ (Mertaban) రాజైన వాగురు (Waguru 1280 A.D.) న్యాయశాస్త్రాలు మనుధర్మస్మృతిపై ఆధారపడి వున్నాయి. ఈ న్యాయశాస్త్రాలకు ఆధారమైన గ్రంధాలు భారత దేశం తూర్పుతీరం నుండి వచ్చాయని పండితులు భావిస్తున్నారు. బరార న్యాయశాస్త్రంపై కృషిచేసి, దానిని అభివృద్ధి పరచిన కైంగ్‌జీ (Kaingze) అనే బర్మా న్యాయశాస్త్రవేత్తను క్రీ.శ. 1640లో అప్పటి చక్రవర్తి మను పేరుతో మనురాజు అనే బిరుదుతో సన్మానించాడు.

బర్మాలో ఆస్థాన జ్యోతిష్కులుగా పొన్న (Ponna) అని పిలువబడే బ్రాహ్మణులు ఉండేవారు 1442కు చెందిన ఒక పాగన్ శాసనం ద్వారా సంఘుకు బహుకరించిన 295 గ్రంధాలలో ఎక్కువ వాటికి సంస్కృత నామాలున్నాయని తెలుస్తోంది. క్రీ.శ 1600లో సైన్సు, మాజిక్ కలిపి వైద్య, ఖగోళ, కామశాస్త్రాలుగా నేర్చుకొన్న వేదపండితుల ప్రస్తావన ఉంది.

హిందువులనుండి నేర్చుకొన్న ఆచారాలలో మాండలేలోని ఆరకాన్ ఆలయంలో విగ్రహానికి ప్రతిదినం పవిత్రోదకంతో అభిషేకించడం కూడా ఒకటి!

## ఆలయశిల్పకళ పై హిందూ ప్రభావం

పాగన్‌లో క్రీ.శ 10వ శతాబ్దికి చెందిన నాట్ హ్లైనుంగ్ గ్యాయుంగ్ (Not Hlaning Gyaing) ఆలయం హిందూ ఆలయాల నమూనాలో ఉంటుంది. ఇది విష్ణాలయం! దానిలో విష్ణుమూర్తి దశావతారాలు (బుద్ధుడు తొమ్మిదో

అవతారంగా) చెక్కి ఉన్నాయి. హిగన్‌లోనే ఉన్న ప్రసిద్ధ ఆనంద ఆలయాన్ని ఉత్తరభారత శిల్పంతో అలంకరించబడిన దక్షిణ భారత ఆలయంగా వర్ణిస్తారు.

ఈ విధంగా బర్మీయుల జీవనంలో అనేక రంగాలలో హిందూ సంస్కృతి ప్రభావం కనిపిస్తుంది.



10

# చైనీయులపై ప్రసరించిన భారతీయ ఆధ్యాత్మిక కిరణాలు

ప్రాచీన చైనీయులకు ఆధ్యాత్మిక విజ్ఞానకాంతి వెల్లువై భారతదేశంనుంచే ప్రసరించింది. 2600 సంవత్సరాల పూర్వం భారతీయ బౌద్ధ పండితుడు స్థవిర ప్రజ్ఞాదేవునికి, హ్యుయాన్ సాంగు (Heuan Tsang) అనే చైనీయుడికి మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు చైనాలో బయటపడ్డాయి. ఆ లేఖలలోని విషయాలు చాలా ఆసక్తిదాయకంగా వున్నాయి. ఆధ్మాత్మిక గ్రంథాలు పంపమని భారతీయులను కోరుతూ వ్రాసిన లేఖలవి. ప్రజ్ఞాదేవుడు హ్యుయాన్‌ట్సాంగ్‌కు 'మీకు కావలసిన సూత్రాలు, శాస్త్రాలూ పంపిస్తే, మేము ఆ గ్రంథాలను మీకు జాబితా పంపిస్తాం' అని వ్రాశాడు. దీనికి జవాబుగా హ్యుయాన్ సాంగ్!, "భారతదేశాన్నుండి తిరిగి వచ్చిన ఒక రాయబారి - పండిత శ్రేష్ఠుడైన శీలభద్రుడు ఇక లేరని తెలిపాడు. ఈ వార్త నన్ను అంతులేని విషాదంలో ముంచివేసింది. నేను (హ్యుయాన్ సాంగ్)

భారతదేశంనుంచి తీసుకువచ్చిన శాస్త్రాల్లో యోగాచారభూమి శాస్త్రంతో సహా 30 గ్రంథాలను అనువదించాను. కాని నేను విచారించే విషయమేమిటంటే సింధునది దాటుతున్నప్పుడు నేను చాలా పవిత్రగ్రంథాలు పోగొట్టుకున్నాను. మాకు కావలసిన గ్రంథాల జాబితాను ఈ ఉత్తరంతోపాటు పంపిస్తున్నాను. మీకు వీలైనప్పుడు వాటిని పంపించమని ప్రార్థిస్తున్నాను. మీకు పంపిస్తున్న చిరుకానుకలను స్వీకరించకోరుతున్నాను" అని వ్రాశాడు. భారత, చైనా దేశాల ప్రజలు ఆధ్యాత్మిక కారణాలవల్ల ఎంత సన్నిహితులయ్యారో దీనినిబట్టి తెలుస్తోంది.

హ్యుయాన్ సాంగ్ భారతదేశం రాక పూర్వమే, అంటే 2,600 సంవత్సరాలకు పూర్వమే ఈ రెండు దేశాలమధ్య సంబంధాలు స్థిరపడ్డాయి. మహాభారతంలో కూడా చైనా ప్రస్తావన వున్నది. ప్రాచీన భారతీయగ్రంథాలలో చైనాను 'చీనా' లేక 'షీనా' అని వ్రాసేవారు. 'చిన్' అంటే కృత్తికా నక్షత్రం. చైనా దేశానికి అధిపతి, జన్మనక్షత్రం, ఈ కృత్తికా నక్షత్రమే! జ్ఞాన పిపాసులై అనేకమంది చైనీయులు భారతదేశానికి తరలి వచ్చారు. భారతదేశ ప్రయాణం ఎన్నో కష్టాలతో కూడుకున్నదైనా మార్గం సుగమం కాకపోయినా వారు సరకు చేయలేదు. సముద్రమార్గం ద్వారా వచ్చే చైనా పండితులు మార్గమధ్యంలో ఇండోనేషియాలో ఆగి, అక్కడి భారతీయులవద్ద కొన్నినెలలుండి, సంస్కృతం నేర్చుకుని, అప్పుడే భారతదేశం వచ్చేవారు.

చైనాలో 1932లో దొరికిన ఒక పురాతన వ్రాతప్రతిలో 'మనుధర్మాల' గురించి అనేక విషయలున్నాయని బ్రిటీష్ మ్యూజియంకు చెందిన సర్‌వాలస్‌బడ్జ్ తెలిపాడు. బౌద్ధమతం గురించి తెలుసుకోవడానికి మింగో చక్రవర్తి త్సాయ్ ఇన్ నాయకత్వంలో ఒక బృందాన్ని పంపాడు. క్రీ.శ.67లో చైనాకు తిరిగి వచ్చిన త్సాయ్‌ఇన్, తనతో కాశ్యపమాతంగునితో సహా అనేకమంది

భారతీయులను తీసుకువచ్చాడు. డా॥ రాధాకృష్ణన్ పండితుడుకూడా ఈ విషయాన్నే తెలిపాడు.

## చైనాపై యోగశాస్త్ర ప్రభావం – ఆత్మ శాశ్వతత్వం, పునర్జన్మలో చైనీయుల విశ్వాసం :

చైనాపై బౌద్ధమత ప్రభావం ప్రసరించకముందే, చైనీయుల 'తావో ఇజమ్'పై వేదాల ప్రభావం పడివున్నది. తావోయిజమ్‌లో రాజయోగం కుండలినీశక్తి గురించి, చెబుతారు. 'తావో' మార్గం ధ్యానానికి, Comtemplationకు ప్రాధాన్యత ఇస్తుంది. ఈ తావో సూత్రాలకు, ఉపనిషత్తులకూ చాలా దగ్గర పోలికలున్నాయి. చైనీయులు మన యోగసాధనవల్ల చాలా ప్రయోజనంపొందారు. అప్పటి చైనీస్ ప్రముఖుడు 'సూ తుంగ్ పో గొప్పయోగి ! ఆత్మ శాశ్వతము, అమరము అనే సిద్ధాంతాన్ని, పునర్జన్మ సిద్ధాంతాన్ని – ఇవి హిందువుల విశ్వాసాలైనా, చైనీయులు కూడా నమ్మేవారు.

భారతదేశంనుండి అనేక బౌద్ధులు మూడవ శతాబ్దం ఏడవ శతాబ్దం మధ్య కాలంలో చైనాకు వెళ్ళారు. బౌద్ధులు, ముఖ్యంగా నలందా విశ్వవిద్యాలయం నుండి అనేకమంది చైనాకు 14వ శతాబ్దం వరకూ వెళ్తూనే వున్నారు. క్రీ.శ.383లో గౌతమ సంఘదేవుడు తను అనువదించిన గ్రంథాలను తీసుకుని చైనా వెళ్ళాడు. 'కఛా' ప్రాంతానికి చెందిన కుమారజీవుడు క్రీ.శ.385 లో చైనా వెళ్ళాడు. అతడు నాగార్జునుని జీవిత చరిత్రను చైనీస్ భాషలోకి అనువదించాడు. గుప్త వంశీయులలో ఆఖరిచక్రవర్తిగా భావించబడుతున్న విష్ణుగుప్తుడు క్రీ.శ. 546లో చైనా రాజు 'వు' యొక్క విజ్ఞప్తిపై అనేక బౌద్ధ వ్రాతప్రతులతో పరమమూర్తుణ్ణి చైనాకు పంపించాడు. ఇలాగే ఎందరో భారతీయులు తమ విజ్ఞానాన్ని చైనీయులకు అందిస్తూనే వచ్చారు.

జీవగుప్తుడు క్రీ.శ. 559లో చైనా రాజధానికి చేరుకున్నాడు. ఇతడు అశ్వఘోషుని 'బుద్ధ చరిత్ర' అనే గ్రంథాన్ని చైనా భాషలోకి అనువదించాడు. భారతదేశంలో ఈ గ్రంథంలో పోయిన భాగాలు ఇప్పుడు తిరిగి కూర్చాలంటే, ఈ చైనీస్ అనువాదం ద్వారానే సాధ్యమవుతుంది. చైనాను దర్శించిన ఇంకా ఇతర ప్రసిద్ధ మత ప్రచారకులలో ధర్మ గుప్తుడు (160 A.D.), ప్రభాకర మిత్రుడు (633 A.D.), వజ్రబోధి (731 A.D.)), అమోఘ (774 A.D.), మునియన్ (794 A.D.), ధర్మాద్వ (1001 A.D.) మొదలైనవారు ఉన్నారు.

చైనా చక్రవర్తి 'తాంగ్ ' పరిపాలనా కాలంలో రాజప్రాసాదంలోనే వెయ్యిమంది మతబోధకులు, సన్యాసులూ వుండేవారు. క్రీ.శ. ఆరవ శతాబ్దంలో ఒక్క 'లోయాంగ్' ప్రాంతంలోనే 3,000 మంది బౌద్ధసన్యాసులు 10,000 భారతీయ కుటుంబాలూ ఉండేవారు.

ఇలా భారతీయపండితులు, మతాచార్యులు చైనా వెళ్ళడమే కాకుండా ఎందరో చైనీయులు కూడా బుద్ధుని జన్మభూమిని దర్శించాలని తపించేవారు. చైనా పండితులు 'లియాన్-చి-చావో' ఇలా భారతదేశం వెళ్ళిన 108 మంది పేర్లు చైనీస్ ఆధారాలనుండి తెలిపాడు. వీరిలో 14 మంది మాత్రమే తిరిగి వచ్చారని, ఏడుగు భారతదేశంలోనే ఉండిపోగా, మిగిలినవారు మార్గమధ్యంలో ఆగిపోయారని తెలిపారు.

వారిలో ఫాహియాన్, సుంగ్‌యాన్, హ్యుయాన్‌సాంగ్ ఇ-త్సింగ్ మొదలైన వారు తమ యాత్రావివరాలను వ్రాసి, తమ తరువాతి తరాలకు అందించారు. వీరిలో కొందరు బౌద్ధధర్మాన్ని తెలుసుకోవడానికి ఎన్నో ప్రయాసలకోర్చి భారతదేశం చేరుకున్నారు.

## భారతదేశంలో చైనీయుల విద్యార్జన :

కుమారజీవుని శిష్యుడైన ఫాహియాన్ చైనానుండి క్రీ.శ. 399లో బయలుదేరి భారతదేశం వచ్చి పది సంవత్సరాలు ఉన్నాడు. ఇతడు

పాటలీపుత్ర విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా చేరాడు. ఇతడు 'వినయ పీఠిక
అనే బౌద్ధ గ్రంథం కోసం భారతదేశానికి వచ్చినట్లుగా తెలుస్తోంది. ఇతడు
సంస్కృత గ్రంథాలు సేకరిస్తూ, శ్రీలంకలో రెండేళ్ళు గడిపాడు. జావాల
బౌద్ధమతం కంటే ముందుగా వేద ధర్మం ప్రాచుర్యంలో ఉన్నట్లు ఫాహియాన్
తెలిపాడు.

హ్యుయాన్‌సాంగ్ జీవితచరిత్రలోనూ, తన యాత్రా గ్రంథాలలోన
కూడా భారతదేశ పర్యటనను గురించిన అనేక విశేషాలు తెలిపాడు. క్రీ.శ
629లో భారతయాత్ర ప్రారంభించిన ట్సాంగ్ - టర్ఫాన్ కచా తాష్కండ్
సమర్ ఖండ్, ఖోటాన్, యార్కండ్, గాంధార ప్రాంతాల మీదుగా భారతదేశ
చేరాడు. అప్పుడు హర్షవర్ధనుడు మనదేశాన్ని పాలిస్తున్నాడు. ఈ యాత్ర
తర్వాత, ట్సాంగ్ భారతదేశం గురించి తెలుపుతూ, సి–యు–కీ **(Si-yu-ki o
the Record of the Western Kingdom)** అనే చక్కని గ్రంథాన్ని వ్రాశాడు
ట్సాంగ్ తనకు మంత్రి పదవి లభించినా వద్దని, మఠంలో ఉండి తనతో
తెచ్చుకున్న గ్రంథాలు అనువదించడానికే ప్రాధాన్యత నిచ్చాడు. అ
గ్రంథాలు అతనిని అంతగా ఆకర్షించాయి.

హ్యుయాన్ సాంగ్ చైనా చేరేనాటికి, పదేళ్ళ వయస్సు మాత్రమే
వున్న ఇ-త్సింగ్ బౌద్ధసన్యాసిగా జీవించడానికే నిర్ణయించుకున్నాడు. 14
ఏళ్ళ వయస్సులో సన్యాసం స్వీకరించిన ఇత్సింగ్ క్రీ.శ.671లో భారతదేశాని
బయలుదేరి రెండేళ్ళ తర్వాత తామ్రలిప్తి కోటకు చేరుకున్నాడు. అతడు
మార్గమధ్యంలో 'సుమత్రా'లోని 'శ్రీభోగ'లో సంస్కృతం నేర్చుకోవడానికి
అనేక మాసాలున్నాడు. ఇతడు కూడా నలందా విశ్వవిద్యాలయంలో
చాలాకాలం విద్యాభ్యాసం చేశాడు. క్రీ. శ. 695లో చైనా వచ్చిన తరువాత,
అతను తనతో తెచ్చిన 400 గ్రంథాలలో 56 గ్రంథాలు అనువాదం చేశాడు.

ఇ-త్సింగ్ రచించిన "భారతదేశంలోనూ, మలయ్ ఆర్కిపెలాగోలోనూ

బౌద్ధ మత ఆచరణ" అన్న గ్రంథం ఇంగ్లీషులోకి అనువదించబడింది మార్గం ప్రమాదభరితమైనది అయినప్పటికీ, భారతపర్యటన చేయాలని ఉత్సాహపడే యాత్రికుల గురించి ఇ-త్సింగ్ వ్రాశాడు. భారతదేశం వచ్చే ప్రతి యాత్రికుడినీ, శ్రీ విజయలో కొన్ని రోజులుండి సంస్కృతం నేర్చుకోమని సలహా ఇచ్చేవాడు.

## చైనాలో బౌద్ధ ధర్మం :

క్రీ.శ. 317-420 మధ్యకాలంలో (ప్రజ్ఞా-పారమిత), నాగార్జునుడు, అనంగుడు మొదలైనవారి గ్రంథాలు చైనీస్ భాషలోకి అనువదించబడ్డాయి. వాటి వలనచైనా బౌద్ధులలో 3 శాఖ లేర్పడ్డాయి. అవి 'సాన్-లున్-త్సుంగ్, చెన్-షూ లేక సత్యసిద్ధి, 'లూ' లేక వినయాస్కూలు !

**'యోగాచార, సద్ధర్మ-పుండరీక'** అనే హిందూ గ్రంథాల అనువాదాలు, తరువాతికాలంలో టియిన్ టాయ్ హుపాయెన్ అనే శాఖల ఆవిర్భావానికి కారణమయ్యాయి.

చైనాలో దొరికిన ప్రాచీన గ్రంథాలలో క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన సంస్కృత(అముద్రిత) గ్రంథాలున్నాయి. షాలెన్ వంటి చైనీస్ పండితులు సంస్కృత శబ్దాల ఆధారంగా చైనీస్ భాషలో అక్షరాలు రూపొందించడానికి కృషి చేశారు. 16వ శతాబ్దానికి చెందిన 'వ్యూచెన్ యెన్' వ్రాసిన ప్రఖ్యాత చైనీస్ నవల 'మంకీ'ని బుద్ధుడి జన్మభూమికి అంకితమిస్తున్నానని రచయిత వ్రాశాడు. ఈ నవల హ్యుయాన్ సాంగ్ భారతయాత్ర గురించి వ్రాయబడి ఇంగ్లీష్ భాషలోకి అనువదించబడింది. ఆ కాలంలో చైనీయులకు భారతదేశంపై గల గౌరవాభిమానాలను ఈ విధంగా వ్యక్తం చేశారు. చైనీయులు ఇలా నిరంతరంగా కృషి చేస్తూ ఎందరో భారతీయులనుండి ఆధ్యాత్మికజ్ఞాన మకరందాన్ని సేవించి ఆనందం పొందారు. ఈ జ్ఞాన యజ్ఞంలో, భారతీయులు

వారికి యధాశక్తి తోడ్పడ్డారు. ఈ వెయ్యి సంవత్సరాల (క్రీ.శ. 3-14 శతాబ్దాలు) కాలంలోనూ, భారతదేశం చైనాను అనేక విధాల - తత్వశాస్త్రం, కళలు, శాస్త్రాలు, సంస్కృతి మొదలైన రంగాలలో ముఖ్యంగా ఆధ్యాత్మిక రంగంలో ఎంతగానో ప్రభావితంచేసింది. ఇది ఈనాటి భారతీయులు తెలియని నిద్రావస్థలో వుండడం శోచనీయం!



11

# మధ్య ఆసియాలో హిందూ దేవతలు

## గ్రీసులో భాగవత ధర్మం

ప్రపంచవ్యాప్తమైన హిందూమతం ప్రాచీనకాలంనుంచే మధ్య ఆసియాలో వ్యాపించింది. వాయువ్య భారతంలో హిందూ, గ్రీకు రాజుల పరిపాలనా కాలంలోకూడా "భాగవత ధర్మం" (Bhágavatism)నిలచి వుండేదని చరిత్ర తెలుపడమే కాక దానికి ముఖ్య ఆధారం చూపిస్తున్న దేమిటంటే "బేసనగర్"లో "హిలియోడరస్" (Heliodorus) అనే పరమ భాగవత ధర్మావలంభియైన భక్తుడు వాసుదేవుని (Heliodorus Son of Dion) ఆలయంలో భాగంగావుండే గరుడ స్థంభాన్ని నిర్మించాడు.

ఇతను గ్రీకురాజైన అంతియాల్ కి దాస్ (Antialki Das 175-136 B.C) రాయబారిగా భారతీయరాజు 'కాశీపుత్ర బాలభద్రు'ని ఆస్థానానికి వచ్చాడు. ఆకాలంలో కూడా గ్రీకు విదేశీయులు భాగవత ధర్మాన్ని అనుసరించారనడానికి ఇది ప్రబల చారిత్రక తార్కాణం.

రష్యన్ పండితుడు ఎ.ఎన్.బెర్న్‌ష్టామ్ (A.N. Bernshtam) 'తాద్ జికిస్తాన్' క్రీ.పూ. ఒకటి రెండు శతాబ్దాల (2nd and 1st Century B.C.) కి చెందిన 'ఖాష్టిరో' శాసనంలో వున్న ఒక భాగాన్ని కనుగొన్నాడు. 'జె. హార్మెట్టా' (J. Harmetta) దానిలో పదాలను అనువదించగా, "నారాయణా విజయీభవ" అని వ్రాసి వుంది. 'ఖోటానేశా - శాకా' (Khota Nesa-saka) పత్రాలలో కూడా 'నారాయణుని' ప్రస్తావన వుంది[1]. ఒక తున్ హువాంగ్ వర్ణచిత్రంలో వెయ్యిచేతులూవెయ్యి కళ్ళూ గల సహస్ర శీర్షపురుషుడైన 'నారాయణుని' విగ్రహం (దీన్ని ఆవలోకితేశ్వరుడంటూ తప్పుదారి పట్టించాలనే విదేశీ చరిత్రకారుల తాపత్రయం) గరుడారూఢుడైన నారాయణుని ప్రతిమ ఉన్నది[2].

కన్నింగ్‌హమ్ (Cunningham) 'న్యూమిస్మాటిక్ క్రానికల్' 1893 (p.p. 126-127 p.1xfig 2) లోని కోలో ముద్రలో చతుర్భుజుడైన విష్ణుమూర్తి విగ్రహాల ప్రక్కనే ముకుళితహస్తాలతో ఒక భక్తుడు కూడా వున్నాడని వర్ణించాడు. విష్ణుమూర్తి చేతులలో చక్రము, గద మొదలైనవి ఎంతో స్పష్టంగా వున్నాయి. కన్నింగ్ హామ్ ఆ భక్తుడిని కుషాణ రాజు కనిష్కుడని తప్పుగా గుర్తించాడని ఆర్. ఘర్స్మర్ (R. Ghirsman) తెలిపాడు. ఆ ముద్రమీద తోచారియన్[3].లిపిని ఉపయోగించడంవల్ల శివుడు, విష్ణువు, సూర్యులగురించి మధ్య ఆసియాలో క్రీ.శ. 500 దాకా కూడా ప్రజలకు తెలుసునని తెలుస్తోంది.

కొన్ని విదేశీనాణాలపై ముఖ్యంగా 'కుషాణ' చక్రవర్తులు, గొండో ఫేరులు, వీమా (vima) మొదలైనవారు తమ నాణాలపై శివుని బొమ్మ

---

1. B.A. Litvansky. Outline of History of Buddism in Central Asia. (P.8 - International Conference of History, Archeology & Culture of Central Asia in the Kushan period, Dushanbe.
2. Arthur walley, A catalogue of paintings, referred from Tulittuang, P.54, 1931.
3. Cf. Leschionites, Hepthalites, pp. 55-58, Fig. 65, & Pl. 7, 1: Jn. Banerjea. The development of Hindu Iconogrophy p.p. 124-125.

ముద్రించినారు. ఆ తరువాత వచ్చిన రాజులు ముద్రించిన చాలా నాణాలమీద ఒక శివుడే కాకుండా పార్వతి, కుమారస్వామి కూడా దర్శనమిస్తారు.

'వీమా' శైవమతాన్ని తాను అనుసరించడమే కాకుండా శైవ మతవ్యాప్తికి కూడా పాటుపడ్డాడు. గాంధార ప్రాంతంలో చర్సాధా దగ్గర్లోని అఖున్ ధెరిలో క్రీ.శ.3వ శతాబ్దికి చెందిన ఒక త్రిమూర్తి విగ్రహం లభ్యమైంది. దీనిలో శివుడు మధ్యస్థానములో ఉన్నాడు. దీనిని ఇప్పుడు పెషావర్ మ్యూజియంలో భద్రపరిచారు.

ఆంటోనియస్ (క్రీ.శ. 218-222) కాలంలో ఒక భారతీయుడు సిరియాకు వచ్చాడనీ బర్డాసేన్స్‌ను ఉదహరిస్తూ గ్రీకు రచయిత స్ట్రోబేయస్ పేర్కొన్నాడు.

బర్డాసేన్స్ అర్థనారీశ్వరుని గురించి కూడా ప్రస్తావించాడు.[4]

## ఆఫ్ఘనిస్తాన్‌లో శైవమతం :

ప్రాచీన కాలంలో ప్రపంచమంతా వ్యాపించిన హిందూ దేవుడైన శివుని ప్రభావం చివరికి ఇటీవలి మధ్యయుగం ప్రారంభందాకా కూడా, ఆఫ్ఘనిస్తాన్ లోనూ మధ్య ఆసియాలోని ఇతర ప్రాంతాలలోనూ వ్యాపించింది. ఈశైవమత ప్రభావము ఇస్లాం, క్రిస్టియానిటి వచ్చాకకూడా కొనసాగింది. ఆఫ్ఘనిస్తాన్ లో ఈనాటికీ ఇంకా శైవులకు చెందిన ఎన్నో వస్తువులు, పురాతన త్రవ్వకాలలో బయట పడుతున్నాయి. టగాల్, గార్డెజ్ ప్రాంతాలలో గత 30 ఏళ్ళలో ఇలాంటివి ఎన్నో లభించాయి. వీటిలో శివుని శిరస్సు, మహిషాసురుని మర్దిస్తున్న దుర్గకూడా వున్నారు. పులి చర్మాన్ని ధరించిన 'మహా వినాయకుడు' లేదా శక్తి గణేశుని ప్రతిమ కాబూల్‌కు 10 మైళ్ళ దూరంలోని కోతాల్-ఇ-ఖైర్‌ఖానే (Kotal I, Khair Khaneh) లో దొరకడమే

---

4. Ferguson, History of Indian and Estern Architecture p-54; OND: Banerjea. The development of Hindu Iconography p.89.

దీనికి ప్రబల సాక్ష్యం[5]. దీనిని కాబూల్ మ్యూజియంలో భద్రపరిచారు. ఈ ప్రతిమకూడా మహమ్మదు ప్రవక్తకు ముందుకాలమైన క్రీ.శ. 7వ శతాబ్దికి చెందినదేనని చరిత్రకారులు అంటున్నారు.

అప్పటి సాహిత్యంలోకూడా గాంధార ప్రాంతంలో శైవమతం ప్రాచుర్యంలో ఉండేదనటానికి కొల్లలుగా సాక్ష్యాధారాలు లభిస్తున్నాయి. ప్రఖ్యాత చైనీస్ యాత్రీకుడు, చరిత్రకారుడయిన హ్యాయన్ త్సాంగ్ (Hien - Tsang) అక్కడ శివుని సతియైన భీమాదేవి ఆలయం ఉందనిస్పష్టంగా తెలిపాడు.

## రష్యన్‌ల పరిశోధన :

శైవమతం ఇక్కడే కాకండా, ఇదే సమయంలో (7,8 శతాబ్దాలలో) 'సోగియానా' తూర్పు టర్కిస్థాన్ ప్రాంతాలలోకూడా నిలిచి యున్నట్లు తెలుస్తోంది.

రష్యాలో 'జెర్వాషాన్' (Zervashan) నదివద్ద ఉన్న పియాండ్జికెంత్ (Piandjikent)లో ప్రొఫెసర్. ఏ.ఎమ్. బెలెనిత్స్కి (A.M. Belenitsky) జరిపిన త్రవ్వకాలలో శివుని రూపంతో ఒక్క కుడ్యచిత్రం బయల్పడింది. ఈ చిత్రంలో శివుడు యజ్ఞోపవీత ధారియై తీవ్ర ధృక్కులతో, మెడలోను, చేతులకూ,పాదాలకూ ఆభరణాలు పులిచర్మం ధరించి, ఎడమవైపు త్రిశూలంతోనూ, శిరస్సు వెనక తేజోచక్రంతోనూ దర్శనమిస్తాడు.

శివునికి రెండువైపులా ఇరువురు వ్యక్తులుంటారు. శివుణ్ణి భారతీయ సాంప్రదాయంలో చిత్రించినా ఈ ఇరువురు వ్యక్తులు సోగ్డియెన్ లక్షణాలు కలిగి ఉన్నారు[6].

---

5. T.N. Ramachandran and Y.D. Sharma, Archaelogical Re conna.since in Afghanistan a preliminary report : (cyoclostyled)

## టర్కిస్తాన్‌లో శైవం :

తూర్పు టర్కిస్థాన్‌లో శైవమతం వ్యాప్తిలో ఉండేదని స్పష్టమైన ఆధారాలతో నిరూపించవచ్చు. దన్‌దాన్-ఉలిక్ (Dandan - Uliq) నెం.డి. VII. 6లో శివుడి వర్ణచిత్రాన్ని చెక్కపై చిత్రించినట్లుగా సర్ ఆరెల్ స్టెయిన్ (Sir Aurel Stein) దాన్నిలా వర్ణించాడు.

'మూడు ముఖాలు, నాలుగు చేతులూ కలిగి వృషభ వాహనంపై పద్మాసనంలో శ్యామవర్ణ శరీరుడైన ఈ దేవత కూర్చున్నాడనీ, ఈ దేవత ప్రక్కముఖాలలో ఒకటి తెల్లగా, స్త్రీమూర్తిని పోలి ఉందనీ, మరో ముఖం ముదురునీలివర్ణంతో భీతావహంగా ఉందనీ వర్ణించబడింది. పులిచర్మమే వస్త్రంగా ధరించిన ఈ దేవతామూర్తి కిరీటంలో చంద్రవంక ఫాలభాగములో మూడవ నేత్రం - వీటితో మన శివుణ్ణి స్ఫురణకు తెస్తాడు[7].

దన్‌దాన్-ఉలిక్ (Dandan- Uliq)చిత్రం (పానెల్ నెం. డి.X 8) శివశక్త్యారాధన జరుగుతుండడాన్ని సూచిస్తుంది. దీనిలో శివుడు చతుర్భుజుడై స్పష్టంగా త్రిమూర్తి రూపంలో శక్తితో కూడి త్రినేత్రుడై వున్నాడు. ఒక ఎడమ చేతికి కంకణం ధరించి రెండవ చేతిని తొడపై పెట్టుకుని వజ్రాన్ని ధరించి కుడి చేతిని శక్తి మెడపై వేసి వున్నాడు. మిగతా నాల్గవ చేతిలో ఏమున్నదీ స్పష్టంగా తెలియటంలేదు.

ఆయన జుట్టు పొడవుగా, వుంగరాలుతేలి, అలలవలే ఉన్నది. కిరీటం 'ఇరానియన్' పద్ధతిలో మలచి వున్నది. ముఖం మీది మూడవ నేత్రం భయంకరమైన ఉగ్రత కల్గించేదిగా ఉంది. విల్లువంటి అందమైన కనుబొమ్మలతో పొడవైన విశాల నేత్రాలతో తెల్లని రూపంతో ఉన్న శక్తి[8] కుడిచేతితో శివునికొకపాత్రను అందిస్తూ ఉంది.

---

6. Siva Icon from Piandjikent by the Author Artibus, Asiae. Vo. XXXI 1969.
7. Sri Aurel Stein, Ancient Kotan Vol. 1, P. 279.

తూర్పు 'టర్కిస్థాన్'లో ఇటీవల క్రీ.శ. 8వ శతాబ్దం వరకూ కూడా శాక్తేయులైన శక్తి ఆరాధకులు (Sakta-Cult) ఉండేవారని ఢిల్లీలోని 'నేషనల్ మ్యూజియం'లో ఉన్న త్రిమూర్తి విగ్రహంవల్ల కూడా తెలుస్తోంది. మధ్యనున్న ముఖంలో నుదుటిపై మూడవనేత్రం స్పష్టంగా కనిపిస్తూ వుంది. శివుని కళ్ళు ధ్యానముద్రలో ఉన్నట్లుగా అర్ధనిమీలితంగా ఉన్నాయి. తలపైన ఒక కపాలమకుటం ఉంది. ఈ విగ్రహానికి నాల్గు చేతులుండి-ఒక చేతిలో సూర్యుడు, మరొక చేతిలో చంద్రుడూ పట్టుకున్నట్టు ఉన్నది. మూడు ముఖాలు, త్రినేత్రాలు, చేతి ముద్రలూబట్టి చూస్తే ఈ దేవతా మూర్తి, శివునిదని నిస్సందేహంగా అర్ధమవుతోంది[9].

## మధ్య ఆసియాలో ఇంద్రుడు – బ్రహ్మ :

మధ్య ఆసియాలో కనిపించే ఇతర హిందూ దేవతలలో బ్రహ్మ, ఇంధ్రుడు, గణేశుడు, కార్తికేయుడు (కుమారస్వామి), సూర్యచంద్రులు, లోకపాలకులూ ఉన్నారు.

'కడ' ప్రాంతంలోని గుహలలో బ్రహ్మ రూపాన్ని గుర్తించారు[10]. బలావస్తే (Balawaste) లోని ఇంద్రుని రూపంగల ఒక కుడ్యచిత్రాన్ని 'న్యూఢిల్లీ నేషనల్ మ్యూజియంలో' భద్రపరిచారు[11]. ఈ ఇంద్రమూర్తి అర్ధనిమీలిత నేత్రాలతో ముకుళిత హస్తద్వయంతో బొటనవ్రేలు నిలువుగాను, మిగిలిన వ్రేల్ళు భూమికి సమాంతరంగా ఉన్న ముద్రతో పద్మాసనంలో ఉన్నాడు. తలపై తెల్లటి ముత్యాలు పొదిగిన ముదురు గులాబిరంగు తలపాగా ధరించాడు. ముఖం కొన్ని అజంతా చిత్రాలలోని బుద్ధుని జాతక చిత్రాలను పోలి ఉంది.

ఈ మూర్తి అనేక ఆభరణాలను, ముక్తయజ్ఞోపవీతాన్నీ ధరించి ఉంది. కుడిచేతి వెనుక ఒక కన్ను ఉండడంవల్ల అది ఖచ్చితంగా ఇంద్రునిమూర్తియే

---

8. Stein, Ancientkhoran, Vol I P. 261 Pl. LXII.

9. Andrews: Catelogue of wall Paintings from Ancient Shrines in Central Asia and Sistan, P. 13.

అని తెలుస్తుంది. మధ్య ఆసియాలో మరికొన్ని వర్ణచిత్రాల్లో కూడా ఇంద్రుని మూర్తి కనిపిస్తుంది.

'తన్ హువాంగ్' (Tun - Huang) లోనూ మధ్య ఆసియాలోనూ కొన్ని వర్ణచిత్రాలలో గణేశుడు, కుమారస్వామి, సూర్యచంద్రులు కన్పిస్తారు. 'ఎన్‌దేరే' (Endere)లో దొరికిన ఒక చెక్క పలకపై చతుర్భుజుడై ఏనుగుతలతో కిరీటము, ఆభరణాలు, పులిచర్మం ధరించి గొడ్డలి (ఈటె) వంటి ఆయుధాలు చేతబూనివున్న దేవతా మూర్తి చిత్రం ఉంది. ఈ మూర్తి ముమ్మూర్తులా గణేశునిదని తెలుస్తూనే వుంది[12]. దన్‌దన్ లో దొరికిన చిత్రాలలో గణేశుడు కిరీటధారియై ఎడమ వైపుకు తిరిగిఉన్న తొండంతో (వామహస్త గణపతి) ఉన్నాడు[13]. ఖడాలిక్ (Khadalik)లో దొరికిన చిత్రంలో వికసితపద్మంపై ఆసీనుడైన గణపతి (లక్ష్మీగణపతి?) కనిపిస్తాడు.

కుడిచేతిలో అంకుశం ఎడమ చేతిలో ఒక గుండ్రటి వస్తువు (మోదకము = కుడుము) ఉన్నాయి. చెవులు చాలా పెద్దగా వున్నాయి. ఖోటాన్ (Khotan) ప్రాంతంలోని గణేశుడి ప్రాముఖ్యాన్ని ఈ చిత్రాలే తెలుపుతాయి.

తున్-హు-వాంగ్ లోని 265వ గుహలో చక్కని గణేశ చిత్రంవుంది[14]. కార్తికేయుడు మహాకాలుడు, గరుడుడు అమృతం తీసుకువెడుతున్నట్లుగా ఉన్న ఒక బెజిక్లిక్ (Bezeklik) కుడ్య చిత్రాన్ని "ఆండ్రూ" (Andrews) కనుగొన్నాడు. దానిలో కార్తికయుడు నెమలి (పక్షి)పై కూర్చుని వున్నాడు. తలపై పిలకలు (శిఖలు) జ్వాలల్లాగా ఉన్నాయి. ఆరు చేతులలో ఆరు వస్తువులున్నాయి. కుడిచేతిలో సూర్యుడు, ఎడమ చేతిలో చంద్రుడు, మరొక ద్వయంలో కుడిచేతిలో బాణాలు ఎడమచేత పర్షియన్ రకం విల్లు మూడవ జతలో కుడిచేయి ఛాతీవద్ద ఎడమచేతిలోపొడవైన కల్లు (వేలాయుధం) ధరించివున్నాడు.

---

10. History of Indian and Indonasian Art, London, 1927, p.150 Notes.

11. Catalogue of wall Paintings from Acnient Shrines in Central Asia and Sistara, page13.

## మహాకాలుడు :

నందిపై కూర్చున్న మహాకాలుడి చిత్రంలో ముఖం భయం
కొలిపేటట్లుంది.

భయంకరంగా నోరు తెరుచుకుని, ఎఱ్ఱటిజుట్టుతో త్రిశూలం, ఖడ్గం,
వజ్రం వంటి ఆయుధాలు ధరించి వుంది. ఈ మహాకాలునివి (ఆరు)
చేతులలో మూడు చేతులు లేవు[15].

ఈ చిత్రం క్రిందిభాగంలో కార్తికేయుడి చిత్రం, గరుడుడు అమృతం
తీసుకువెడుతున్న దృశ్యమూ ఉన్నాయి.

## జపాన్‌లో ఇతర హిందూ దేవతలు :

అవిగాక ఇంకా ఈ గ్రంథంలో విడిగా జపాన్‌లోని దేవతల గురించి
తెలిసిన విషయాలు తెలుసుకుందాం.

జపాన్‌లో షింగాన్ దేవతాగణంలో చాలామంది హిందూ దేవతలు
ఉన్నారు. వారి పేర్లు జపానీభాషలో 'షోటెన్ సోమా' (గణేశుడు) 'తై షాకు
(ఇంద్రుడు), కాతేన్ (అగ్ని), యమ్మా-ఒ (యముడు), బేన్ తేన్ (సరస్వతి)
స్యూతేన్ (వరుణుడు), ఫ్యూతేన్ (వాయువు), ఈశాన, బొంటెన్ (బ్రహ్మ)
జితేన్ (పృథ్వి), నితేన్, గతేన్ (సూర్య చంద్రులు); వారేగాక ఇంకా
లెక్కలేనన్ని హిందూ దేవతలున్నారు.

---

12. Stein, Ancient Khoton, Vol. I. pp. 431-442
13. I bid, p. 292 ff
14. Basil Gray, Buddhist, Cave Paintings at Tun Huang. p. 120
15. Andrews, Catalogue of wall paintings from buddhist Shrines in Central Asia and Sistau, p. 36-37
16. Sir Charels Eliot, Japanese Buddhism p.355 London 1935

షోటేన్ సోమా, ఎమ్మా-ఒ, స్యూతెన్, బెన్‌తెన్ చాలా ప్రాముఖ్యం కలిగిన జపనీస్ హిందూ దేవతలు. వీరికి ప్రత్యేకంగా ఆలయాలుఉన్నాయి[16]

బౌద్ధమతంలో కాలగమనంలో ముఖ్యంగా మహాయానం శైవవైష్ణవ మతాలకు దగ్గరగా వచ్చింది.

ఇవన్నీ అంతర్భాగాలైన సనాతన హిందూధర్మము, ఈనాటికీ మధ్య ఆసియాలో ఇంకా ప్రాచీన కళారూపాలలో మనకి స్పష్టంగా కనబడుతుంది.



12

# ఇస్లామిక్ సంస్కృతిపై హిందూ, బౌద్ధ మతాల ప్రభావం

## అరేబియా వేద సంస్కృతి

ప్రాచీన కాలంలో అరేబియన్, మధ్యధరా సముద్రమార్గాలో నివసించే ప్రజలపై భారతీయసంస్కృతి ప్రభావం ఎక్కువగా ఉండేది. ఈ ప్రాంతమే తరువాతి కాలంలో ఇస్లాం మతానికి కేంద్రమైంది.

ఋగ్వేద కాలంలో ఆఫ్ఘనిస్తాన్, దాని పరిసర ప్రాంతాలు సాంస్కృతికంగా భారతదేశానికి చెందినవే. ఆ కాలంలో ఇరాన్ సంస్కృతికి భారతీయ సంస్కృతికీ భేదమే లేదని చెప్పవచ్చు.[1] క్రి.పూ. 14 శతాబ్దానికి చెందిన బోఘాజ్‌కోయ్ శాసనాన్ని బట్టి, భారతదేశానికి పశ్చిమాసియాకు సాంస్కృతికంగా చాలా సన్నిహిత సంబంధాలుండేవని ఋజువైంది.

సిరియన్ రచయిత జీనోబ్ క్రీ. పూ. రెండవ శతాబ్దంలో టారన్ భూభాగంలోని 'యూఫ్రైటిస్‌లో వాన్' సరస్సుకు పశ్చిమంగా ఒక భారతీయ కాలనీ ఉండేదని వ్రాశాడు[2] భారతీయులు ఇచటనే18.22 అడుగుల ఎత్తు ఉన్న దేవతాప్రతిమలతో వున్న రెండు ఆలయాలను నిర్మించారు.

## ఈజిప్టులో – బ్రాహ్మీశాసనం :

పశ్చిమాసియా, ఆఫ్రికా, యూరప్‌లలో క్రీ.పూ. 272-232లో అశోకుడు సిరియా, ఈజిప్టు, సైరాన్, మాసిడోనియా, ఎపిరస్‌లకు పంపిన రాయబారులవల్ల బౌద్ధ మతం వ్యాప్తి చెందింది. అలెగ్జాండ్రియా లో కుషాణుల కాలంలో బ్రహ్మజ్ఞాన స్థాపితులు ఉండేవారనడానికి కొన్ని ఆధారాలు ఉన్నాయి.[4] V.S. వాకంకర్ ఈజిప్టులో దొరికిన మూడవ శతాబ్దానికి చెందిన బ్రాహ్మీ అనే శాసనం నకలును ప్రచురించాడు.[5]

## స్పెయిన్‌లో – బౌద్ధమతం :

సెయిస్తాన్ లో హెల్మండ్ వద్ద బయల్పడిన బౌద్ధమతం శిధిలాల వల్ల పర్షియన్ సరిహద్దు ప్రాంతాలలో భౌద్ధమతం వ్యాప్తిలో వుండేదని తెలుస్తోంది. పార్థియాలో బౌద్ధమతానికి గట్టి పట్టు వుండేదని చైనీయుల సాంవత్సరిక నివేదికల్లో చాలాచోట్ల వ్రాసి వుంది. ప్రాచీన కాలంలో ఖోరాస్తాన్, పర్షియా, ఇరాక్, మోసుల్, సిరియా సరిహద్దు గల ప్రాంతంలోని ప్రజలు బౌద్ధ మతాన్ని అనుసరిస్తూ వుండేవారని 'ఆల్-బిరూని' నీ ఖండితంగా చెప్పాడు.[6]

---

1. B.K. Ghosh "In The Vedic Age (PP 218-224)
2. JRAS, 1904, 309
3. Majumdar "In The Age of Imperial Unity", (P.633)
4. IHO, Vol. XII, (124 pp.)
5. Bharatiya Kala Bhavan Patrika, No.7

## అరబ్ యూదు సమాజంలో భారతీయత గాథలు

ప్రాచీన గాథలు, పురాణాలు మతాచారాల్లో భారతీయులకు, అరబ్ లకు యూదులకు చాలా పోలికలు కనిపిస్తాయి. వారికున్న వాణిజ్య సంబంధాల దీనికి కారణం. విశ్వం, భూమి ఆవిర్భావానికి, జనన మరణాలు వీటన్నిటికి సంబంధించిన గాథలు భారతదేశంతో సహా అనేక దేశాలనుండి స్వీకరింపబడి పశ్చిమాసియాలో ఇస్లామిక్ సంస్కృతికి తగినట్లుగా మార్పుచెంది, దానిలో భాగమయ్యాయి! యూదుల ప్రాచీనగాథలు కూడా ఇస్లాం సాహిత్యంలోకి ప్రవేశించాయి, తాల్ముద్, మిద్రాష్‌లకు సంబంధించిన అనేక ప్రాచీనగాథలు భారతీయుల నుండి ఇస్లాంలోకి పవేశించినవే. ఉదాహరణకు మన పురాణాల్లో ఈవిశ్వంలో ఏడు ఊర్ధ్వలోకాలు ఏడు అధోలోకాలు వున్నాయని వర్ణించబడింది[7]. హిబ్రూలో కూడా ఏడు స్వర్గాలు విల్లాన్, రాకియా షెఖాకియ్, సైబుల్, మావున్, మఖాన్, అరాబోత్ మొదలైన ఏడు స్వర్గాలు ఎరిట్జ్ హటాశోంక్, ఆదామా, జినేషియా, జీజా, తెబెల్ మొదలైన ఏడు అధోలోకాలు వున్నాయని తెలిపాడు.

యూదుల ప్రాచీన గాథల్లో షేంహజాయ్, ఆజాయెల్ ల కథ, మహమ్మదీయ సాహిత్యంలో హరూత్, మారూత్ ల గాథ, మహాభారతం లోని సుందోపసుందుల కథను పోలివుంటుంది.

## అరబ్బులూ – ఆయుర్వేదం :

హిందూసాహిత్యం ముందుగా పర్షియన్ భాషలోకి అనువదించ బడి తర్వాత దానినుండి అరబిక్ భాషలోకి అనువదించబడింది. దీనికి ఇబున్-ఇ-మాకుఫా (Ibn-i-Maquffa)చే అరబిక్ లోకి అనువదింప బడిన 'పంచతంత్రం' చక్కటి ఉదాహరణ. అబాసీద్ ఖలీఫాల ఆజ్ఞానుసారం వైద్య, ఖగోళ, గణిత

6. Majumdar, (op.cit.) P.632
7. Quran, XLI, 8 pp

శాస్త్రాలపై హిందూ గ్రంధాలు అనేకం అరబిక్ బాషలోకి అనువదించబడ్డాయి
నీటిలో 'చరక' 'శుశ్రుత', "నిదాన" వాగ్బటుని 'అష్టాంగం' మొదలైనవెన
వున్నాయి. చరకంను అబ్దుల్లా అనువదించాడు. వ్యాధిగ్రస్తుడైన హరున్
అల్-రషిద్‌ను ఆరోగ్యవంతుణ్ణిగా చేసి, కృతజ్ఞుడైన ఖలీఫాచే రా
వైద్యాలయంలో ప్రధానవైద్యునిగా నియమింపబడిన మాంఖ్ మాణిక
(Mankh,) 'శుశ్రుతసంహితను అరబిక్ భాషలోకి అనువదించాడు ఇం
బాగ్దాద్‌ను దర్శించిన భారతీయులలో ఖగోళ, జ్యోతిష శాస్త్రాలు, నీతిశాస్త్ర
జంతువైద్యం అనేవాటిపై అనేక గ్రంధాలు రచించిన ధన్, షాణుక్, కం
మొదలైనవారు, సాబే వంటి వైద్యులు కూడా వున్నారు.

'సిద్ధాంతం' (అరబిక్‌లో సింద్-హింద్) అనే భారతీయ గ్రంధాని
ఖలీఫా ఆల్-మసూద్ ఆదేశం ప్రకారం మొహమ్మద్ ఇబున్- ఇబ్రహిం అల్-
ఫజారి (Md. Ibn-Ibrahin A1-fazari)అరబిక్ భాషలోకి అనువదించి ఇస్లాంల
మొట్టమొదటి ఖగోళశాస్త్రజ్ఞుడు అయ్యాడు[8]. ఈ విషయాన్ని ఆల్ బెరూని
తెలిపాడు[9]. క్రీ.శ. 778 లో ఒక ప్రముఖ భారతీయ శాస్త్రజ్ఞుని నాయకత్వంతో
ఒక బృందం బాగ్దాద్ వచ్చినప్పుడు నక్షత్రాల గురించి విజ్ఞానాన్ని యాకుబ్
ఇబున్ తారిక్ (Yakub Ibun Tarik) కు తెలిపినట్లుగాకూడా అల్‌బిరూని
వ్రాశాడు[10]. ఈ హిందూపండితులు తమతో బ్రహ్మగుప్తుని 'బ్రహ్మస్ఫుట
సిద్దాంతం', 'ఖాండఖాద్యక' వంటి గణితశాస్త్ర గ్రంధాలను తీసుకు రావడంవల్ల
అరబ్‌లకు ఖగోళ శాస్త్రంతో పరిచయం ఏర్పడింది.

ఆల్ - ఖ్వారిజ్మీ (All Khawarizmi) తను వ్రాసిన ఖగోళ శాస్త్ర
గ్రంధాలను ఆల్‌ఫజారీ అనువదించిన భారతీయ శాస్త్ర గ్రంధాలపై ఆధారపడి
వ్రాశాడు. అక్షరాలకు బదులు అంకెలు, సున్నాను ఉపయోగించడం గురించి
మొదటిసారి తెలిసినవాడు ఆల్ - ఫజారీ. ఈ సంఖ్యలు హిందూదేశం నుండి
రావడం వల్ల వాటిని హిందీ అన్నాడు, ఆల్-ఫజారీ హిందూ గణితశాస్త్ర

---

8. Hitti, History of the Arabs, (p.307)
9. sachau, Alberauni's India (11.5)
10. Ibid, 1167

(D Numero Indico) పేర లాటిన్ భాషలోకి

పద్ధతులపై వ్రాసిన గ్రంథం (D Numero Indico) పేర లాటిన్ భాషలోకి అనువదించబడింది. అరేబియన్ గ్రంథం నశించగా ఈ లాటిన్ అనువాదమే నేడు కనబడుతుంది[11].

## మహమ్మద్‌కు ముందు - బ్రాహ్మణాలయాలు

ఇస్లాం మతం ఆవిర్భవించకముందే పశ్చిమాసియాలో భారతీయ ప్రభావం ఉండేది. పశ్చిమాసియాలో బ్రాహ్మణమత ఆలయాలు (Brahmanical Temples) ఉండేవని, బౌద్ధమతం వ్యాప్తిలో ఉండేదన్న విషయం పైన పేర్కొనబడింది. మహమ్మద్ ప్రవక్త మరణం తరువాత ఖురాన్‌ను వివరించడంలో భేదాభిప్రాయాలు వచ్చాయి. ము-తా జిల్లా (Mu-Ta-Zila) స్కూలు ఖురాన్ సూత్రాలను హేతుబద్ధం చేయాలని ప్రయత్నించింది. వారిలో ముఖ్యుడు వాసిల్ ఇబున్ - ఆతా (Wasil-Ibn-Ata) ఇతడు బౌద్ధమత సూత్రాలతో బాగా పరిచయంవున్నవాడు. ఈ ము-తా- జిల్లా ఉద్యమాన్ని బలపరచిన ఆబాసిడ్ ఖలీఫాలు పతనమయ్యాక, ఈ ఉద్యమం కూడా క్షీణించినా ఇస్లాంలో మూడు ముఖ్యమైన పనులకు ఇది దోహదం చేసింది. అవి (1) మతాకల్లామిన్‌లు - వీరు మత గ్రంథాలు చెప్పిన దంతా హేతుబద్ధం చేయాలనేవారు (2) ఫలాసిఫాలు లేక హుకుమాలు (Phalasifas or Hukumas)- గ్రీకులచే ప్రభావితులైన వారు (3) సూఫీలు-మార్మికతను (Tasabbuf) విశ్వసించేవారు, ధ్యానం ప్రార్థనలలో నమ్మకమున్నవారు.

## వేదాంతానికి, 'సూఫీ' మతానికి పోలికలు

సూఫీ మతం అనేది ఎనిమిదవ శతాబ్దం రెండవ భాగంలో ప్రారంభమయింది. అంతకు ముందు జహ్‌హాద్, సాస్, కాస్, శాఖ్ కౌన్, నాస్మాక్ వంటి (Ascetics sects) తసాబుఫ్‌ను అనుసరించేది. భారతీయులు

11. Hitti, op, cit, pp. 573-74

అనుసరించే సన్యాసం నుండి సూఫీమతం ఆవిర్భవించిందని అంటారు. ఈ ప్రభావం మొదట జుహాద్ లేక ప్రోటో సూఫిజమ్‌లో కన్పిస్తుంది[12]. అబాసిద్ ఖలీఫాల కాలంలోనే ముస్లింలు భారత సన్యాసులంటే ఆసక్తి కనబరచేవారు. ఆల్ జహీజ్ వర్ణించిన జిందిక్ సన్యాసులు (Monks), భారతీయ సాధువులైనా కావాలి లేదా బౌద్ధ సన్యాసులు, వారిని అనుకరించే వారైనా కావాలి.

## జీవాత్మ-పరమాత్మ:

అన్నింటిలోనూ పరమాత్మ (The Supreme Being) వ్యాపించి వుందని (హమా ఓ సాత్) జీవాత్మ (Individual Soul) కు, విశ్వాత్మ (Universal Soul) కు భేదం అవినాభావసంభందం వుందని నమ్మే సూఫీ మతంలోని ఐజాదీయశాఖ శంకరాచార్యుల వేదాంతవివరణను పోలివుందని, ప్రపంచంలో అన్నీ పరమాత్మ నుండే వచ్చాయనే (హమా ఓసో సాత్) మహుదావా సిద్ధాంతము రామానుజుల విశిష్టాద్వైత వాదానికి దగ్గరగా వుంటుంది. టైటస్ చెప్పినట్లుగా, ఇవి-మతం వ్యక్తీకరణా ఆచారాలూ వేదాలనుండి, బౌద్ధమతం నుండి వచ్చినట్లుగా కనిపిస్తుంది[14]. అబాసిద్ కాలంలో అల్ - మన్సూర్, హారూన్ అల్ - రషీద్‌ల పరిపాలనా కాలంలో బౌద్ధగ్రంథాలు అరబిక్ భాషలోకి అనువదించబడ్డాయి[15]. అబాసిద్ ఖలీఫాల కాలంలో ఎక్కువ అధికారం కలిగిన బర్మాకియా మంత్రులు భారతీయ పండితులు బాగ్దాద్‌కు వచ్చేలా ప్రేరేపించి, వారిని అనువాదకులుగా నియమించేవారు. బల్ఖ్‌లో నౌ బిహార్ (నవ-విహార) లో ప్రధాన బౌద్ధమతాచార్యుడు ఈ బర్మాకియా కుటుంబస్థాపకుడు. వారు ఇస్లాంలోకి మారినా, వారి పాతసంస్కృతులంటే వారికి అభిమానం ఎక్కువ.

---

12. Titus, Indian's Islam, (p.149)

భారతదేశంనుంచి ఎన్నో విషయాలు నేర్చుకోవడానికి అరబ్‌స్తాన్
సిద్ధంగా వున్నందువల్ల భారతదేశం ఇస్లాంమతం మీద చాలా ప్రభావాన్ని
చూపించగలిగింది.

తరువాత, తొమ్మిదవ శతాబ్దంలో అబాసిద్ రాజ్యం పతనమవడం వల్ల,
భారతదేశం, బాగ్దాద్‌లమధ్య 'సంబంధాలు తెగిపోయాయి, ఈరాజ్యం
పతనమయ్యాక, ఇస్లాం నాయకత్వం టర్కుల (Turk) చేతుల్లోకి వెళ్ళలేక
వెళ్ళడంవల్ల, ఇస్లాం సంస్కృతి, విద్య (Learning) నలుదిక్కుల చెదిరిపోయింది.
భారతీయ సంస్కృతి అంటే అరబ్‌లుచూపించిన ఆదరణ టర్కులు
చూపించకపోవడంవల్ల వారి కాలంలో భాలతీయ సంస్కృతి ఆ ప్రాంతంలో,
అంతగా ప్రభావం చూపించలేదు.

---

14. Hitti, (op. cit. p. 435
15. (op. cit.) p. 149
16. Dr. Boer-History of the philosophy of Islam (p.9)



**13**

# హిందూ దేవాలయంనుంచి ఏర్పడ్డ చర్చి

జోన్ పెరీరా అనే క్రైస్తవ పండితుడు తాను వ్రాసిన ఒక పరిశోధనా వ్యాసంలో, ఈనాడు క్రిష్టియన్ మతస్థులు ప్రార్థనలు జరిపే చర్చ్ యొక్క నిర్మాణం, దాని కొలతలు హిందూ దేవాలయం నుండి తీసుకొనబడి కొద్దిపాటి మార్పులతో చర్చ్‌గా ఎలా మలచబడిందో సవివరంగా చిత్రాలతోసహా నిరూపిస్తూ అనేక సాక్ష్యాధారాలను ప్రచురించాడు. దాన్ని ఋజువుచేసే ఆయన చిత్రాలు ఈ అధ్యాయంలో చూడవచ్చు.

## బౌద్ధ 'చైత్యం' – నుంచి 'బాసిలికా' : (BASILICA)

సామాన్యంగా హిందూ దేవాలయంలో ఒక 'గర్భగృహం' దానికి ముందు 'ముఖమండపం' తరువాత 'మహామండపం' లేక 'చతుష్కి' వుంటాయి. రోమన్ 'భాసిలికా' ప్రాచీనచర్చ్‌లకు, బౌద్ధ చైత్యాలకూ చాలా దగ్గరి పోలికలు వుంటాయి. మొదటిలో బౌద్ధ చైత్యాల నిర్మాణాన్ని అనుసరించి ఇండియన్ చర్చిల నిర్మాణం చేశారు. తరువాతకాలంలో ఇండియన్ చర్చ్‌లు

క్రమంగా హిందూదేవాలయాలవలే రూపు దిద్దుకోసాగాయి! పోర్చుగీసువారు భారతదేశానికి వచ్చినప్పుడు, ఇక్కడి అద్భుతమైన ఆలయాలను చూసి ఆశ్చర్యపోయారు.

కేరళలోని చర్చ్‌లు హిందూదేవాలయాలవలే ఉన్నాయని వారు గమనించారు. హిందూదేవాలయాలలాగే వాటిలోకూడా 'ఆలయ మంటపం' కంటే గోపురభాగం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. మరీ పోలిక ఏమిటంటే 'గర్భాలయం' చిన్నదిగా వుండి, 'ముఖమండపం' చాలా విశాలంగా వుంటుంది. గోపురం విషయంలో తర్వాత కొన్ని మార్పులు వచ్చి, ఆలయనమూనా మాత్రం మారలేదు. హిందూ దేవాలయాల్లో గర్భగుడిలో వెలుతురు తక్కువ ఉండేలా నిర్మిస్తారు. చర్చిలలో మతగ్రంథాలు చదువుకోడానికి వీలుగా ఎక్కువకాంతి వచ్చేలా ఏర్పాటు చేసుకున్నారు.

## దేవాలయం అంతరాళంనుంచి - "బరోక్" చర్చి:

'బరోక్' వాస్తులో నిర్మించిన చర్చి లోపలిభాగం, హాలు ఏర్పాటు హిందూ దేవాలయాల మాదిరిగానే చేయబడిందని జోస్ పెరీరా తన పరిశోధనా వ్యాసంలో నిరూపించాడు. యూరప్‌లోని పడువాలో (Padua) కట్టబడిన స్క్రోవెగ్ని చర్చి (Scrovegni Church at Padua, 1303) స్పెయిన్‌లోని జెరోనా కేథడ్రల్ (Gerona Cathedral, 1417) ఫ్లోరెన్స్‌లోని పజ్జి (Pazzi Chapel at Florence, 1429) మొదలైనవి దానికి నిదర్శనాలు. దీనివల్ల హిందూ సంసకంర్కృతి విదేశాలలో ప్రాకడమేగాక, క్రైస్తవచర్చిల వాస్తును కూడా ప్రభావితం చేసిందని ఋజువైంది.

## గోవాలోని గుడి వాస్తుతో చర్చి:

అలానే పోర్చుగీసు దేశస్థులుకూడా వారి దేశాల్లోని చర్చిల నిర్మాణంలో గోవాలోనూ ఇతరచోట్లలోని హిందూదేవాలయాల నమూనాను పట్టుకుపోయి తాము కట్టిన చర్చ్‌లను అదే విధంగా నిర్మించారు. దీనితో హిందూ దేవాలయాల ప్రభావం యూరప్, అమెరికా, ఆసియాలోని చర్చిలపై కూడా పడింది, ఈ ప్రభావం 17వ శతాబ్దంలో ఇటలీకి కూడా వ్యాపించింది.

కాంపిటెల్లీలోని శాంటా మేరియా చర్చి (Santa Maria in Campitelli 1663) వెనిస్‌లోని స్కాల్ఫరాటోస్ సిమియోన్ డిగ్విడా (Scalffarott's SS. Simeone e Guida in Venice, 1718). ఇంకా ఇతర చర్చివంటివి -- హిందూ దేవాలయాల ప్రతీకలుగా కనబడతాయి.

## దేవాలయంనుండి పోర్చుగీసు చర్చి:

పోర్చుగీసువారు ఇండియాలో నిర్మించిన చర్చిలలో-- కొచ్చిన్‌లోని శాంటో అంటోనియా (ఇప్పుడు సెయింట్ ఫ్రాన్సిస్ చర్చ్‌గా పిలువబడుతున్నది) -- (Santo Antonia, 1515), వెల్హా గోవాలోని సెయింట్ ఫ్రాన్సిస్కొ-డే ఆసిస్ (S. Fransisco de Assisi at Velha Goa, 1663), సాంటానాడీ తాలౌలిమ్ (Santana de Talaulim, 1695), జువాలోని శాంటో ఎస్తీవాయో (Santo Estevao at Jua or Zuem, 1750) మొదలైనవి హిందూ దేవాలయాల నమూనానే పోలి వుంటాయి నేటికీ!

మెక్సికోలో టెపీకాలోని ఫ్రాన్సిషియన్ చర్చ్ (Franscian Church at Tepeaca, 1543), బ్రెజిల్‌లోని సెయింట్ సాల్వడార్ కేథడ్రల్ (St. Salvador Cathedral in Brazil) సెయింట్ పెడ్రోడోస్ క్లెరిగోస్ (S. Pedrodos Clerigos at Recife 1728) ఆరోప్రోటోలోని రొసారియో (Rosario at Ouo Proto 1780) మొదలైన చర్చ్‌లుకూడా దీని ఆధారంగానే, నిర్మించబడ్డాయి, పోర్చుగీసు బ్రెజిల్‌లోకూడా, ఆ నమూనా చాలావిస్తృతంగా ఉపయోగించబడింది.

ఈ విధంగా పోర్చుగీసు వారి ద్వారా హిందూ సౌరభం ప్రపంచ మంతటా వ్యాపించింది.



14

# హిందూమతం పరిచయం

'ఈ ప్రపంచం ఎప్పుడుపుట్టిందో' అని, ఆలోచిస్తే ఎలావుంటుందో — ఈ 'హిందూమతం ఎప్పుడుపుట్టిందో', అని ఆలోచిస్తేకూడా అలా అనిపిస్తుంది.

ఎందుకంటే ఈ ప్రపంచంలో అనేక మతాలున్నాయి కదా? ప్రతి మతానికి ఈ మతాలు ఫలానా టైములో పుట్టినవి అన్న చారిత్రక ఆధారం కనపడుతుంది. కాని హిందూమతానికి మాత్రం ఎంతవెతికి చూసినా ఈ మతం ఎప్పుడు పుట్టిందో, ఎవరితో ప్రారంభించిందో అన్న విషయం మాత్రం ఎంతత్రవ్వినా తరగకుండా అలా వెనక్కిపోతూనే వుంది — ఒక ఇసుక పాతరను అడుగుదాకా త్రవ్వితే ఎట్లావుంటుందో అలా!

ప్రపంచంలోని ప్రతి మతమూ ఒక ప్రవక్తతో ప్రారంభమై అతని ఉపదేశాలద్వారా ఆమతం ప్రచారంకావడం మనకి చరిత్రలో కనిపిస్తున్న యదార్థం. కాని హిందూమతానికి మాత్రం, అలాంటి ప్రారంభకుడుకాని, మన మతాన్ని

ప్రారంభించిన **మూలపురుషుని** గురించిగాని ఏదీ అంతుపట్టదు.

ఉదాహరణకి ఈనాడు యూరోప్ అంతా వ్యాపించిన ''క్రిస్టియన్ మతం'' దాదాపు **1900** సంవత్సరాల క్రితం ఏసుక్రీస్తుతో — అనగా ఏసుక్రీస్తు శిలువ వేయబడడంతో ప్రారంభించిందని వారి చరిత్ర తెలుపుతున్నది. అలానే ఆయన బోధనలతో ప్రారంభించిన మతం కాబట్టి, ఆ మతం పేరుకూడా **''క్రీస్తు''** పేరుతోనే చలామణి అవుతున్నది. అలాగే బౌద్ధమతంకూడా బుద్ధునితోనూ — 'జోరాష్ట్రియన్ మతము' (పార్సీలమతము) ఆ మతప్రవక్త **'జోరాస్టరు''**తోనూ, అలానే జైనమతం మహావీర **జైనుడి**తోనూ, ఇస్లాం మతం మహమ్మదు ప్రవక్తతోనూపుట్టి — **వాళ్లపేర్లతోనే** చలామణి ఔతున్నాయి.

కాని హిందూమతం మాత్రం అలా **ఏవొక్క ప్రవక్త పేరునా లేదు.** ఫలానా తేదీన ఈమతం ప్రారంభించిందనికానీ, అలా దీనిచరిత్ర ప్రారంభించిన మైలురాయివంటి తేదీగానీ ఏదీలేదు! ప్రపంచ మతాలన్నిటితోనూ పోలిస్తే **ఇది ఒక్క హిందూమతంలో మాత్రమే కనిపించే విలక్షణత!** ఇవన్నీ చూస్తే ఇది **ఇతరమతాలవంటి మతం** అవునా ? కాదా? అనికూడా సందేహం కలుగుతుంది.

సంస్కృతంలో ''మతము'' అనే మాటకు ఒక వ్యక్తియొక్క అభిప్రాయము — లేక ఒక మూలపురుషుని 'సిద్ధాంతము' అని అర్థము! బహుశా ఇతరమతాలు ఒక వ్యక్తితో ప్రారంభించినాయి గనుక వాటికి ఆ అర్థం సరిపోతుంది! కాని హిందూమతం మాత్రం అలా ఒక్క వ్యక్తిచేత ప్రారంభింపబడలేదు. ఇది హిందూమతానికున్న రెండవ విలక్షణమైన లక్షణము ! ఇంక **ఏ ఇతరమతాల్లోనూ కనిపించని** అంశము !

ఈ విచిత్రం ఇంతటితోఆగదు! ప్రతిమతానికి ఒక **'మూలగ్రంథం'** వుంది. 'ఇస్లాం'కు 'ఖురానూ', క్రిస్టియన్ మతానికి 'బైబిలు' జొరాష్ట్రియన్ మతానికి **'అవెస్టా'** (Avesta) వున్నాయి కాని హిందూమతానికి మాత్రం

ఇలా ఒక సూత్రం ఇలా ఒక మూలగ్రంథం అంటూ ఏ ఒక్కటీ కనపడదు. కారణం — ఇది ఒక వ్యక్తితో ప్రారంభించివుండకపోవటమే కావచ్చు.

**ఏదిఏమైనా హిందూమతంయొక్క మూలసిద్ధాంతం ఏమిటి ?**

అని ఈనాడు పరిశోధనచేసేవారికి ఇతర మతాల్లోలాగ తేలికగా అందిపుచ్చుకోడానికి ఒక **పుస్తకమంటూ** దొరకదు ! ఇది పరిశోధకులకు ఊపిరాడనిపరిస్థితి కల్పించింది. ఫలితంగా హిందూమత **మూలసిద్ధాంతాలను గురించిన గ్రంథం** — ఈ రోజున అటు ఇంగ్లీషులో గానీ, ఇటు తెలుగులోగానీ ఒక సమగ్రమైన పుస్తకం మనకేదీ కనిపించదు. ఇలాంటి గ్రంథంవొకటి వ్రాయాలని ప్రయత్నించినవారూ కనబడరు ! ఇలాంటి మూలసిద్ధాంతములను మనకు **''ఇవే హిందూమతంయొక్క మూలసిద్ధాంతములు''** — అని అధికారికంగా బోధించిచెప్పే **స్కూలుగానీ, గురుకులముగానీ, కాలేజీకాని లేదు.**

## హిందూమతాన్ని బోధించేదెవరు ?

పోనీ హిందూమత బోధనకు విడిగా ఒక సంస్థ వున్నదా అంటే అదీ లేకపోవడమే దీనికంతటికీ కారణము. ఫలితంగా ఈనాడు నేను అమెరికాలోని యూనివర్శిటీలలో ప్రసంగించటానికి ఆహ్వానించ బడినప్పుడు **అక్కడి మతాలన్నిటినీ డిగ్రీ కోర్సులో బోధిస్తున్నారు!** కాని, హిందూమతానికి మాత్రం అలా సమగ్రంగా బోధించే లెక్చరర్లుగానీ, టీచర్లుగానీ, భూతద్దంవేసి వెదకినా కనిపించరు ! కారణం ఇతర మతాలలో ఆ మత - సిద్ధాంతాలను బోధించటానికి ఆమతాలలో వేరే ప్రత్యేక డిగ్రీకోర్సులు ఉన్నాయి. హిందూమతానికి అలా ఏమీ లేవు. ఉదాహరణకు క్రిష్టియన్‌మతం బోధించే **''కేథలిక్ యూనివర్శిటీ''** అంటూ ఒక యూనివర్శిటీ వున్నది. ముస్లిం మతానికి ''ఆలీఘర్ ముస్లిం

యూనివర్శిటీ'' వంటి ఆయా మతాలను బోధించే సంకల్పంతో పెట్టిన **బోధనా సంస్థలున్నాయి!** కానీ హిందూమతానికి అలాంటి డిగ్రీకోర్సులు ఏమీ లేకపోవడంవల్ల **హిందూమతాన్ని బోధించే నాథుడే లేడు!** అలా బోధిస్తే అందులో సరైన డిగ్రీ తీసుకొని సరైన క్వాలిఫికేషన్ — ''డిగ్రీ'' పొందినవారు హిందూమతంలో లేరు! ఈ దుస్థితి నేను అమెరికాలో చూస్తే మన మతాన్ని బోధించ వలసిన **''తులనాత్మక పరిశీలన''** తో హిందూమతాన్ని గురించి బోధించవలసి వచ్చినప్పుడు మన మతాన్ని **ఏ ముస్లిం ప్రొఫెసరో లేక క్రిస్టియన్ ప్రొఫెసరో బోధిస్తున్నారు !** ఇది గత 20- ఏళ్ళుగా నడుస్తున్న కథ!

''ఏం చెయ్యమంటారు? ఇంకా ఈ మతాన్ని బోధించే పాఠ్యగ్రంథం కూడా లేదు! పోనీ ఈ మాతాన్ని బోధించే కాలేజీగానీ, యూనివర్సిటీగానీ, భారతదేశంలో చూద్దామా అంటే అసలే లేవు. కనీసం మీ హిందువులనుంచి అడిగి మీ మతం గురించి సరిగ్గా తెలుసు కుందామంటే-''హిందూమతమంటే ఏమిటి?'' అని అడిగితే ఈనాటి మీదేశంలోని మీ హిందువులకే వారిమతం గురించి అవగాహనగాని ఒక శిక్షణగాని, అసలేలేదు! ఇందుకే మీ హిందువులు చాలామంది కనిపించకుండా ఇతర మతాల్లోకి మారిపోతున్నారు! అందుకని మేమే ''హిందూమతం'' గురించి ఎలాగో ఓలాగ కొన్ని పుస్తకములు తయారుచేసుకొని అధ్యయనం మొదలుపెట్టాము'' అన్నారు అమెరికాలోని ప్రొఫెసర్లు.

ఇదేమిటి? **హిందూమతాన్ని-క్రైస్తవులు బోధించడమేమిటి ? ముస్లిములు** బోధించడమేమిటి ? అన్న నా ప్రశ్నలకు వారిచ్చిన పై సమాధానం — చాచి లెంపకాయ కొట్టినట్లనిపించింది! మన

హిందూమతమంటే అవగాహన లేకుండా బ్రతికే హిందువులూ, హిందూమతాన్ని బోధించే వ్యవస్థగాని, పుస్తకంగాని లేని మన భారతదేశ దుస్థితీ నా కళ్ళకు కట్టినట్లయింది.

## II

''**హిందూమతమంటే ఏమిటి?**'' అన్న ప్రశ్నతో ఇలా — ప్రారంభమయింది ఈ నా అన్వేషణ! ఈ అన్వేషణలో దాదాపు రెండు దశాబ్దాలపాటు కనిపించిన హిందూమత గ్రంథాలన్నీ తిరగేస్తూ పోగా అది ఒక ఎడారివద్దకు తీసుకొనివచ్చి ఆగిపోయింది! అదేమిటంటే గత **5000** సంవత్సరాలుగా హిందూమతంపై వెలువడ్డ వేలాదిగ్రంథాల్లో వేటిలోనూ నిర్దిష్టమైన మూలసిద్ధాంతాలు-''**హిందూమతం అంటే ఇది**'' — అని బోధించే **గ్రంథమే లేదు** — అన్న భయంకర సత్యం!

మరి వున్న ఈ గ్రంథాలన్నీ ఏమిటి ? శంకరాచార్యులు, రామానుజాచార్యుల నుంచి మహాత్మాగాంధీవరకూ చేతనైన ప్రతివారూ రాశారే ? అంటే, ఈ గ్రంథాలన్నీ **వ్యాఖ్యానాలు** మాత్రమే!! హిందూమతమనగా వారికున్న **అభిప్రాయాన్ని మాత్రమే తెలియజేస్తాయి**. అందుకే నిజాయితీగా పూర్వాచార్యులు తాము వ్రాసిన గ్రంథాలకు 'శంకర భాష్యము', 'రామానుజ భాష్యము' అన్న పేరు పెట్టారు. **ఎందుకంటే ఈ గ్రంథాలేవీ మూలగ్రంథాలు కావు**! గౌతమబుద్ధుడినుంచీ ఈనాటివరకూ వచ్చిన సాహిత్యమంతా మూలగ్రంథాలుకాని ఇలాంటి **తర్కవితర్కాల** — వాదోపవాదాల **సాహిత్యమే** !!

ఈ అన్వేషణలో తెలిసిన ఇంకొక ఆశ్చర్యకరమైన విషయమొకటున్నది. అదేమిటంటే **హిందూమతమంటే అధికారికంగా బోధించే సమగ్రమైన గ్రంథములురావటం వ్యాసమహర్షి, ఆయన సమకాలికుడైన శ్రీకృష్ణపరమాత్మ--వీరిద్దరితోనే అంతమైనదని!**

అంటే — ఈనాడు మనకి హిందూమతాన్ని గురించి తెలిపే మూలగ్రంథాలన్నీ అందించిన మహావ్యక్తులు ఈ ఇద్దరే యిద్దరు నాలుగు వేదాలను విభాగించి మనకిచ్చి, సాధన మార్గాన్ని బోధించే ''బ్రహ్మసూత్రాల''ను మనకందించి వీటన్నిటి ద్వారా వేదార్థాన్ని **అందరికీ అర్థమయ్యేలాగా** పురాణాలను, భారతము, భాగవతమూ, రచించి అందించిన **మొదటివాడు** — ఆఖరి వాడూ **వేద వ్యాసమహర్షి** !

ఐతే వ్యాసమహర్షి గ్రంధాలు చదవటం అంటే సముద్రాన్ని త్రాగటం వంటిదే! కనుక ఆవేదాల సారాన్ని, బ్రహ్మసూత్రాల మెలకువలనూ యోగశాస్త్రంతో మేళవించి అతి **సంగ్రహంగా ఒక మూలగ్రంథంగా అందించాడు శ్రీకృష్ణభగవానుడు -- 'భగవద్గీత' రూపంలో!** ఇక వీరితర్వాత వచ్చిన సాహిత్యమంతా వ్యాఖ్యాన రూపమైందేగాని మూలగ్రంథాలు కావు !

ఈ మహా సత్యాన్ని గ్రహించిన 'షాకు' నుండి తేరుకుని, తద్వారా ప్రారంభమైందే నా అంతులేని ప్రయాణంలోని ఈ రెండవ మజిలీ!

వేదాలను, ఉపనిషత్తులనూ, సంస్కృతంలో వ్యాసమహర్షి రచించిన మహాభారతాన్నీ, శ్రీమద్భాగవత పురాణాన్ని చదివి, జీర్ణంచేసుకోవడానికి రెండు దశాబ్దాలు పట్టింది! అది కూడా భగవదనుగ్రహంగా నాకు లభించిన చిన్నప్పటి ''**గురుకుల విద్యా విధానము**'' సంస్కృత భాషాభ్యాసము, జ్యోతిషంలో లభ్యమయిన శిక్షణా, వీటితో పాటు నా ఏడవ సంవత్సరంనుంచీ నా గురుదేవులు నేర్పిన ప్రాణాయామము, ఏకాగ్రతా — అనేక విషయాలను **మనస్సులో ఒకేసారి ధారణచేసి** ఆ ఏకాగ్రతద్వారా! వాటియందు నిహితమైన నిగూఢ సత్యాలను మనస్సులో **సాక్షాత్కరింపజేసుకొనే విధానము** — ఇది ఇప్పటి విద్యావిధానంలో లోపించిన పద్ధతి! పూర్వం ఋషుల ఆశ్రమాలలో నేర్పేవారు. ధ్యానసమాధి ద్వారా నిగూఢమైన అనేక రహస్యాలను మనస్సుకు

గోచరింపజేసే ఈ యోగప్రక్రియను! ఇప్పుడెక్కడున్నది ఈ రకం విద్య?

## హిందూమత దర్శనము :-

ఈ సుదూర ప్రయాణంలో ఇన్నింటినీ సమీకరించి చేసిన పరిశోధనవల్ల —క్రమక్రమంగా కంటికి లీలగా గోచరించసాగింది. హిందూమతమనే ఒక హిమాలయ పర్వతంయొక్క విశాలమూ, విస్తృతమూ, గహనమూ, అత్యంత రమణీయమూ అయిన ఒక సుందర 'దర్శనము'!

అది ఒక 'విశ్వరూప సందర్శనం' వంటిది ! ఇందులో **అణువులో బ్రహ్మాండమును చూపించిన** మహర్షుల వేదవిద్య వున్నది! ఇందులో ఈనాటి సైన్సు — కాదు అనేక సైన్సులను ప్రాచీన వేదశాస్త్రాలను సాక్షాత్కారింపజేసిన "ఆర్షవిజ్ఞాన రహస్యమూ" కనిపించాయి! ఇంకా దీనితోపాటు సైన్సులో M.Sc., వరకూ నాకు లభించిన నిర్దుష్టమైన సైన్సు విద్యావిధానపు 'క్రమశిక్షణ' వల్ల ఈ ప్రాచీన సిద్ధాంతాన్ని అంతటినీ సైన్సు **ప్రసాదించిన విమర్శక దృష్టితో** దాన్ని వడపోసి దానికి ఒక రూపాన్నిచ్చి **ఈనాటి సైన్సు భాషలో మానవాళికి అర్థమయ్యేలాగా వేదవిజ్ఞానాన్ని** అందించే సహాయంచేసింది — నా ఈ సైన్సు చదువు !

పై రెండింటి సమన్వయమే హిందూమతం సర్వమూను! ఈ 'సైన్సు యుగం'లో అందరికీ ఈ మూల సిద్ధాంతమును ఈ పుస్తకము ద్వారా తేలిగ్గా తెలిసేలా వీలైనంత స్పష్టంగా ఇవ్వడానికి ప్రయత్నిస్తాను.

## III

వేల సంవత్సరాల నాడు జన్మించిన శ్రీరాముడూ, శ్రీకృష్ణుడూ ఈనాడు దేవుని అవతారాలుగా ప్రతి గుడిలోనూ పూజింపబడుతున్నారు. ఈ రామకృష్ణులు సహితం తాము హిందూమతాన్ని స్థాపించిన మూలమత

ఈ రామకృష్ణులు సహితం తాము హిందూమతాన్ని స్థాపించిన మూలమత స్థాపకులమని చెప్పుకోలేదు! వీరుకూడా అవతారమూర్తులే ఐనా **హిందూమతం తమతోనే పుట్టిందని చెప్పలేదు !**

శ్రీకృష్ణునికి ఎంతో పూర్వం శ్రీరాముడు పుట్టకముందు వేలాది సంవత్సరములకు పూర్వమే వేదాలుండేవి! ఋషులుండేవారు, యజ్ఞములుండేవి!! జప ధ్యానాదులున్నాయి!!! భగవంతుడున్నాడు. ఈ ప్రపంచమూ వున్నది !

ఈ ప్రపంచం ఎప్పుడు పుట్టింది? ''నేనెవరు?'' అన్న ప్రశ్నలకి సమాధానము అన్వేషించడంవంటి నిగూఢమైన పరిశోధనలో **హిందూమత స్వరూపాన్ని** చూడడానికి చేసే ఈ అనంతయాత్రలో ఇది మొదటి అధ్యాయం మాత్రమే!!

రండి, నాతో! ఈ ప్రాచీనమైన మహారణ్యంలో దారి తప్పిపోకుండా నాతో తీసుకెళతాను! నేనెరిగినంతవరకూ దాన్ని చూపిస్తాను! ఇంకా దూరంగా వ్యాపించివున్న వెలుగుబాటను, మిగతా యాత్రను మీరే పూర్తిచెయ్యాలి — భగవంతుడు **వీకిచ్చిన ఒక లాంతరు సహాయంతో!!!** - ఆ లాంతరు మీ ''బుద్ధి''! అందులోని దీపమే మీ **అంతరాత్మ!** దానినుంచి ప్రకాశించే వెలుతురే 'జ్ఞానం' !

ఇదే **హిందూమతం చూపే మార్గం !**

నడవండి! **మీ వెలుగులో మీరే !** తరువాత తెలుస్తుంది ఆ వెలుతురే మీలో నిలిచిన భగవంతుడని!!!



15

# శ్రీమద్భగవద్గీతలోని హిందూమత రహస్యాలు!

ఈ భగవద్గీతలో ఉపదేశించబడిన 'హిందూమతం' యొక్క స్వరూపం -- ఏమిటో బోధించాలని మన ''యోగమిత్రుల'' కోరిక.

ఈనాడు ప్రపంచంలో అన్నిచోట్లా చివరికి మనదేశంలోకూడా ''హిందూమత-ప్రచారం''అనే నినాదం క్రొత్తగా వినబడుతోంది. ఐతే ఈ **హిందూమతంయొక్క స్వరూపం ఏమిటి?**

హిందూమతానికి ప్రచారంచెయ్యాలి సరే! ఆ హిందూమతం గురించి ఏం ప్రచారం చెయ్యాలో తెలియొద్దా? ఏమని ప్రచారం చేస్తారు మీరు? అసలు **''హిందూమతం అంటే ఏమిటి''** ? — అని విదేశీయులు నిలదీసి అడిగితే ఏమి చెప్పాలి ? దీనికి ఎంతమంది హిందువులున్నారో అన్ని సమాధానాలొస్తాయి! అలాగాక ఒక సైన్సు ప్రశ్నకు ఒక నిర్దుష్టమైన సమాధానం వున్నట్టే — శాస్త్రబద్ధమైన (Scientific) సమాధానం

ఏమిస్తాం? అది తెలీకుండా ఏం ప్రచారం చేస్తాం? ప్రచారం చేసే ముందు ఏం ప్రచారం చెయ్యాలో దాన్ని తెలుసుకోవాలి. అదే ఈనాటి ప్రశ్న. — ''హిందూమతం'' అంటే ఏమిటి? అంటే మనం ఏదో ఒకటి కల్పించి చెప్పటమా దానికేదైనా మూలమైన ఆధారం, ప్రమాణం వుందా? ఉంటే ఏమిటి? అన్న అంశాలను చర్చిద్దాము.

ఈనాడు హిందూమతం అంటే ఏమిటో అర్థం తెలియనివాడే హిందువు! నేను ఇలాచెప్పటానికి మనచరిత్రలోనే ఒక కారణం వుంది. ఎందువల్లనంటే ఇదివరకు **1952** లో **Hindu Code** బిల్లు అని ఒకటి పెట్టారు మన కేంద్రప్రభుత్వంవారు. ఈ హిందువులందరినీ ఒక చట్టంతో కంట్రోల్‌చెయ్యాలని ఈశాసనం మొదలుపెట్టారు.

అసలే కంట్రోలులేదు హిందూసమాజానికి — అందుకని ఆపెట్టేటప్పుడు — ఈబిల్లు ఎవరికి వర్తిస్తుంది? అని పార్లమెంటులో పెద్దచర్చ! ''హిందువులకే'' వర్తిస్తుందిక దా? మరి ''**హిందు**''వనగా ఎవరు? అని. అదితేలక కొట్టుకుచచ్చారు దాదాపు ఒక సంవత్సరకాలం.

## 'హిందువు' అంటే--ఎవరు?

ఎవరిని పూజించేవాడు హిందువు? బ్రహ్మని పూజించేవాడు హిందువా? విష్ణువుని పూజించేవాడు హిందువా? శివుణ్ణిపూజించేవాడు హిందువా? లేక ఎవ్వరినీపూజించని 'అద్వైతం' నమ్మేవాడు హిందువా?''ఇదంతా మాయ''-అనేవాడు హిందువా? ఇదంతా మిథ్య అనేవాడు హిందువా? లేదా అంటే — విగ్రహారాధకుడు హిందువా?

రూపంలేకుండా వుండేవాడిని(అరూపం) ఆరాధించేవాడు హిందువుడా? ''నేనే బ్రహ్మ'' లేక ''అహం బ్రహ్మోస్మి''అనేవాడు హిందువుడా? ఇట్లా ''హిందువు అంటే ఎన్నో రకాల నిర్వచనాలు (definitions) పెట్టుకున్నా ఆ వివరణకు తత్సంబంధంలేని హిందువులెంతో మంది వుంటారు! పోనీ

అని పెడితే దేవుని నమ్మని నాస్తికుడిది హిందూమతం అని పెడితే దేవుని నమ్మని నాస్తికుడిది
దేవుణ్ణే నమ్మేవాడిదే హిందూమతం అని పెడితే దేవుని నమ్మని నాస్తికుడిది హిందూమతంలో భాగమే! ఎందుకంటే ''చార్వాక దర్శనం''
కూడా హిందూమతంలో భాగమే! ఎందుకంటే ''చార్వాక దర్శనం'' హిందూదర్శనాలలో ఒకటి! అందుచేత ఎటూ తేల్చలేక చివరికి హిందువు
అంటే ''నేను **హిందువుడిని అని ఎవడు చెప్పుకుంటాడో వాడల్లా** హిందువే'' అన్నారు! ("A Hindu is one who calls himself a Hindu") అనగా తాత్పర్యం ఏమిటంటే, ''హిందువు'' అనగా ఏమిటి అంటే ''మాకు తెలియదు'' అని! ''హిందువు'' అంటే ఏమిటో తెలియనివాడు హిందువు! అని మన చట్టం.

నేను గత మూడు సంవత్సరాలుగా అమెరికాలో పర్యటన చేసినప్పుడు చాలామంది మనవాళ్ళు అడిగేదేమిటంటే ''ఇతర కాలేజీల్లో అక్కడ డిగ్రీకోర్సులున్నాయి. యూనివర్శిటీలున్నాయి, ''కాథలిక్ యూనివర్శిటీ'' (Catholic University) ఉన్నదిగదా? వాళ్ళు మూడు సంవత్సరాల్లో 'క్రిస్టియన్' మతం అంతా బోధించి దాంట్లో డిగ్రీ ఇస్తున్నారు, బైబిల్‌లోవున్న విషయాలు, వాటిపై విమర్శలూ, దానిపై యితర మతస్థులు చేసేటటువంటి అభియోగాలూ అంటే కంప్లెయింట్లు, (complaints) ప్రశ్నలు (అంటే మనం ''పూర్వపక్షం'' అంటామే దానికి సైన్సులో ఉండే ఆధారాలు అని) ఇలాగ ఎన్నో చెప్పి ట్రైనింగిచ్చి నూరిపోస్తారు. దాన్ని వారు అర్థంచేసుకొని వారి **మతంలో నిర్దుష్టంగా తయారయ్యేట్టుగా తయారుచేస్తారు గదా!** అట్లాగే మనమతాన్ని కూడా ''డిగ్రీ'' కోర్సులో బోధించడానికి వీలుగా చెయ్యకూడదా? అని.

అమెరికాలోని యూనివర్శిటీల్లో **అన్ని మతాల తులనాత్మక పరిశీలనా** (Comparative study) బోధిస్తారు. అందులో అమెరికన్ యూనివర్శిటీల్లో ఈ హిందూమతం కూడా సబ్జక్టుగావున్నది. ఆ డిగ్రీ తీసుకోవాలంటే అన్నిమతాలను గురించి తెలుసుకోవాలి! అక్కడ ఇందులో హిందూమతాన్ని గురించి చెప్పేవాళ్లు ఎవరు? అంటే అక్కడి వాళ్ళే!

అంటే యూరోపియన్సు), ముస్లింలూ చెబుతున్నారు. ఇక్కడ 'ఫిజిక్స్' (Physics) చెప్పేవాడు ఎట్లాగైతే ఫిజిక్స్‌లో డిగ్రీ వున్నవాడేకావాలో అట్లాగే హిందూమతాన్ని బోధించడానికి అందులో డిగ్రీ తీసుకున్నవాళ్లూ, అర్హత పొందినవారూ, (Qualified) హిందువులెవరూ లేరు. అందుకని హిందూమతాన్ని క్రిష్టియన్లే చదువుకొని వాళ్ళకి తోచినట్టుగా బోధిస్తారు.

అలాగే మన హిందూమతాన్ని క్లాసుల్లో బోధించడానికి పూర్తిగా నిర్దుష్టంగావున్న పాఠ్యగ్రంథం (Text book) కావలసిన అవసరం ఏర్పడింది. ఆ అవసరం ఏర్పడ్డప్పుడు దానికొక 'సిలబస్' కావాలి. ఇలా ముందు ఒక సిలబస్ తయారుచేసి దానితో పాఠ్యగ్రంథం (Text book) తయారుచేయాలి. అప్పుడు దాని మీద ఒక క్లాసు — పెట్టాలి.

ఐతే ఇప్పుడు వచ్చిన సమస్య ఏమిటంటే అసలు **హిందూమతం అంటే ఏమిటి ?** ఆ సబ్జెక్టు (Subject)లో ఇది హిందూమతం అని బోధించే విషయాలేమి వుండాలి? ఏ విషయాలు ఉండాలి? అంటే ఒకడు లేచి విధవా వివాహాలు ఉండాలంటాడు. ఇంకొకడు లేచి 'సతీసహగమనాలు' ఉండాలంటాడు. శూద్రుల సమస్యలుండాలంటాడు. ఇట్లా కొట్టుకొని చచ్చి చివరికి ఏదీ ఉండనక్కరలేదని తేలుస్తారు. ఇలా హిందూమతం అంటే ఏదో — **ఎవరి అభిప్రాయాన్ని బట్టి వాళ్ళు చెప్పడమేనా ?** దీనికేదైనా ప్రమాణం వుందా? — అంటే ప్రమాణం ఉన్నది! ఈనాడు కలియుగంలో — **'హిందూమతం అంటే ఇది!'** అని నిర్దుష్టముగా రేఖాచిత్రములాగా ఎక్కడైనా మన మతానికి ఒక రూపం ఇచ్చివుందా? అంటే వున్నది.

అలా మనకి యిచ్చేటటువంటి **ఏకైక మూలమైన** గ్రంథమే భగవద్గీత! ఈ కారణంచేత భగవద్గీతాకారుడు శ్రీకృష్ణుడు మొదటి ఆచార్యుడని చెప్పబడ్డాడు.

''సర్వేషాం ప్రథమాచార్యం''

అనగా గురువులందరిలోకి ప్రథముడైనవాడని! మన మతంలో తదనంతరం శంకరాచార్య, రామానుజాచార్యులవంటి ఆచార్యులు ముగ్గురు వచ్చారు. ఇంకా ఎందరో చాలామంది వున్నారు. తర్వాత ఇంకా బోలెడు మంది సంస్కర్తలుకూడా వచ్చారు. హిందూమతాన్ని గురించి బ్రహ్మవిద్యను గురించి చెప్పే వ్యాఖ్యాతలున్నారు. అయితే అప్పుడు ''హిందూమతం' అనే **ఈ పేరులేదు. ''బ్రహ్మవిద్య''** అనే వారు. **'సనాతన-ధర్మం'** — అనే వారు! ఈ మతానికి ఒక 'రూపం' ఇచ్చి ఉపదేశించిన మొదటివాడు శ్రీకృష్ణ పరమాత్మ!

అందువల్ల ''హిందూమతం ఏ రూపంలో వుండాలయ్యా? అని ఒక కాగితం, కలం పుచ్చుకొని **''హిందూమతానికి -- విషయసూచిక''**లాగ 'సిలబస్' (Syllabus) రాయటం మొదలుపెడితే విషయసూచికలో ఒక్కో విషయం లో ఏయే అంశాలు **(Topics)** ఏయే అధ్యాయాలు (Chapters)గా విభాగించి వుండాలో ఆలోచించి రాస్తే, దాన్ని **సరిచూసే ఆధారం ప్రమాణమూ — ''భగవద్గీత'' ఒక్కటే !!**

ఎందుకంటే — హిందూమతం అంటే ఒక అరణ్యమే !! భగవద్గీతను ఆధారం చేసుకొని వెడితేనే మనం క్షేమంగా వుంటాము. అంటే దారితప్పి పోకుండా ఉండటానికి !

కారణం **ఈ భగవద్గీత చతుర్వేదముల సారము!** నాలుగు వేదాలు, ఏమి బోధిస్తున్నాయో సామాన్య మానవుడికి అర్థంకాదుగనక, సామాన్య మానవుడేమిటి? ఇప్పుడు పెద్దగా సంస్కృతంలో మంత్రాలు చదివే బ్రాహ్మలకే అర్థం తెలీదంటే — ఇక సామాన్యుడికి ఏమి అర్థమై చస్తుంది? అందువల్ల ఈ వేదప్రామాణ్యంతో వేదంమీద ఆధారపడినదే హిందూమతము. అంటే — వేదము ఏమి చెప్పుతుందో మనకి తెలియకుండా దానిమీద ఎలా ఆధారపడతాము? కొంచమైనా దిజ్మాత్రంగానైనా మనకి ఒక ఐడియా (idea) , అవగాహన ఉండాలి! కనీసం

'వేగ్' (Vague) ఐడియా ఐనా ఉండాలి. **ఈ హిందూమతం ఎలా వుండాలో చెప్పేది భగవద్గీత!** ఈ భగవద్గీతకూడా సంస్కృతంలో చెప్పబడిందే! అది కూడా ఒక టెక్స్ట్‌బుక్ (Text book)లాంటిది. అయితే అది ఈనాడు మనకు కావలసినరూపంలో లేకుండా ఆనాడు అర్జునుడు ఏయే ప్రశ్నలు అడిగాడో వాటికి కృష్ణుడు ఎలాంటి ''సమాధానాలు'' ఇచ్చాడో ఆ ప్రశ్నోత్తరాల (Question - Answers) .రూపంలో వున్నది.

ఈ భగవద్గీతలోని విషయమంతా మనం తర్జుమా చేసుకొని ఇంగ్లీషులోకో, తెలుగులోకో దాన్ని విడగొట్టి ఒక్కొక్క విషయానికి సంబంధించిన సబ్జక్టు గురించి విడిగా రాసుకోవాలి. ఎందుకంటే గీత 18-అధ్యాయాల్లో అనేక అధ్యాయాల్లో అనేక విషయాలు అక్కడా - అక్కడా, యిచ్చారు! ఉదాహరణకు హిందూమతం చెప్పె అనేక విషయాలలో 'ఆత్మ' ముఖ్యమైనది. ఈ ఆత్మనుగురించి దాదాపు గీత ప్రతి అధ్యాయంలోనూ చెప్పారు. అవన్నీ ఒకచోట వ్రాసుకుంటూ వెడితే అది ఒక పాఠం అవుతుంది ! అలాగే ''జగత్తు''గురించి అనేక చోట్ల చెప్పాడు. ఆ జగత్తు గురించి భగవద్గీతలో ఎక్కడెక్కడ చెప్పాడో ఏరి వ్రాసుకుంటూ వెడితే ఏం వస్తుందో — అలాగే వేదార్థం గురించి, ఇంకా '**సాధన**' గురించి చెప్పాడు. '**జీవుడి**' గురించి '**కర్మ**' గురించి ఇలా ఎన్నో విషయాలు చెప్పాడు. ఇవన్నీ అలాగే కలగలుపుగా వున్నాయి భగవద్గీతలో! అన్ని విషయాలూ భగవద్గీతలో అన్నిచోట్లా వెదజల్లి వున్నాయి!! ఇది అర్జునుడికైతే అర్థం అయింది కాని. మనకైతే ఓ పెద్ద గందరగోళంగా (Confusion) వుంటుంది. దీన్ని ఒక **టెక్స్టుబుక్ రూపంలో తయారు చెయ్యాలంటే** ఏ విషయాలు కావాలంటే — ఎక్కడ ఏ అధ్యాయంలో ఏమిటి ఉంటుందో తెలిసేలాగా ఒక సైన్సు **పుస్తకంలాగ** రాస్తే — అదే ఈ పుస్తకంలోని విషయం అవుతుంది.

ఐతే 'హిందూమతం' మీద బజార్లో బోలెడుమంది ఎన్నో ఉపన్యాసాలు

ఇస్తారు. అలాగ కాకుండా మన మతంగురించి సప్రమాణంగా చెప్పగలది భగవద్గీత ఒక్కటే! హిందూమతం ఏమిటో ఇదమిద్ధంగా నిర్వచనం చెప్పగలది — **భగవద్గీత ఒక్కటే!** ఈ భగవద్గీతే అంతటికీ ప్రమాణం! అంటే ఇందులోనిదంతా శ్రీకృష్ణుడు తన స్వంత తెలివితేటలతో కల్పించి చెప్పింది కాదు.

శ్లో. ''ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహమవ్యయమ్''

అంటూ పూర్వకాలంలో ఎన్నో కోట్లసంవత్సరాల క్రితమే సృష్ట్యాదిన వైవస్వత మనువుకు బోధించిన పరమాత్మ — వాడే నారాయణుడు బ్రహ్మకు ఏ ధర్మమైతే బోధించాడో అదే సంగ్రహంగా ఈనాడు తిరిగి చెబుతున్నానంటూ అర్జునుడికి మళ్ళీ అంతా చెప్పాడు.

''సకాలే నేహ మహతా యోగో నష్టః పరంతప''

చాలాకాలం గడచిపోవడంచేత ప్రజలలో దీనియొక్క జ్ఞానం నష్టమై పోయింది! దాన్ని మళ్ళీ నిర్మాణంచేసి ఒక రూపం ఇచ్చి, చెప్పిన గ్రంథమే **భగవద్గీత!**

ఈ భగవద్గీత దేన్నిగురించి చెపుతోందో ఆ హిందూమతాన్నే — అంటే 18-అధ్యాయాల్లోని అన్ని విషయాల్ని తలోచోటా వున్నవాటిని క్రోఢీకరించి ఒక్కో అధ్యాయంలో ఒక్కో విషయాన్ని ఆ టాపిక్స్ (Topics)గా చెప్పాలంటే ఆ గ్రంధానికి మొత్తం విషయాన్ని మీ కిప్పుడు చెపుతాను. ఒక్కొక్క దాన్ని గురించి సబ్జక్టు (Subject) విడి, విడిగా చెబితే అది ఒక్కొక్క గ్రంథమే అవుతుంది గనుక!

## హిందూమతం ఏమి చెబుతుంది?

ఈ **హిందూమతం** — దేని గురించి చెబుతుంది? **అంటే ముఖ్యంగా** వేదం గురించి చెబుతుంది. వేదం అనేక శాస్త్రాలకు (Sciences) సమన్వయం. ఈ ''సమన్వయం'' -- లేక ''సింతసిస్''

(Synthesis) అంటే ఏమిటి?

ఉదాహరణకు ఇవాళ ''ఫిజిక్సు'', 'కెమిస్ట్రీ'', ''బయాలజీ'' ఇలా అనేక సైన్సులు చదువుకుంటున్నాము. ఈ సైన్సులన్నీ కలిపితే అన్నింటినీ సమన్వయం చేసి ఒకే జ్ఞానం (Unity of Sciences) క్రింద ఒకే సమగ్ర-**ఏక విజ్ఞానరాశిగా** తయారుచెయ్యగలిగితే — అదే ''వేదం''లోని విషయం అవుతుంది!

ఇదెలాగంటే సిమెంటు, కర్ర, రాయీ అన్నీ కలిపి ఒక బిల్డింగు కడుతున్నాము. ఈ బిల్డింగులో ఇటుకలున్నా, సిమెంటువుండినా, కర్రలున్నా — **అవే బిల్డింగు కాదు!** కాని అన్నీ కలిపి, ఒక ''ప్లాను''తో సమన్వయం అయిన రూపం ఇచ్చాము. -- ఇదే ''బిల్డింగు''! అట్లాగే వేదంలో వున్న ''సైన్సు'' (Subjects) అన్నింటినీ కలిపి ఏకరూపం ఇస్తే -- వచ్చే నాలుగు వేదాల యొక్క **సమన్వయ స్వరూపమే** — **''హిందూమతం''**.



16

# నాలుగు గోపుర-ద్వారాల ఆలయం

# (కర్మ-మార్గము)

హిందూమతం యొక్క -- సమగ్రవైన ఏకాకారం ఎలా వుంటుందంటే, ఒక భవనం వున్నదనుకుందాం! దానికి నాలుగు ద్వారాలున్నాయి! దాని లోపలికెళ్లాలంటే నాలుగువైపులా ద్వారాలుంటాయి. దేంట్లోనుంచైనా ప్రవేశించవచ్చు! అలాగే ''హిందూమతం'' అనే సర్వ శాస్త్ర స్వరూపంగల భవనానికి కూడా నాలుగువైపులా ద్వారాలున్నాయి! నాలుగు ద్వారాలూ లోపలికే తీసుకొని వెళ్తాయి. అన్నింటి గమ్యస్థానమూ ఒకటే! ఎటునుంచి లోపలికి వచ్చినా చేరేది ఒకేచోటుకి! కాని బయలు దేరే వాడినిబట్టి వాని దారి (Direction)మారుతుంది. ఏ వీధిలోవాడికి ఆ బజార్లో వున్న దారే దగ్గర! ఈ ప్రక్క బజారులో వున్న వాడికైతే ఆ

ప్రక్కదారే దగ్గర. ఎదురు వీధి వాడికి ముందు గుమ్మమే దగ్గిర! అలా ప్రతివాడికీ జీవితంలో తానున్న స్థితినిబట్టి ఏది తేలికగా గమ్యాన్ని అందించే మార్గమో — అదే వాడికి 'ద్వారంగా' ఇచ్చారు!

ఏమిటి ఈ నాలుగు మార్గాలు? అంటే అవి (1) కర్మమార్గం, (2) భక్తి మార్గం, (3) జ్ఞానమార్గం, ఇంకోటి (4) వైరాగ్య-మార్గం''. ఇలా కర్మ, భక్తి, జ్ఞాన, వైరాగ్యములనే నాలుగు మార్గాలూ తీసుకెళ్ళి మెయిన్ హాలులోకి అంటే --జగత్తుకు కేంద్రంగావున్న పరమాత్మ యొక్కతత్వం -- అనగా భగవంతుడు అంటే ఏమిటి? అన్న స్వరూపాన్ని -- మనకి **అనుభవంలో చూపిస్తుంది!** ఈ నాలుగు ద్వారాలుకలిగిన భవంతికే ''**హిందూమతం**'' --అని పేరుపెట్టుకోవచ్చు. అవేమిటో ఒక్కొక్కటే పరిశీలిద్దాము!

## 1. కర్మ - మార్గం

ఈ ''కర్మ'' అనగా ఏమిటి? అంటే దానికి చాలా చెప్పవచ్చు. కాని ''సింపుల్''గా చెప్పాలంటే శరీరంతో ప్రతీవాడు ఒక ఆకారంతో జన్మిస్తున్నాడు. ఈ శరీరం నడవాలంటే ఈ ప్రపంచంలో ఏదో ఒక పని చెయ్యాలి! ఈ పని పేరు ''కర్మ''! అన్నం తినాలన్నా, ఊపిరి పీల్చాలన్నా, నడవాలన్నా, ఆలోచించాలన్నా, ఉద్యోగం చెయ్యాలన్నా, ఏదైనా సరే ''కర్మ''! ఏపనీ చెయ్యకుండా ఖాళీగా ఒక్క నిముషంకూడా మనిషి వుండలేడు. ఇది మనం చేసే కర్మ-- మనచేత. చేయించే కర్మ కూడా వున్నది! దీనికే ''కర్మ సిద్ధాంతం'' (Law of Karma) అని పేరు ఉన్నది.

### కర్మసిద్ధాంతం

ప్రతి కర్మకి -- అంటే పుణ్యంకాని, పాపంకాని మనం నిత్యం ఏదో ఒకటి చేస్తూ వుంటామే -- ఈ చేసే ప్రతిదానికి ఒక ''ప్రతిక్రియ''

వుంటుంది. అంటే ''యాక్షన్ - రియాక్షన్'' (Action and Reaction) అనగా ప్రతిపనికీ 'కర్మకీ' — దీని ''కర్మఫలం'' కూడా వుంటుంది. మరి ఇలాగైతే ఎలాగయ్యా, శరీరంతో వుండేవాడు పనిచెయ్యకుండా వుండలేడని చెబుతారే!, మళ్ళీ చేసిన ప్రతిపనికి ఫలితము వుంటుందని అంటే -- మరి ఇక బ్రతికేదెట్లాగా? అన్నం తినకుండా బ్రతకలేడుకదా ! కడుపులో కాలిందంటే తినకుండా వుండలేడు ! అన్నం తినాలంటే ఏదో ఒక పనిచెయ్యాలి ! అందులో తప్పో, రైటో ఏదో ఒకటి చేయాల్సివస్తుంది. ఒకసారి అది పుణ్యమవుతుంది! ఒకసారి పాపమౌతుంది!! మరి కర్మలేకుండా ఒక్క క్షణం **కూడా జీవించలేకుండా** ఏంచేయాలి? ఇదే సత్యాన్ని భగవద్గీత కూడా చెపుతోంది.

**''శ్లో॥ నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్ ॥''**

అంటే అర్థం -- ''ఓ అర్జునా ! ''నహి కశ్చిత్ క్షణమపి'' ఎవ్వరూ ఒక్క క్షణంకూడా, ''అకర్మ కృత్'' ఏపనీ చెయ్యకుండా, ''నతిష్ఠతి'' వుండలేరు. కనీసం వూపిరి పీల్చడం, ఆలోచించడం, తిన డం ఇటువంటి కర్మల్లో ఏదో ఒకటి చేయువలె. అందువల్ల కర్మలు పూర్తిగా త్యాగంచెయ్యడం అనేది సామాన్యంగా వీలైన పనికాదు.

అలాగైతే మరి ''కర్మలు'' వదిలిపెట్టడం సాధ్యంకాదు కదా? కాబట్టి ఈ కర్మ చేస్తువుంటే ప్రతిదానికి కర్మఫలం కూడా వుంటుంది ! కనుక, ఇక ఈ ''కర్మ'' మనని జన్మలలోకి నిత్యం తోస్తుంది. అలాగైతే ఈ కర్మఫలితాన్ని తప్పించుకోవటం ఎలాగ?

అంటే కర్మయొక్క ఫలాన్ని త్యాగంచేయాలి — అంటే ఏపనిచేశామో దానిని స్వార్థపూరితంగా చేశామనుకో, ఆకర్మ మనల్ని అధోగతికి తీసుకొని వెళుతుంది. ఎందుకంటే ఏపని ఐనా మనం స్వార్థపూరితంగా చేసినట్లయితే ఆ పని మనల్ని తప్పక అధోగతికి తీసుకొని వెళుతుంది.

కాబట్టి ఏపని అయినాసరే అన్నం వండుకోవడంలాగ స్వార్ధంతో చేస్తే ఆకర్మ మనల్ని బాధిస్తుంది. కాబట్టి ''భగవద్గీత'' ఒక ఉపాయం చెబుతోంది. కర్మ చేస్తే చెయ్యి! కాని దానిని నిస్వార్ధ సేవాభావముతో, భగవద్భక్తితో **భగవంతునికి సర్వసమర్పణా దృష్టితో** చెయ్యి!

ఒక భవనం కట్టాలనుకో, ఆకట్టేది నీ స్వంత భవనం కట్టుకునేబదులు దేవాలయం కడితే అదే పదిమందికీ ఉపయోగపడుతుంది. లేదా ఒక సత్రం కడితే అది వెయ్యిమందికీ ఉపయోగపడుతుంది. ఇదీ ''కర్మే''! కాని తత్ఫలితంగా నీకు పుణ్యం వస్తోంది. అదే సొంత ఇల్లు కట్టుకుంటే ఆ పుణ్యం రాదు! కాని దాని ఫలితం సర్వమానవులకీ చెందేలాగ చెయ్యి -- లేదా భగవంతునికి సమర్పణచేసి ఫలాన్ని త్యాగం చెయ్యి! ఇది ''కర్మయోగ మార్గం'' అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

## కర్మఫల - త్యాగము

ఇలా సూక్ష్మంలో 'కర్మఫలత్యాగం' చేయటంతో ప్రతివాడూ ''డ్యూటీ'' గా వాడి కర్మలను చేయవలసివస్తుంది. అంటే గృహిణి అయితే అన్నం వండటం, పిల్లలకి నీళ్ళుపోయటం, వాళ్ళ సంరక్షణా ఇలాంటివి చేయడం అయితే చెయ్యాలి కాని, తనకు వాళ్ళు ఏదో తెచ్చిపెడతారనే స్వార్ధభావంతో చేసినట్లైతే అదే ''కర్మ బంధమై'' అది మళ్ళీ తీర్చుకోవటానికి మళ్ళీ ఎన్నో జన్మలెత్తాల్సి ఉంటుంది. మళ్ళీ స్త్రీ క్రింద, పురుషుడి క్రింద.... ఇలాగ! ఇంక అదే కర్మ భగంతుడికి చేస్తున్నామనే భావనలో -- అనగా ఏతత్ కృష్ణార్పణమస్తు ! అని లేదా ''నారాయణార్పణ''మని నిజమైన భగవదర్పణ బుద్ధితో చేయడంవల్ల ఇలా ''కర్మ'' బంధం - ఏర్పడదు! దీనినే శ్రీకృష్ణుడు

''యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్'
యత్కరిష్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం''

''యదశ్నాసి'' ఏమితిన్నాసరే, లోపలున్న భగవంతుడిని తలుచుకొని యజ్ఞుహోషి తదాసి యత్ -- ఏదైతే యజ్ఞంచేస్తావో అదికూడా ''నారాయణార్పణం'' చేసి, ''దదాసి'' ఏదైతే దానమిస్తావో అదికూడా ''శ్రీకృష్ణార్పణం'' అనే భావంతో చేసి -- 'యత్కారిష్యసి కౌంతేయ' ఏదైతే ఇలా నిత్యమూ చేస్తావో దాన్ని అంతా కూడా ఓ అర్జునా 'తత్కురుష్వ మదర్పణం' — భగవంతుడనైన ''నాకు'' అర్పణగాచేసి ఆ క్రియ చెయ్యమన్నాడు.

అలా చేస్తూంటే దీనివల్ల మనకి ఏమిటి ఉపయోగమంటే ఆకలిగొన్నవాడికి అన్నం పెట్టడం వల్ల వాడికి ఆకలీ తగ్గుతోంది! వాడూ బ్రతుకుతున్నాడు! దాంతోపాటు ''ఎవడికో పెడుతున్నాం'' అనే అహంభావం వదలివెయ్యటం వల్ల భగవంతుడికి సేవచేసిన భక్తి భావం మనకు కలుగుతోంది! అందువల్ల కర్మఫలత్యాగమూ జరుగుతుంది! దీంట్లో కర్మ, **కర్మ-ఫలత్యాగం** రెండూ వున్నాయి! ఇదే - భగవద్గీతలో చెప్పబడిన **కర్మయోగమార్గం.**

కాబట్టి యోగులు ఏది చేసినా -- మనస్సుతో శరీరంతో కూడా, తమ కేవలం సంకల్పం త్యజించి ఆత్మశుద్ధి కోసమే చేస్తారు.

**''శ్లో॥ యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వా ఆత్మశుద్ధయే''**

అనగా ఆత్మశుద్ధికోసం -- 'సంగం' అనగా ఆసక్తిలేకుండా త్యక్త్వా ఎటాచ్‌మెంట్ (Attachment) ను విడిచిపెట్టి, కుర్వంతి - చేస్తాడు. అదే, సామాన్య మానవుడైతే పనిమాత్రం చేస్తాడుకాని ఆసక్తి (Attachmentt) తోనే చేస్తాడు. కనుక కర్మ వాడిని బంధిస్తుంది! ఐతే యోగులు ఎందుకు పనిచేస్తారు? పనిచేస్తూంటే శరీరం మనస్సూ పరిశుద్ధిచెంది పావనమౌతాయి!

భగవంతునికోసం చేస్తే, అది ఒక **సాధన అవుతుంది.** ఇది

కర్మ-యోగం యొక్క సారాంశము.

ఇది హిందూ మతంలోని నాలుగు ద్వారాలలో మొదటిది -- అందరికీ అందుతుంది.



## 17

# భక్తిమార్గము - రెండవ ద్వారము

అతి సామాన్యులైనవారు కూడా తరించాలంటే ఎలాగ? అన్ని మార్గాలలోకీ చాలామందికి అందుబాటులో వుండి అందరికీ వీలయ్యేది భక్తి మార్గం!

**భక్తి అంటే ఏమిటి ?** ఈ భక్తి యొక్క స్వరూపం ఎలాంటిది? అని ప్రశ్నిస్తే **'విభక్తి' లేనిదే -- భక్తి !** విభక్తి అనేదానికి వ్యతిరేకం భక్తి అన్నపదం. 'విభక్తి' ! అంటే విభజించుట! అంటే రెండింటిని వేరుచేయుట విభక్తి ! వాటినే కలిపితే భక్తి! దేనిని కలపాలి? మానవుడు తన అంతరాత్మను భగవంతునిలో కలుపుట ! అంటే మనిషి వ్యక్తిత్వం పూర్తిగా దైవంతో ఏకత్వము పొందుటయే 'భక్తి' !. జీవుడు + దేవుడు = రెండూ కలిపితే భక్తి! కుడిచెయ్యి దైవానికి, ఎడమచెయ్యి మానవత్వానికీ సూచన! ఆ రెండూకలిపితే 'నమస్కారం' -- అదే భక్తికి గుర్తు! ఈ ఇద్దరినీ ఎలాగండీ కలపటం? మానవుడిక్కడ కూర్చున్నాడు. మరి పైవాడక్కడ కూర్చున్నాడు కదా! సత్యలోకంలో బ్రహ్మ, భూలోకంలో

మానవుడూ ఉంటాడే -- ఈ రెండూ ఎట్లా కలుపుతారయ్యా అంటే -- కలుస్తారు! మద్రాసులో తండ్రీ, ఈవూళ్ళో కొడుకూవుండి ''ట్రంక్-కాల్'' టెలిఫోన్ చెయ్యటంలేదా? అలాగే ''కనెక్షన్'' ద్వారా ఈ భక్తి కలుగుతుంది. ''కనెక్షన్ ఎట్లా వస్తుందయ్యా?'' అంటే హృదయంద్వారా వస్తుంది. తెలివి అంటే లేకపోవచ్చు! కానీ ప్రతివాడికీ ఓ హృదయం ఉంటుంది. అతి తెలివితక్కువవాడు, అనగా అప్పుడే పుట్టినవాడు కూడా తల్లి లాలిస్తే పాటవిని ఆనందిస్తూ తన్మయంతో పడుకుంటాడు! వాడికి తెలివి అక్కరలా, హృదయం వుంటేచాలు! అదే ''శిశుర్వేత్తి పశుర్వేత్తి'' - శిశువుకీ పశువుకీ గూడా హృదయం తెలుపుతుంది 'ప్రేమ' అనే ఆభక్తి సూత్రాన్ని! అంటే శిశువులకీ పశువులకీ అన్నిటికీ వుండేటువంటిదే హృదయం గనుక — హృదయంతో భగవంతుణ్ణి ఆరాధించటం ''భక్తి''! అనగా భగవంతుని ప్రేమించుట!

ఈ భగవంతుణ్ణి ప్రేమించటం ఎట్లాగయ్యా? అంటే నారద భక్తి సూత్రాల్లో ఈభక్తిని గురించి నిర్వచనం (Definition) ఇలా స్పష్టం చేశాడు.

''భక్తిర్హి, పరమప్రేమ రూపా''

'భక్తి' అంటే నారదుడు ఏమి చెప్పాడు? అది పరమప్రేమ స్వరూపము అని! ప్రేమనగా ఏమిటి? ఒక మనిషిని మనం ప్రేమిస్తే -- ఆమనిషిని గురించే ఆలోచిస్తాము. ఆ మనిషి గురించే ఎప్పుడూ తియ్యగా ఊహిస్తాము, ఆమనిషి గురించే ఎదురుచూస్తాం, మంచిది ఏదిచదివినా, ఏదివిన్నా, ఏది రుచికరమైంది తిన్నా వారికే సమర్పిస్తాం! ఇది లౌకికమైన ప్రేమ! ఒక మనిషి ఇంకో మనిషి మీద పెట్టేది ! కొడుకు మీదో, కోడలిమీదో, మనవడిమీదో, భర్తమీదో పుట్టేది ఇలా మామూలు ప్రేమ! దీన్ని తీసికొనివెళ్ళి భగవంతుని మీద పెట్టగలిగినట్లైతే దాన్ని ''భక్తి' అంటారు!

అంతేకాదు అది ''పరమ-ప్రేమ'' కావాలి! అనగా లౌకికమ్మైనది! మామూలు ప్రేమ — మనకి ఏదోలాభం, స్వార్థప్రయోజనం, సుఖం కలుగుతుందనే ఆశతో ప్రేమించేది! కాని పరమప్రేమ అంటే అలాంటిది కాదు!

కొడుకు, తల్లి, భార్యా ఇవన్నీ లౌకికంగా ఏదో ఒకరోజు నశించేటువంటివే! కాబట్టి నశించిపోయే వస్తువుల్నీ, వ్యక్తుల్నీ ప్రేమించితే అవి పోయినట్లైతే, లేదా ఇవాళ మనని ప్రేమించినవాళ్ళే రేపుమనల్ని ప్రేమించనట్లైతే లేక మనల్ని తిన్నగా చూడకపోతే, మనని ద్వేషిస్తే -- లేక మనకు వ్యతిరేకమ్మైనవారుగా తయారై మనకే అపకారం తలపెడితే, మనమీద కోర్టులో దావావేస్తే, ప్రేమించిన ఆ వ్యక్తి హృదయంబద్దలై బెంగపెట్టుకొని చస్తాడు! ఈలోకంలో ఎప్పుడూ ఇలా జరుగుతూనే వుంటుంది. ఎందుకంటే ఈ ప్రపంచం కర్మస్వరూపం! కనుక ! అలా ఎప్పుడూ ఏదో ఒకటి ఇలానే ప్రేమలో మోసం జరుగుతూనే వుంటుంది. మోసంచేసే ప్రతివాడికీ మేనమామో, మేనత్తో వుంటూనే వుంటారు. బంధువుకదా మోసంచేయడని లేదు! అందుచేత హృదయం పగిలి ఏడుస్తూ కూర్చుంటామా? ఆ జీవితం నిరర్థకం!

అందుచేత మీహృదయాన్ని ఇలా లౌకికమ్మైన అనేక దోషాలు కలిగిన సామాన్య మానవునిపై పెట్టి, ప్రతివాడియందూ చిక్కి, వాడు మోసంచేస్తే ఏడుస్తూకూర్చునే బదులు **ఈప్రేమనే భగవంతునిపైన గనుక పెట్టావా తరిస్తావు**, అంటుంది భక్తిమార్గం! మనిషి మోసగాడు కావచ్చుగాని దేవుడు సత్యస్వరూపుడు! అందుకని ఆ భగవంతుని ప్రేమిస్తే తరించడమే కాదు, బ్రతికి వుండగానే మీహృదయానికి ఎన్నోరెట్లు -- ఆనందం కలుగుతుంది! **మనిషిని ప్రేమించినదాంట్లో వెయ్యోవంతు ప్రేమతో ఆ భగవంతుణ్ణే. ప్రేమిస్తే** ఆయన ప్రేమస్వరూపుడు గనుక తిరిగి ప్రతిఫలం వెయ్యిరెట్లుగా ఇస్తాడు! ఎందువల్లనంటే, మానవునిలా స్వార్థపరుడు కాడు

కాబట్టి! భగవంతునియందు మనకు నిర్మలమైన ప్రేమ ఎప్పుడు కలుగుతుందో అప్పుడు మనకి హృదయం నిర్మలమౌతుంది. అందువల్ల ఈభక్తిని ''పరమ--ప్రేమరూపా'' అన్నాడు నారదుడు. మనం ప్రేమించింది మామూలు వ్యక్తిని అయితే ఆ వ్యక్తికిగల డబ్బు, బంగారం, ఇల్లు, ఆస్థిపాస్తుల మీద మనకు ఎట్లాంటి ప్రీతి కలుగుతుంగో అలాంటి ప్రీతి ఇది!

ఏ లక్షాధికారైనా ఏమిచేస్తూంటాడు? రాత్రింబవళ్ళు ఇనపెట్టిమీదే ధ్యానం చేస్తుంటాడు. అది ఎవరైనా కొట్టేస్తారేమోనని ఆ ధ్యానం! కొట్టేస్తే కొట్టేశారని ఏడుపు! కొట్టెయ్యకపోతే కొట్టేస్తాడేమోనని భయం! ఆడబ్బు లేకపోతే 'అయ్యబాబో డబ్బులేదే' నన్న బెంగతో లేనిదాన్ని ధ్యానం చేస్తాడు. బాగావుంటే వున్నదానికోసం టైము అంతా వ్యర్ధంచేస్తాడు. ఎవడైతే ఈడబ్బుపై ఎలాగైతే 24 గంటలూ ధ్యానంచేస్తాడో — వాడు ఆ ధ్యానాన్నే భగవంతునిపైకి తిప్పాలి! మహాభాగవతోత్తముడైన ప్రహ్లాదుడే చెప్పాడు భాగవతంలో ఏమంటే:

''యా ప్రీతిరవివేకానాం విషయేష్వనపాయినీ''

అనగా నీకేం కావాలని నృసింహుడడిగితే, ప్రహ్లాదుడు ''దేవా! నాకు ఎటువంటి భక్తి కావాలంటే 'యా ప్రీతిరవివేకానాం' అనగా ఈప్రపంచంలో వివేకంలేని, జ్ఞానశూన్యులైనవాళ్ళకీ 'విషయేషు' విషయ సుఖాలందు, అంటే డబ్బుయందు, ఆస్థియందూ — **ఎటువంటి అత్యంత ప్రీతి కలుగుతుందో** సరిగ్గా అటువంటి ఆసక్తే — నాకు **భగవత్ చరణాలయందు కలిగేటట్లు** చెయ్య మన్నాడు.''

అంటే ఎవరు ఎన్ని ఆర్గ్యుమెంట్లు (Arguments) చెప్పినా ఒకపట్టాన డబ్బు పెట్టెని మాత్రం తియ్యరు! ఎన్ని వేదాంతాలు చెప్పినా, డబ్బు దగ్గర కొచ్చేసరికి జాగ్రత్తగా వుంటారు. '' ఇది ప్రాక్టికల్ కాదు — దీంతో డబ్బురాదు దీంతో వుద్యోగమూ రాదు'' అని ఇలా ఎన్నివిధాలచెప్పినా

వీడనటువంటి భక్తినే ఆ ప్రహ్లాదుడు కోరుతున్నాడు. అందుచేతనే పాములచేత కరిపించినా, కొండలపైనుంచి తోయించినా ఎన్నిచేసినా గాని, భయపెట్టినా బాధించినాగానీ భక్తిని వదల్లేదు ప్రహ్లాదుడు! అది, అనన్యమైన భక్తి!!!

''అనన్యేనైవ యోగేన భక్తిరవ్యభిచారిణీ''

అని భగవద్గీత చెబుతోంది ఇదే! - 'అనన్యమైన యోగంతో ఎవరైతే నన్ను భక్తితో భజిస్తారో వారి యోగక్షేమాలు నేనే వహిస్తా' నన్నాడు శ్రీకృష్ణపరమాత్మ! 'అనన్యం' అంటే ఏమిటి? 'అన్యము' కానటువంటిది! ఇది ఎలాంటిదంటే పతివ్రతయైన స్త్రీకి ఎలాగయితే భర్త ఒక్కడే ఆరాధ్యదైవమో అలాగ! సీతకి రాములవారు తప్ప ఏ ఇతర ధ్యాసలూ లేకుండా ఎలా ఉన్నదో, అలాగ భక్తుడికి భగవంతుడిమీద తప్ప యితర వస్తువులపై ధ్యాస లేనట్లైతే అది అనన్య భక్తి! అందుకే ప్రహ్లాదుడు విషయసుఖాలయందు అంటే లౌకిక మైన వస్తువులయందు (Material things) అవివేకులకు ఎటువంటి అత్యంత ప్రీతి ఎలాకలుగుతోందో సరిగ్గా అట్టి ఆసక్తినే, అంత తీవ్రభక్తినే భగవత్ చరణాలయందు కలగాలని కోరాడు!

అట్టి భక్తి కలిగితే ఆ భక్తి ఏంచేసినా పోదు. భయంతో పోదు. ఆశతోనూ పోదు. స్వార్థంవల్లా పోదు! దానికి వేరే ఎవరేం ఉపదేశించినా పోదు! రకరకాల ఆర్గ్యుమెంట్లకి చెదిరిపోదు — ఈ అనన్యమైన భక్తిని, రామానుజులేమన్నారంటే ''తైలధారవత్ అవిచ్ఛిన్నం'' అని! అంటే ఈ భక్తి తైలధారవలే ఉంటుందని! అంటే పైనుండి ధారగా నీళ్ళుపోస్తే ముక్కలుగా తుంపరగా పడుతాయి. అదే గనుక నూనెగాని ఆముదంగాని పోస్తే అదే ధారగా అవిచ్ఛిన్నంగా పడుతుంది. అనగా తీగెలాగ (Continuous)గా తేనెపాకంలాగ పడుతుంది — ఎక్కడాకూడా మధ్య ఖాళీలుండవు!! ఇలాగ ఆలోచనకి ఆలోచనకీ మధ్య ఎడం వుండని భక్తి

-- 'అనన్య భక్తి'.

అలా కాకుండా ఎంతసేపు ఐతే ఆలోచన తన మనస్సులో నిలుస్తుందో అంతసేపూ భగవంతుని ఆలోచనేతప్ప ఇంకోవస్తువు లేకుండావుండే భక్తి ''పరాభక్తి''!! అది ఎప్పుడైతే కలుగుతుందో, అప్పుడా భక్తి వల్ల హృదయం శాశ్వతంగా మనలోవున్న ఆత్మకు అంటుకుపోయి దైవానికి అంకితమౌతుంది.

అంటే స్వార్థంవిడిచి ఆలోచించేటప్పుడు మన మనస్సు విశ్వమంతా వ్యాపించి విశ్వమంతా మన హృదయమే అవుతుంది! అప్పుడు అట్టి ప్రేమ అందరియందూ కలుగుతుంది. ఎందువల్ల? వాళ్ళందరూ గొప్పవాళ్ళని కాదు - వాళ్ళందరియందూ భగవంతుణ్ణి చూస్తాము గనుక!

''శునిచైవ శ్వపాకే చ, పండితాస్సమదర్శినః''

అంటే — కుక్కయందూ, కుక్కనుతినే ఛండాలునియందూ బ్రాహ్మణులయందూ, ఏనుగుయందూ, చీమయందూ ఒకే భగవంతుని చూడగలిగే ''భక్తి'' అది సవ్యమైన భక్తి! అంటే ఎవరిని చూసినాసరే వాడిలోని వ్యక్తిని చూడకుండా — వాడి 'ఉద్యోగం' చూడకుండా, వాడి తెలివి చూడకుండా -- వాడియందు అంతర్యామిగా నిలిచియున్న, జీవాత్మ స్వరూపంలో వెలుగుతూ వాడికేసి చూడగానే వాడి హృదయంలో వెలుగుతూవున్న భగవంతుడి బొమ్మను -- కాదు, **భగంతుణ్నే** చూడగలుగుతాడు! ఇలాగ అతనిలోని 'తాను' కనబడుతుంది!!! అలా కనబడి తేనే అది-- **'అనన్యేనైవ యోగేన'** అనగా అనన్యమైన -- యోగ-భక్తి! లేక, భక్తి-యోగం!

అప్పుడే ''ఇందుగలడందులేడని సందేహము వలదు'' అన్న ప్రహ్లాదుడిలాగ మనకీ కనిపిస్తుంది. హిరణ్యకశిపుడికి అలాగ ఎందుకు కనిపించలేదు? ఎదురుగా స్థంభము, వీడికీ -- వాడికీకూడా కనిపించింది.

హిరణ్యకశిపుడికి అందులోవున్న ఇంకోటేదో కనబడలేదు! అంటే ఎప్పుడైతే భగవంతుణ్ణే అన్నిచోట్ల దర్శించగలుగుతాడో అప్పుడు వాడికి ఎక్కడచూస్తే అక్కడ — నిజంగానే భగవంతుడు ప్రత్యక్షమౌతాడు! అప్పుడు భక్తునికి భగవంతుడు ప్రత్యక్షమవుతాడు! ఈలోపల భక్తుడు ఎక్కి వెళ్ళాల్సిన మెట్లు తొమ్మిది! ఈ తొమ్మిదీ 'నవవిధ - భక్తి' అన్నమాట! ఆ నవవిధ భక్తులూ ఏవి అంటే

శ్లో॥ ''శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాద సేవనం.......''

''శ్రవణం'' అంటే భగవంతుడి యొక్క నామాన్ని వినటం — ' ఓం నమో నారాయణాయ' అని నిరంతరాయంగా విసుగుపుట్టకుండా దానియందు ఆసక్తి వుంటేనే వినగలుగుతాము. ఒక సినిమాపాటను విని, విని, ఎన్నిమాట్లు కూనిరాగంలా తీస్తూ బాత్‌రూంలోకూడా ఎలాగ పాడుకోగలరు? ఇంటరెస్టువల్ల! అలా తనకు పాడటం చేతనయినా చేతకాకపోయినా తాను తనకోసం బాత్ రూంలోనైనా పాడుకుంటాడు. అలా భగవంతుడి నామం ఎన్నిసార్లువిన్నా విసుగుపుట్టకుండా అంత ఇంటరెస్టుగా శ్రవణం అంటే దానిని విని, ఇదే ఆలోచనా చెయ్యాలి -- ఓం నమోనారాయణాయ లో 'ఓం' -- అనగా ఇదా! 'నమో' అనగా ఇదా! 'నారాయణ' అనగా ఇదా! మనం విన్నదీ ఇదా! అని ముక్కస్య ముక్కా దాన్ని గురించి మళ్ళీ మళ్ళీ ఆలోచించడంవల్ల మనలో దానిపై ఇంటరెస్టు పెరుగుతుంది. ఇది శ్రవణ భక్తి!

''కీర్తనం'' - నిరంతరంగా బైటికే పాడేసెయ్యటం ''తన్మయత్వం'' లో అది కూడ దాటి ''స్మరణ'' మాత్రంతోనే భగవంతుని తియ్యదనం తనను సమ్మోహితుని చేసే చాక్లేట్‌ను గట్టిగా చప్పరిస్తూ పీల్చి అందులోనే లీనమైనట్లే స్మరణలో నిలిచిపోతాడు!

''పాదసేవనం'' -- అంటే భగవంతుని స్వరూపంగా, గురువునుగాని, దైవమునుగాని భగవంతుని విగ్రహం గాని తనకు రక్షకుడుగా ''దిక్కు''గా

''యజమాని''గా 'పతిగా' వారి పాదములయందే శరణాగతిచెయ్యటం పాదములకు మానసికంగా నిత్యమూ పూజచేయటం!

ఈవిధంగా మిగతా నవవిధ భక్తుల గురించీ విస్తారముగా చెపితే అదే ఒకపెద్ద గ్రంధమౌతుంది.

ఇది భక్తియోగ మార్గం!! భక్తులుగా అనన్యమైన ఈ భక్తియోగంతో ఆరాధించాలి. ఇక్కడ అనన్యమైన అంటే — అన్ని పనులూచెడి అంటే పనులకోసం మినిస్టర్ల నెందరినో, ఎమ్మెల్యేలనూ పట్టుకుంటే పనులుకాక అన్నీ క్షవరమయ్యాక అప్పుడు ముఖ్యమంత్రి వద్దకుపోయినట్టుగా భగవంతుడి దగ్గరికి రావడంగాదు! అది అనన్యమైన భక్తికాదు! అందరి కాళ్ళు పట్టుకొన్నాక అందరూ, ఛీ, పో, అన్నాక అప్పుడు దిక్కులేక మళ్ళీ భగవంతుడి దగ్గరికిపోవడం ఎలాంటిదంటే ''వృద్ధవేశ్య'' ఇష్టమొచ్చిన తిరుగుళ్ళన్నీ తిరిగి, తనకు ముసలితనం వచ్చాక ఎవరూ చేరనివ్వరు కనుక అప్పుడు 'నేనుపతివ్రతను' అంటే లాభంలేనట్టే -- అందుకే తానూ వయస్సుండగానే త్యాగబుద్ధితో ఎవరైతే సర్వస్వం భగవదర్పణం చేస్తారో ఆమె నిజమైన 'పతివ్రత' -- అలాగే అన్నీ చెడాక తమ శరీరంలో జవ సత్వాలుండి, డబ్బుండి విజయం వెంటవుండగానే ఎవరైతే భగవత్ చరణారవిందములందు శరణాగతి చేస్తారో వాడే నిజమైన పతివ్రతాభక్తి లేదా అనన్యమైన భక్తిగలవాడు అని అర్థం! సరిగ్గా ఇవే మాటలు గీతాచార్యుడిలా చెప్పాడు.

**శ్లో॥ అనన్యేనైనవ యోగేన భక్తి రవ్యభిచారిణీ**

ఎవడైతే ఈ భక్తిని 'వ్యభిచార-బుద్ధి' లేకుండా అంటే ఇతర దేవతలయందు ఇతర వస్తువులయందు పోకుండా ఏక చిత్తంతో సాధన చేస్తాడో వాడు ''**మామ్ ధ్యాయంత ఉపాసతే** ''నన్ను ధ్యానించుట, నన్ను ఉపాసించుట నన్నుగురించి తలుచుకొనుట నన్నుగురించే సంకీర్తన చేయుట'' వీటివల్ల నన్నుగురించి వినగానే కళ్ళమ్మట ఆనందోద్రేకంతో

కన్నీళ్ళు కారటంతో, నాపై ప్రేమ కలగటం వొడలు పులకరించే ప్రేమ--హర్షం కలగటం కంఠస్వరం గాద్గదికం అంటే ఉద్రేకం కలిగి భక్త్యావేశంలో స్వరం రుద్ధం కావటం ఆ తర్వాత కళ్ళ వెంబడి నీళ్ళు రావటం జరుగుతుంది'' -- అన్నారు.

ఆ భక్తిలో ఒళ్ళు తెలియదు! తాను ఏం చేస్తున్నాడో తనకే తెలియదు! తనను తాను మరచిపోవటం అంటే తన్మయావస్థ కలుగుతుంది.

ఈ మరచిపోవటం పెరిగి పెరిగి ''సమాధి'' స్థితి కలుగుతుంది! ఈ **సమాధి స్థితి కలిగినప్పుడు భగవంతునియొక్క నిజస్వరూప సాక్షాత్కారం** కలుగుతుంది.

ఈ సాక్షాత్కారం కాగానే ఎదురుగుండా ఉండే ఆ మూర్తిని సర్వదా ధ్యానిస్తూ దాన్నే చూస్తూ **దానియందే లీనమౌతాడు!** ఈ లీనమవటం ముక్తి అన్నారు. ఈ విధంగా ''భక్తి-మార్గం'' రెండవ మార్గం! కర్మ భక్తి జ్ఞాన మనే ఈ మూడూ మూడు దర్వాజాలు!

అలానే వైరాగ్యమనే ఇంకోమార్గం ఉంది. అది హిందూమతంలోకి నాలుగవ ద్వారం.



18

# మూడోద్వారం - 'జ్ఞానమార్గము'

హిందూమతంలో ఉపదేశించిన **'భగవత్ జ్ఞానం'** నాలుగు అంశములు కలిగినది. అందుకే దానిని నాలుగు గోపురాలున్న దేవాలయంతో పోల్చాము. అందులో మొదటిద్వారం **కర్మ**, రెండవ ద్వారం **భక్తి** అయితే - మూడవద్వారం **'జ్ఞానమార్గం'** అనుకోవచ్చు.

ఈనాడు మనలో చాలామంది ఇంగ్లీషు చదువులు చదివినవారు ఈ 'జ్ఞానం అంటే మనం మామూలుగా 'తెలివి' అనుకునే అతితెలివి అనుకుంటారు! చదవటం, వ్రాయటం, లెఖ్ఖలూ, సైన్సు, మొదలైన పారిభాషికమైన చదువులో చురుకుగావుంటే అదే జ్ఞానం అనుకుంటారు. కాని హిందూమతం కూడా మన ఉదర పోషణకు అంటే పొట్టపోసుకోటానికి పనికివచ్చే చదువులాంటిదే అనుకుంటాము. ఇంజనీరింగు, డాక్టరీ వ్యాపారంలో (Business Administration) ఈ

చదువులు బాగా చదివి, జ్ఞానం అంటే ఇదే 'తెలివి' అని అనుకుంటారు! ఇది, ఈనాటి చదువుతో స్ఫురించే అర్థం. కాని ఇది కేవలం బ్రతుకు తెరువు సంపాదించుకునే తెలివి మాత్రమే! **'జ్ఞానము'** అంటే ఇది కాదు! మార్కండేయ మహర్షి ఈ భగవత్‌జ్ఞానం గురించి తెలుపుతూ దేవీ సప్తశతిలో

''జ్ఞానమస్తి సమస్తస్య జంతోర్విషయగోచరే''

అంటే పిల్లలను పోషించుకోడానికి, పొట్టనింపుకోడానికి, పిల్లలను కనడానికి, తనకుటుంబాన్ని రక్షించుకోడానికీ కావలసినదే జ్ఞానమైతే — అది మనిషికేకాదు, అన్ని జంతువులకీ వున్నది. కుక్కాపిల్లీ, పశుపక్ష్యాదులూ వాటితిండి సంపాయించుకోవటంలోనూ, కుటుంబ సంరక్షణలోనూ ఒక్కోసారి మనకంటే ఎక్కువ జిత్తులే ప్రదర్శిస్తాయి. ''జ్ఞానం'' అంటే ఇదికాదు! ఎందుకంటే ఇదే జ్ఞానమైతే మనుషులకీ జంతువులకీ ఇది సమానమేకదా? నిజానికి **ఈనాటి చదువులన్నీ ఈ బాపతు జీవనోపాధి విద్యలే!**

మరైతే అసలు నిజంగా **'జ్ఞానం' అంటే ఏమిటి?** దేన్నిగురించిన జ్ఞానం? జ్ఞానం అనిచెప్పబడే విజ్ఞానమునకూ, లౌకికమైన జీవనోపాధితెలివికీ తేడా ఏమిటి? ఈ ప్రశ్నలకి అర్థం తెలియాలి! అప్పుడే హిందూమతం చెప్పే జీవిత లక్ష్యం ఏమిటో బోధపడుతుంది! దానిని సంపాదించుకునే **జ్ఞానమార్గమేదో** ఆ తరువాత తెలుస్తుంది! ఇది ముఖ్యమైన విచక్షణ! హిందూమతాన్ని అర్థంచేసుకోడానికి ఇది అవసరమైనది!

ప్రపంచం గురించిన జ్ఞానం జ్ఞానంకాదు! తన శరీరం గురించీ, శరీరాన్ని పోషించుకోడానికి అవసరమైన తెలివీ -- ఇంద్రియాలతో లభించే జ్ఞానమూ 'జ్ఞాన' మనబడదు! అయితే దేన్ని జ్ఞానమంటారు? నిజంగా **స్వస్వరూప—జ్ఞానమే - ''జ్ఞానము''!!** అనగా 'తన' యొక్క

నిజస్వరూపం గురించిన జ్ఞానం అన్నమాట! నిజస్వరూపమంటే శరీరం మన నిజస్వరూపంకాదు.

''ఇది నాశరీరం''

అంటున్నప్పుడు ఈ శరీరమంటే 'నేను' కాదన్న అర్థం ధ్వనిస్తున్నది. ఈ శరీరం ఒక ఇల్లు అనుకుంటే -" అందులో వుండే **మనలోవుండే 'ప్రాణం' జీవం, 'ఆత్మ' యజమాని** అన్న మాట! 'శరీరంలో వుండే' అని చెప్పడం ఎందుకు అంటే ప్రాణం లేక జీవం గనక పోతే ఈ శరీరం మనిషి అనబడదు! 'శవం' అంటాము. అంటే నిజమైన మనిషి ఈ శరీరంకాదు అని అర్థం. శరీరము శవము. మనిషి యొక్క నిజస్వరూపం ఆత్మ! కాబట్టి ఆత్మయే మన స్వరూపం. దీన్ని గురించిన జ్ఞానమే **'ఆత్మజ్ఞానం'**! అదే **'స్వస్వరూప-జ్ఞానం'**! - దీనిని గురించి చదవటం, వినటం, ఊహించటం కాకుండా యదార్థమైన అనుభూతితో ఈ ఆత్మను మనం దర్శించాలి! అనుభవించాలి! ఆత్మగా జీవించాలి! అట్టివారే 'జీవన్ముక్తులు' అనబడతారు. అలాకానివారందరూ జీవన్మృతులన్నమాట! అంటే బ్రతికివుండీ చచ్చినవారితో సమానం. ఎందుకంటే వారిలో పనిచేస్తున్నది శరీరమే! ఆత్మకాదు! ఎందుకంటే, వారిలో ఆత్మ ఇంకా మేలుకోలేదు కనుక!

ఇప్పుడు హిందూమతంలో 'జ్ఞానం' అంటే ఏమిటో తెలుసుకున్నాం — మనయొక్క స్వస్వరూప జ్ఞానమే ''జ్ఞానం'' అని! మరి ఈ జ్ఞానం లభించేదెలాగ? దానిని సంపాదించే మార్గమేది? అదే **''జ్ఞానమార్గం''**!!! హిందూమతం అనే ఆలయానికి మూడవ గోపురద్వారం ఐన ఈ 'జ్ఞానమార్గం' ఎటువంటిదో వివరిస్తాను.

కర్మ-మార్గమునకు పని, లేదా, 'కర్మ' ప్రధానము! భక్తి మార్గమునకు హృదయంలోని ప్రేమయే ప్రధానము. మరి జ్ఞానమార్గమునకు ఏది

ప్రధానం?

మనయొక్క స్వస్వరూప జ్ఞానం దేనితో కలుగుతుంది
ఇంద్రియాలవల్ల కాదు! ఎందుకంటే మన ఆత్మను ఈ కన్ను చూడలేదు
ఈ ముక్కు వాసన చూడలేదు! ఈనాలుక రుచిచూడలేదు. ఈ చె
వినలేదు! కాని ఈ కన్నుద్వారా 'చూడటం' చేస్తున్నది ఆత్మయే! చె
ముక్కు, నాలుక , వీటి ద్వారా బయటి ప్రపంచాన్ని అనుభవిస్తున్న
ఆత్మయే! అనగా ' ఆత్మ' ఇంద్రియములతో తెలియబడనిది
మనస్సుకు అందనిదీ అన్నమాట!

మనస్సుకు ఎందుకు అందదు? ఈమనస్సును పనిచేయించేదే ' ఆత్మ
గనుక! అన్నిటినీ తెలుసుకునే మనస్సు మనస్సును వెలిగించే ఆత్మన
తెలుసుకోడానికి చాలదు! కాబట్టి ఈ స్వస్వరూపజ్ఞానం ఇంద్రియములవ
మనస్సువల్లా తెలియబడదు!

మరి దేనివల్ల తెలియబడుతుంది? దీనికి ఒకే ఒక్క మార్గమున్నది
మనస్సూ, ఇంద్రియములూ బైటికి పనిచేస్తాయి. లోపలవున్న ఆత
ఇంద్రియాలనే కిటికీలద్వారా బైటి ప్రపంచాన్ని చూడగలుగుతుంది. కాని
ఇంట్లోంచి బయటి వస్తువులను చూసే ఈ కిటికీలోంచి ఆత
కనిపించదు! కాబట్టి బైటికిపనిచేసే మనస్సునూ, ఇంద్రియాలను
**లోపలివైపుకు** — అంటే ఆత్మవైపుకు తిప్పాలి! దీన్ని **'అంతర్ముఖత్వం**
అంటారు. అనగా మనస్సు అంతర్ముఖంగా అంటే లోపలివైపుక
తిరగవలెను. అప్పుడే ప్రపంచాన్ని చూడటం మానేసి **ప్రపంచాన్ని
చూస్తున్న 'ఆత్మ'ను** చూస్తాడు! తనలోకి తానుచూస్తాడు. తనలోంచి
బైటికి కాదు. ఇది 'జ్ఞానమార్గం' యొక్క విలక్షణత్వం! ఇది ఎంత
సరళమైన మార్గమో-అంత కష్టమైనది! ఎందుకంటే మనస్సుతో ఇది
తెలియబడదు. సామాన్యుడికి, అంటే మనకి, మనస్సుకంటే వేరే
దారిలేదుగదా!

ఐతే ఈ జ్ఞానం ఎలా లభిస్తుందో తెలియాలి! దీనిని 'విజ్ఞానం' అంటారు. 'విజ్ఞానం' అంటే జ్ఞానమును గూర్చిన జ్ఞానమే!

1) ఆత్మజ్ఞానంయొక్క స్వరూపము - **జ్ఞానము**

2) జ్ఞానమును తెలుసుకొనే ఆత్మ - **జ్ఞాత**

3) తెలుసుకోవలసిన జ్ఞానం - **జ్ఞేయము**

ఈ మూడింటి గురించిన జ్ఞానమే **విజ్ఞాన** మనబడును.

ఉదాహరణతో చెప్పాలంటే — ఒక వస్తువును చూడటం 'జ్ఞానము' చూచువాడు 'జ్ఞాత'! చూడబడే వస్తువు 'జ్ఞేయం! ఈ మూడూ వుంటేనే చూడటమనేది సాధ్యం. 'జ్ఞానం, జ్ఞ్యేయం, పరిజ్ఞాత' అన్న ఈ మూడింటిని గురించి భగవద్గీతలో వివరంగా ఉపదేశించాడు, శ్రీకృష్ణపరమాత్మ! అందుకే భగవద్గీత హిందూమతంపై ఒక పాఠ్యగ్రంధము.

ఈ జ్ఞానాన్నిపొందే మార్గంలో మనమూ ప్రయాణించాలంటే తీవ్రమైన పట్టుదల కావాలి! మనస్సుకు తీక్షణమైన ఏకాగ్రత కావాలి అనగా ఏ వస్తువుపై ఈ మనస్సు నిలిపితే దానిమీదే నిశ్చలంగా చలించని దీపంవలే వెలగాలి! అట్టి ఏకాగ్రతనే 'ధ్యానం' అంటారు. అట్టి నిరంతర ధ్యానాన్ని బైటి ప్రపంచంలో ఏదో ఒక వస్తువుమీద నిలపటం కాక మనయొక్క 'అంతరాత్మ' పైనే నిలపాలి!

ఇలా తీవ్రంగా కృషిచేస్తే అప్పుడు మనకు 'స్వస్వరూప జ్ఞానం' కలుగుతుంది. ఇట్టిది 'జ్ఞానమార్గం'! అంతటి 'ఏకాగ్రత' సాధించాలంటే గురువుయొక్క సహాయము అనుగ్రహమూ అవసరం. భగవంతుని కృప ముఖ్యమైన అండ! అంతేకాదు తుచ్ఛమైన చిల్లరవైన ప్రాపంచిక లాభాలపై ఈ మనస్సూ తిరుగుతున్నంతసేపూ దానికి ఏకాగ్రత రాదు! పెంటకుప్పలపై తిరిగే ఈగవంటిది ఈమనస్సు! అనేక వస్తువులపై నిత్యం

తిరుగాడుతూవుంటుంది కనుక!

కాని, అదే ఈగ వెలిగే దీపంమీద గనక వాలితే ఇక మరి రెండో వస్తువుమీద వాలటానికి అవకాశమే లేకుండా భస్మమైపోతుంది! అలాగే మనస్సు భగవంతుని యందు లేదా ఆత్మయందు లగ్నమైందా — దీపంలో వాలిన ఈగవలెనే మనస్సు నశించిపోయి 'ఆత్మజ్ఞానం' కలుగుతుంది.

ఈ ప్రత్యక్షజ్ఞానవమే ' ఆత్మజ్ఞానవము'! దానిని తెలిపేదే జ్ఞానమార్గము! మనస్సుతో చేసేచదువూ మొదలైన లౌకిక జ్ఞానము పరోక్ష జ్ఞానమే! ప్రత్యక్షజ్ఞానం కాదు!



19

# నాలుగో ద్వారం - వైరాగ్య మార్గం!

ఇది పై మార్గాలకంటే కొంచెం కష్టతరమైనది. కాని పై మూడు మార్గాలలోనూ ఇది దానంతట అది ఆటోమేటిక్‌గా లీనమయ్యేవుంది. ''వైరాగ్య'' మనగా ఏమిటి? ఈ ప్రపంచంలో బ్రతికేటప్పుడు అనేక వస్తువులు—అంటే ఇల్లు వాకిలీ, ఆస్తి బంధువులూ, గొడ్డూ గోదా ఇలా అనేకం వున్నాయి. ఈ అన్నిటిమధ్యా జీవిస్తున్నాము ఇరవై నాలుగ్గంటలునూ. ఇవే మనకు ''నిత్యం'' అని అనుకుంటాము. ఇవాళ నగలు పెట్టుకుంటాం -- ఇలాగే చస్తాం! చచ్చాక ఇవేవీ మనం పట్టుకెళ్ళం! చచ్చాక ఈనగలు మనతో పట్టుకెళ్ళం కాబట్టి నగల మీద పెట్టే ఖర్చూ, అవి సంపాదించడానికి మనం వినియోగించే ఆసక్తీ ఇదంతా కూడా ఆ సాధనమీదనే వినియోగించినట్లైతే మనకు ఎంతో టైము కలిసివస్తుంది. జీవితంలో పనికి వచ్చేది మనతో మిగిలేది ఇదే! ఇదే వివేకం! నిత్యా

నిత్య విచక్షణమే వివేకం! అంటే 'నిత్యం'గా వుండే వస్తువుయందు మనం జీవించే టైము గడిపితే ఆత్మతోపాటు ఈ సాధనకూడా వస్తుంది! అలాగాక మనమిప్పుడు చేస్తున్నట్టు అనిత్యమైన వస్తువులపైన పెడితే అంటే — ఒక బిల్డింగు కడితే! ఆ బిల్డింగు కట్టడానికి వీడు చేసే తప్పుడు పనులు ఏవైనా వుంటే **వాటి తాలూకు కర్మంతా** వీడితో కూడా వస్తుంది.

అమెరికాలో ఉపన్యాసాలలో ఒకసారి ''ఈవైరాగ్యం ఎందుకు బోధిస్తారు మీ హిందువులందరూ''? అంటే నేను చెప్పాను -- మీఅమెరికావాళ్ళకి, వైరాగ్యం అంటే ఏమిటో దానివిలువ తెలిసేలా ఒక ఉదాహరణ ఇస్తానన్నాను.

ఇద్దరు అమెరికన్లు ఒకసారి విదేశాలకువెళ్ళారు. అరబ్ దేశాలకో ఎక్కడికో — అమెరికానుండి వెళ్ళి, ఎక్కువ డబ్బు సంపాయించేసి రావాలని! అక్కడ బాగా బంగారం దొరుకుతుందన్నవమాట! అట్లాంటిచోటికి వెళ్ళిం తరువాత వాళ్ళు ఐదారు సంవత్సరాలలో కోట్లకొద్దీ రెండుచేతులా డబ్బు సంపాయించారు! ఈ సంపాయించినది ఒకడేంచేశాడంటే -- ఆ సంపాదనతో ఇళ్ళు, ఆస్తి, భూమి ఇలా ఆచుట్టుప్రక్కల వుండే జిల్లానంతా కొనేశాడు! వాడు వస్తువులూ, వాహనాలూ అన్నీకొనేసి పెద్ద 'బిజినెస్' పెట్టాడు. దానితో కాపిటల్గా దాన్ని వృద్ధిచేస్తున్నాడు.

ఇంకొకడేం చేశాడంటే ఈ డబ్బంతా నగదుక్రింద అంటే కరెన్సీగా వుంటే మారిపోవుచ్చని సుద్ధ బంగారంగా మార్చుకున్నాడు. దాన్ని తన దగ్గరే అట్టే పెట్టుకొన్నాడు.

కొన్నాళ్ళకి యుద్ధం వచ్చింది -- 'సడన్' గా విదేశస్తులంతా వెళ్ళిపోవాలి అని నోటీసు ఇచ్చారు. కోటీశ్వరులప్పుడు ఏమిచేస్తారు? ఇల్లూవాకిలీ కొన్నవాళ్ళు? ''అవన్నీ పట్టుకెళ్ళడానికి వీల్లేదు'' అన్నారు! ఆస్తులు కొన్నవాడివన్నీ ఇక్కడ స్థిరాస్తులే గనుక భూమ్మీదే ఇరుక్కుపోయాయి!

వాడు కట్టుబట్టలతో ఆ దేశం విడిచి అయిష్టంగానే ఏడుస్తూ వెళ్ళవలసి వచ్చింది. ఇక రెండవవాడు — వాడి సంపాదనతో బంగారం కొన్నాడుగదా! దాన్ని మూటకట్టుకొని తన కూడా పట్టుకెళ్ళాడు. ఎందుకంటే ఫారిన్ ఎక్స్ఛేంజిలో ఏ దేశానికి వెళ్ళినా ఈ బంగారం పనిచేస్తుందిగనుక!

ఈ ఇద్దరిలో ఎవరు తెలివైనవాళ్ళు? అని అడిగాను. సహజంగానే 'బంగారం తీసుకెళ్ళినవాడు తెలివైనవాడు'. ఇళ్ళూ వాకిళ్ళమీద పెట్టుబడి పెట్టినవాడు తెలివి తక్కువవాడు — అన్నారు.

నిజానికి నేనుచెప్పిన కథలో ఈ రెండు దేశాల్లోనూ, ఒకటి భూలోకం, ఒకటి పైలోకం! భూలోకంలో (విదేశంలో) పెట్టుబడి పెట్టినప్పుడు పైలోకానికి (స్వదేశానికి) వెళ్ళవలసి వచ్చినపుడు తనతో తీసుకెళ్ళలేనివాడు తెలివి తక్కువవాడు. బంగారం అనగా భక్తి ''జ్ఞానం'' వైరాగ్యం -- వీనిమీదనే ఇరవై నాలుగ్గంటలూ ధ్యానించి మానసికంగా బయటివన్నీ 'పెట్టుబడి' పెట్టడమేగా — వైరాగ్యమంటే?

తక్కిన వస్తువులన్నీ విడిచిపెట్టి పోవాల్సినవే! తనతో పట్టుకెళ్ళేందుకు వీలయ్యేవికావు! జ్ఞానం భక్తి తనతో వస్తాయి కనుక బయటి సుఖాలు, స్వార్థాలు తనకంటే చిన్నవి, — ఏవేం నేర్చుకోవాలో అవన్నీ నేర్చేసుకుంటాడన్నమాట ఈ భూమ్మీద ఉండగానే, తన యిరవై నాలుగు గంటల టైమూ, వ్యర్థం చెయ్యకుండా! ఈ కృషి అంతా దానికోసమే! చదువంతా దాని కోసమే! బ్రతుకంతా దానికోసమే — సర్వీసు అంతా దానికోసమే!! ఎవరిని చూపినా ఎవరితో మాట్లాడినా, ఏ పనిచేసినా — తాను బ్రతికివుండగా తనతో మిగిలేవి ఏమి కూర్చుకోగలడో -- అవి దానియందే నిత్యం ధ్యాసగలవాడు ఆవస్తువును తాను వెళ్ళేటప్పుడు పట్టుకెళ్ళగలడు శరీరం వదిలేసివెళ్ళినా — బైటి యిల్లూ వాకిలీ, భార్యనో భర్తనో వదిలేసినా వాటిమీద జీవితం అంతా వేస్టుచెయ్యలేదు, గనుక నష్టపోడు!

కాని టైమంతా డబ్బునందూ, ఆస్తుల సంపాదనలోనూ ఖర్చు పెట్టేవాడేమి చేస్తాడు? చివరి టైములో — అన్నీపోయి ఫకీరౌతాడు! ఎందుకంటే వీడు జ్ఞానం సంపాదించలేదు! వైరాగ్యం సంపాదించలేదు! యిన్‌కంటాక్సు వాళ్ళ భయం—నల్లడబ్బు వెల్లడి అవుతుందన్న భయం! యిది వీడిజీవితం! యిన్నిరకాల భయాలతో బాధలతో — ఈ లోకం వదిలి, మరణించి నరకలోకం చేరతాడు.

అంటే జీవితంలో వున్న టైమంతా భక్తి జ్ఞాన వైరాగ్యాలపై వెచ్చించి, యిక్కడ ఫకీరులా బ్రతికినవాడు అక్కడ అమీర్ అవుతాడు! రాజాధిరాజులా తాను సంపాదించిన యోగశక్తితో దివ్యస్వరూపుడై పైన వెలుగుతాడు! ఇద్దరిలో యిందులో ఎవడు తెలివైనవాడు?

అంటే చెప్పేదేమిటంటే ఇలా వైరాగ్యం ఎందుకు బోధిస్తుంది ఈ హిందూమతం అంటే — ఈ ప్రపంచంలో మనిషి తనతో పట్టుకెళ్ళడానికి వీల్లేనిది సంపాయించేందుకే! ఈటైమంతా ఖర్చుపెట్టుకొంటే తాను వెంటతీసుకెళ్ళగలిగేది సంపాయించేదెప్పుడు? శరీరాన్ని చివరికి తనపేరునూ, కూడా పదోరోజుతో సంబంధాన్ని వదులుకొని పోయేటప్పుడు వెంటనంటి వచ్చేవి -- తాను చేసిన పుణ్యపాపాలే!

ఎవరైతే వైరాగ్యం కలిగి అనిత్యమైన వస్తువులయందు టైము (Time) వృధాజేయకుండా నిత్యమైన వస్తువునందే ఏకాగ్రత పెట్టి జీవితం బాగుచేసుకోవాలనుకుంటాడో వాడికి ఒక్కటే మార్గం! అదే నిస్వార్థంగా సేవ చెయ్యటం, యోగభ్యాసం, జ్ఞాన సముపార్జన పుణ్యశ్రవణ కీర్తన -- ఋషులు వాళ్ళందరూ చెప్పిన భారత భాగవతాది గ్రంధాలలో చెప్పిన జ్ఞానము -- భగవత్ చింతన, అతని మహిమనుగూర్చిన వర్ణన -- వీటితో ఎవడైతే తన కాలం అంతా గడుపుతాడో వాడు వైరాగ్యవంతుడు! ఇదే నిత్యమైన జ్ఞానం -- తక్కినవి అన్నీ అనిత్యమైనవి. ఇదే వైరాగ్యమార్గం.

యిది హిందూమతం అనే గుడికి గల నాలుగు గోపుర ద్వారాలలో చివరిది!

గుడికివున్న ఈ నాలుగు మార్గాలూ ఎక్కడికి తీసుకొనివెళ్తాయి? అంటే, భగవంతుడు అనే గర్భాలయంలోకి తీసుకొని వెళతాయి!! ఈ ఆలయం మధ్యగా పరబ్రహ్మ వెలుగొందుతూంటాడు.

ఈ ఆలయంలోకి ఈ నాలుగు ద్వారాలలో దేనిలోనైనా ప్రవేశించవచ్చు! ఇదే భగవద్గీత చెప్పే హిందూమతం యొక్క సంగ్రహస్వరూపం!



## 20

# హిందూమతం తెలిపే – "సృష్టిక్రమం"

హిందూమతం, అన్నిమతాలవంటిది కాదని — ఇతర మతాలన్నిటిలోనూ లేని ప్రత్యేకమైన అనేక అంశాలలోని లక్షణాల హిందూమతంలోవున్న వేమిటో ఇంతకుముందే గమనించాము.

ఒక విధంగా చూస్తే ఈ **'హిందూమతం'** — ఒక 'సైన్సు' (Science) వంటిది! అంటే సైన్సుకున్న లక్షణాలెన్నో ఉన్నాయి దీనికి. అంతే కాదు! అనేక శాస్త్రములకు (Science)సైన్సులకు పుట్టుక స్థానం ఈ హిందూమతమే!

## సైన్సు వంటి – మతం

ఈనాడు సైన్సులుగా భావించే ''గణితం'' (Mathematics) ఆయుర్వేదం (Indian Medicine) రసాయన శాస్త్రం

(Chemistry) అణుసిద్ధాంతం(Atomic Physics), జ్యోతిషం (Astronomy) భూగోళం (Geography) వంటివి హిందూమతానికి అంగభూతములైన ఎన్నో ''శాస్త్రములు'' (Sciences) గా వేదం నుంచే పుట్టాయి! ఈనాటి మతాలైన '' ఇస్లాము'' ''క్రిస్టియానిటీ'' బౌద్ధమతాలకు స్థాపకులైన ప్రవక్తలు ఎవ్వరూ పుట్టకముందే ఈ సైన్సులున్నాయి!

కాబట్టి హిందూమతాన్ని, ఒక ''మతం'' అనుకోవటం కంటే ''ప్రాచీనఋషి విజ్ఞానం'' అంతటినీ కలబోసిన (Body of Sciences) ''వేదరాశి'' అనుకోవటం సబబేమో! ఎందుకంటే ''వేదం'' అన్నమాటకు సంస్కృతంలో ''విజ్ఞానం'' (Science) అని అర్థం.

## సైన్సు లక్షణాలు :-

ఈనాడు - సైన్సు ఈ ప్రపంచం ఎలా పుట్టిందో తెలియజెప్పటానికి, కొన్ని ఊహాగానాలను (Hypothesis) చేస్తున్నది. అలా విశ్వసృష్టిని తెలపడానికి ''వైజ్ఞానిక ఊహలు'' చేసిన వారిలో 'ఫ్రెడ్ హాయిల్' (Fred Hoyle), నార్లికర్ (Narlikar), ఐన్‌స్టీన్, జోన్స్ మొదలయిన సైంటిస్టులు ప్రతిపాదించిన ఈనాటి సైన్సు సిద్ధాంతాలలాగే ఆనాటి ప్రాచీన హిందూమతానికి మూలసైంటిస్టులైన ఋషులు కూడా వేదంలో ఈసృష్టిక్రమం గురించి కొన్ని సిద్ధాంతాలను, తాము యోగంతో దర్శించిన సత్యాలనూ, మనకు అందించారు.

వేదంలో ఇవి ''నాసదీ సూక్తము'' ''పురుషసూక్తము'' '' ఆత్మసూక్తము'' ''నారాయణసూక్తము'' లలోనూ ఇంకా వ్యాసమహర్షి ప్రోక్తమైన 'పురాణ సంహిత''లలోనూ వివరించారు!! దానినే సంగ్రహించేసి ''సృష్టిక్రమం'' ను ఈనాడు మీకు అర్థం అయ్యేమాటలలో నేను తెలుగులో అందిస్తాను.

## ''సృష్టి'' – అంటే ఏమిటి?

హిందూమతం తెలిపే ఈ ''సృష్టిక్రమం'' కేవలం ఈ చర్మచక్షుస్సులతో చూసి బైటి ప్రపంచాన్ని తెలుసుకున్న ఈ భౌతిక (Materialist) దృష్టితోనేగాక ఈ జగత్తునే ఒక మానసికశక్తితో చూసి 'దివ్యదృష్టి' తో దర్శించిన సత్యాలన్నీ కలబోసిన సిద్ధాంతం!! అదేమిటో చెబుతాను!

హిందూమతంలో సృష్టిక్రమం — బైబులో వర్ణించిన ఏడురోజులలో ప్రపంచాన్ని కుమ్మరివాడు కుండలుచేసినట్లు చేసి, ఏడవరోజున భగవంతుడు నిద్రించాడనే కథ కాదు! ఈ బైటికి కన్పించే సృష్టి -- దీనికి ఆధారమైన మానసికమైన 'సృష్టి'! ఒక కవి కలం పుచ్చుకుని కాగితం మీద కావ్యం వ్రాసేముందు మనస్సులో ఆ కావ్యాన్ని ఊహించుకుచేసే మానసిక సృష్టివంటిది.

ఇలా, సృష్టి రెండుదశలుగా చెప్పబడివున్నది. 1) ''సర్గము'' 2) ''ప్రతి సర్గము''. ''ప్రతి సర్గము'' అంటే ఈకన్పించే మానవులు, జంతుజాలము, వృక్షజాలము, పర్వతాలు, నదులు, సముద్రములు వీటిసృష్టి! వీటికి ముందుగా జరగవలసిన ''తెరవెనుక భాగవతం'' ''సర్గము''!!

అంటే ఈజీవరాశి సృష్టింపబడాలంటే దానికి ముందు ఈ భూగోళం ఉండాలి. అంతకుముందు సూర్యాది గ్రహగోళాల సృష్టి -- వాటికన్న ముందు పదార్థం సృష్టి, కాలంయొక్క సృష్టి, పంచభూతముల సృష్టి వీటి అన్నిటికీ ముందు ఈ విశ్వం అంతా శరీరంగాగల ''విశ్వాత్మ'' (Universal Mind) ఎలా పుట్టిందో - ఇన్ని వివరాలు వర్ణించబడి వున్నాయి. హిందూమతంలోని సృష్టిక్రమ వర్ణనలో — దీనికీ బైబిల్‌లో సృష్టికీ బోలెడు తేడా. నర్సరీస్కూల్‌లో చదివే చిన్నపిల్లలకు చెప్పే

పిట్టకధ వంటిదిగా కనడుతుంది బైబులులోని సృష్టి కథ, వేదాలలోని సృష్టిక్రమంతో పోలిస్తే. అంటే మనము కళ్ళతో ఈ సృష్టిని చూసి దాని నిర్మాణాన్ని చెప్పడం కాకుండా ఈ జగత్‌నే మానసిక దృష్టితో చూసి దివ్యదృష్టితో దాని సృష్టి ఎలాజరిగిందో చూచిన వేద ఋషుల జ్ఞానమే ఈసృష్టి క్రమ వర్ణన! ఈరెండిటికీ తేడా ఒక ఉదాహరణ చెబితే తెలుస్తుంది.

## కనిపించని ''సృష్టి'' - కనిపించే సృష్టి :-

ఒక మనిషిని 'బాహ్యదృష్టితోనే' చూస్తే ఎలావుంటుందో చెప్పేది నాటి సైన్సు! ఆ మనిషి ఫొటోతీస్తే ఎలాకనిపిస్తాడో అలా వర్ణించేది సైన్సు. కాని ''**ఫోటో**''**లో పడని** మనిషి గురించి తెలిపేది యోగశక్తి, దివ్యదృష్టి!

ఒక మనిషిని చూడగానే అతని మనస్సులో ఏ ఆలోచనలున్నాయో చదివేయగలవాడు ''**యోగి**''! ఆ మనిషి ఆలోచనలేగాక అతడి స్వభావం, రోగాలు, ఇష్టాయిష్టాలు **అతను గతంలో చేసిన పనులూ**, మంచి చెడూ చెప్పటమేగాక **అతనికి జరగగల భవిష్యత్తుకూడా** చూసి చెప్పగలది ఒక ఆధ్యాత్మిక శక్తి, లేక యోగశక్తియే! ఇదంతా మనిషికి ఫొటోతీస్తే, కనిపించని మానవుని చిత్రము అనుకుంటే -- అదే విధంగా ఈ సృష్టినికూడా కంటికి కనిపించని మానసిక సృష్టి -- పైకి కనిపించే భౌతిక సృష్టికూడా తెలిపేది ''హిందూమతం'' యొక్క సృష్టిక్రమం.

ఒక మనిషి చేసిన రాతిశిల్పం వంటిది ''భౌతిక సృష్టి'' అయితే కంటికి కనిపించని సృష్టి ఆమనిషి శిల్పం చెక్కక ముందాతని మనసులో చేసే ''ఊహాచిత్రం'' వంటిదే!

రాతిశిల్పమే నిజం గాని -- అంతకుముందు శిల్పి మనస్సులో చేసే ''మానసిక - సృష్టి'' నిజం కాదు అంటే ఎంతపొరపాటవుతుందో అలాంటిదే ఈ కనిపించే ప్రపంచానికి పైలోకాలనబడే మానసికసృష్టి, లేదంటే

కూడా! ఈ దృష్టితో వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలలో ఋషులు ప్రతిపాదించిన ''సృష్టిక్రమం'' మీబుద్ధికి అందినంతవరకూ సైన్సు మాటలలో తిరిగి అందిచడానికి ప్రయత్నిస్తాను!

## సృష్టి క్రమం

ఈ సృష్టిక్రమం - నాలుగు దశలుగా దిగివస్తుంది!

1. ఈ పైకి కనిపించే జంతు, వృక్ష, మానవ, జీవసృష్టి.
2. దీనికి ఆధారభూతమైన ''సూర్య'' చంద్ర, భూగోళ, గ్రహ నక్షత్ర గోళాల సృష్టి -- రెండవది.
3. పైవన్నీ తయారయ్యే ''పదార్థం'' అణువులూ ''కాలం పంచభూతాలు, ''ప్రాణము'' వంటి ''**మూల సృష్టి**'' మూడోది!
4. పై మూడు ఈ కనిపించే ప్రపంచం యొక్క భౌతిక సృష్టి!

దీన్ని ''సర్గము'' అంటారు. ఇదిగాక, ఇంకొక సృష్టి మానవుని అంతరాత్మ. జంతువుల జీవుల అంతరాత్మ ''జీవాత్మల సృష్టి'' కూడా ఉన్నది. ఈ జీవాత్మల లేక సృష్టికి పైన ఉండే దేవతల సృష్టి జీవాత్మల ''జన్మల'' ద్వారా పదార్థంలో పుట్టి **భూమ్మీద జరిగే చరిత్రగా నడిచే కథ** — ఇదంతా ''ప్రతి సర్గము'' అనబడే సృష్టి! ఈ ''సర్గమూ ప్రతి సర్గమూ'' రెండు కూడా ఏమిటో తెలిస్తేనే కాని ఈ సృష్టిక్రమం పూర్తిగా అర్థం కాదు! ఇలా వివరంగా హిందూమతం తెలిసే ''సృష్టిక్రమం'' యిప్పుడు విశదంగా పరిశీలిద్దాము.

## సర్గం - ప్రతి సర్గము!

అసలు ఆత్మకు ఈ జన్మ పరంపరలు ఎలావస్తాయా అన్న విషయం గురించి తెలియాలంటే ఈ బ్రహ్మాండ నిర్మాణం గురించీ, అందులో ఈ

విశ్వంయొక్క సృష్టిక్రమం గురించీ పరిపూర్ణమైన అవగాహన (Exact Knowledge) ఉంటేనే గాని ఈ విషయాల జోలికే పోలేరెవ్వరూ ముందుగా గ్రహించాల్సిన ముఖ్యవిషయం ఇది.

ఈ సృష్టికి మొదటగా వచ్చే ఆవిర్భావం విశ్వపురుషుని 'ఆవిర్భావం' అతడినే **విరాట్పురుషుడంటారు.** ఈ కనబడే ప్రపంచం అంతా ఆయన శరీరంలో ఉంటుంది. ఈ విరాట్పురుషుని శరీరం విశ్వాన్ని 'చొక్కా' లాగా ధరించి మనక్కనిపించే ''సృష్టి'' (Creation)గా అవుతుంది. ఈ భగవంతుని 'పదములు' అనే భౌతిక ప్రపంచంలో అంటే ఉన్నదంతా విరాట్పురుషుని యొక్క పాదాలే!

అన్నిటికంటే సూక్ష్మమైనది 'సత్యలోకం' దాని క్రిందిది స్వర్గం అందువల్ల అన్నిటికంటే మెటీరియల్ (Material) గా (భౌతికంగా) ఉండేది ''భూలోకం'' ! అందుకే విరాట్పురుషుని పాదాలు భూమ్మీద ఉంటాయి శిరస్సు సత్యలోకము. ఈ మధ్య బ్రహ్మాండం అంతానిండి ఆయన శరీరంలోని ఏడుధాతువుల్లోనూ విశ్వంలోని ఏడులోకాలుంటాయి. అవే, అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ శరీరాలు! ఇవన్నీ మనలో ఎలా వున్నాయో, సరిగ్గా ప్రతిదానికి సంబంధించిన★'లోకాలు' కూడా ఆయన శరీరంలో భాగాలే ! అవి, మనకు లోకాలవుతాయి.

## ఆకాశమే - మనస్సు

ఆయన మనస్సు మనకు ఆకాశమల్లే కనిపిస్తుంది. ఆయన యొక్క శ్వాస ఇక్కడ మనకి వాయువల్లే కనిపిస్తుంది ! అతని శరీరంలోని ధాతువులు, ఎముకలు ఘనీభవించిన పదార్థాలువంటి లవణాలు, ఖనిజాలు

---

★''నాభ్యా ఆసీదంతరిక్షం పద్భ్యాం భూమిర్దిశః శ్రోతాత్ తథా లోకాన్ అకల్పయన్'' - వేదంలో పురుషసూక్తం

మొదలైనవి ధాతువులు: అవి ఖనిజాలు (Iron, Metals, rocks) లోకాలుగా పదార్థరూపంలో జరిగే సృష్టంతా కూడా మన శరీరంలో వున్నదే !

శరీరంలోని రక్తనాళాల్లో ప్రవహించే రక్తం విరాట్పురుషుడి శరీరంలోనూ నదీనదాల రూపంలో ఉంది. ఇవి మనం పైనుంచి విమానంలో (Plane) లో నుంచి చూస్తే మన చేతిమీద రక్తనాళాలు ఎలాగ కన్పిస్తాయో — సరిగ్గా నదులూ అలాగే రకనిపిస్తాయి. అది పెద్దదికనుక మనం వూహించలేము.

అల్లానే మన శరీరంలో అవయవాలు ఏయే పనులు చేస్తాయో రోమాలు ఎలా అడుగున ఉండే ధాతువులను చెమటను ఆవిరిచేసి తీస్తాయో -- అట్లాగే చెట్లు, వృక్షాలు ! అవి భూమిలోని నీటిని ఆవిరిగా చేసి సూక్ష్మరూపంలో రోమాలుచేసే పనులు -- చేస్తాయి.

మనం పగలు -- రాత్రి అనేటటువంటి కాలవిభాగాలు అంటే 'అహోరాత్రాలు' ఆవిరాట్పురుషుడి కనురెప్పపాట్లు ! రాత్రి పనిచేసే చంద్రుడు, పగలు పనిచేసే సూర్యుడు ఆయనకు నేత్రములు. యావత్ నక్షత్రమండలమూ ఆయన శరీరంలో వుండే రోమకూపాలు. 'నక్షత్రాణి-రూపం' అని చెబుతారు ముఖం అగ్ని ! మృత్యువు ఆయన దంతములు, దిక్కులు చెవులు, అనంతమైన కాల వాహినియే ఆయన ఆయుః ప్రమాణం.

విరాట్పురుషుని ఆలోచనలే సంకల్పాలై ఈ ప్రపంచానికి శాసనమవుతాయి. అతని మనస్సులో ఏమి తోస్తుందో ఇక్కడ అదే జరుగుతుంది.

## దేవతలు - విరాట్పురుషుని శరీరంలోని అవయవాలు :-

మిగతా దేవతలందరూ ఆయన శరీరావయవాలై పనిచేస్తారు. శరీరంలో పంచ వాయువులు 'ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన సమానములుగా ఉన్నట్లే అతని శరీరంలో సప్తవాయువులుంటాయి. అవే సప్తమరుత్తులు.

మన శ రీరంలో ఏడు చక్రాలుంటాయి. ఈ చక్రాలు ఒక్కొక్కటీ విచ్చుకుని (Open) అయినప్పుడు ఒకోరకమైన 'ప్రజ్ఞ' లేక **జ్ఞానం** కలుగుతుంది. ఆ చక్రాల అడుగున **'కుండలినీ'-శక్తి** ఉన్నట్లే విరాట్పురుషుడిలోనూ పై ఏడులోకాలు వాటి అడుగున **భూమి క్రిందగా శేషుడుంటాడు.**

మనశరీరంలో పైన 'సహస్రారం' ఉన్నట్లే వాడికి పైన 'సహస్ర కమలం' లో బ్రహ్మలోకం ఉంటుంది! దాని అడుగున అమృతకలశం ఉంటుంది. దానిలోనుండే సహస్రార చక్రము స్రవించినప్పుడు దీనిమీద దేవతలు బ్రతుకుతూవుంటారు.

మన శరీరంలోనూ థైరాయిడ్, పిట్యూటరీ గ్రంధులు (గ్లాండ్సు) స్రవిస్తూ, శరీరంలో మార్పులు, పనులు నిర్వహిస్తుంటాయి. ఇదేపనిని ఆయా దేవతలు నిర్వహిస్తారు. ఈ విశ్వానికి ఆధారమైనవాడు! వాడి శరీరంలోని ఏ అవయవం కదలాలన్నా ఆయన మనస్సునుంచి ఆజ్ఞ రావలసిందే. ఎవరు ఏం చెయ్యాలన్నది ఆయన సంకల్పం వల్లనే జరుగుతుంది.

మనకి పైకి కనిపించటం మాత్రం మన శరీరంలో ఏ అవయవానికి ఆ అవయవమే విడిగా పనిచేసినట్లు కనిపిస్తుంది. అట్లాగే ప్రపంచంలో ఏ దేవతకా దేవత విరాట్ పురుషునిలో విడిగా పనిచేసినట్లు కనిపిస్తాడు. అట్లా ఒకదేవతకి మరోదేవతకి మధ్యనున్న సంధానం 'కనెక్షన్' మనకు కనబడదు! కానికాళ్ళకి సంకల్ప సిద్ధివల్ల ఆ 'కనెక్షన్' కలుగుతుంది.



*

21

# "కాలం" - యొక్క సృష్టి!

బైటికి కనిపించే భౌతిక సృష్టికి ముందుగా అనేక స్థాయిలలో రకరకాలుగా సృష్టి జరిగింది. అంటే ఈ సృష్టి మనకు ఇప్పుడు కనిపించే ఈ స్థూలరూపం ధరించేముందు అనేక దశలుగా, సూక్ష్మలోకాలలో సృష్టినడవాలి! వాటి సృష్టిజరగాలి.

దీనికి సరిగ్గా ఉదాహరణ ఇవ్వాలంటే ఎట్లావుంటుందంటే ఒక శిల్పి శిల్పం చెక్కడంలాంటిది. బైటజరిగే సృష్టిలాంటిది శిల్పము. సరిగ్గా మనస్సులో ఊహించుకోవటం మొదటి దశ!

అలా మనస్సులో ఊహించుకొన్న శిల్పాన్ని పేపరుమీద బొమ్మలా వేసి ఆ Details Workout చేస్తారు! ఈ సృష్టిక్రమంలో అది రెండవదశ!

ఆ తరువాత బొమ్మను ''డిజైన్''లో వేసిందానికి పరికరాలు అంటే సిమెంటూ, రాయి మొదలైనవి కూర్చుకోవటం — మూడవ దశ! ఇందులో ఏవేవి ఎక్కడెక్కడవుండాలి అనేది నాలుగవ దశ! తరువాత పూర్తిగా తయారయిన శిల్పానికి ఎవరెవరు ఏ పని చెయ్యాలి? ఎవరు

రాయి తీసుకు రావాలి? ఎవరెవరు ఏ భాగాలు చేస్తే పని(work) అవుతుందో అలాగ, పని విభాగం(work division) చెయ్యాలి! ఆ తరువాత పూర్తివిగ్రహం తయారవటం మన, ఈ **భౌతిక సృష్టి**! అలాగే ఈ జగత్తు సృష్టికూడా అటువంటిదే! ఈ ప్రపంచం అనగా ఈ మానవశరీరం తయారవడానికి కావలసిన వస్తువులను పంచభూతాలతో సృష్టించబడే ముందే **లోపల జీవుడిని** సృష్టించాలి!

ఈ **జీవాత్మ**యొక్క సృష్టి, భౌతిక సృష్టికంటే ముందు జరగాలి! ఆ ఆత్మని శరీరంలో పెట్టేముందు బైట శరీరం జడమయమైన పదార్థంతో తయారవుతుంది! ఆత్మకూ, శరీరానికీ, మనస్సుకూ 'లింకు' మానసికమైన వస్తువు! ఈ రెండింటికి మధ్య 'కనెక్షన్' వుండాలి. ఆత్మ సరాసరి, ఈ పదార్థాన్ని తానుగా కదపలేదు. ఈ రెండింటికి మధ్య కలిపే-పరికరాలు వుండాలి. ఆత్మకీ శరీరానికీ మధ్యవున్న - పరికరాలు ''మనస్సు'', ''ప్రాణం''! అంటే ఎనర్జీ ''శక్తి'' పవర్(Power). **ఈ శక్తితో మనస్సు ఈ పదార్థాన్ని కదిలిస్తుంది!** 'మనస్సుకీ' - పదార్థానికీ (Matter)మధ్య ప్రాణం వుంటుంది, గుఱ్ఱానికి, రౌతుకి మధ్య కనెక్షన్ కళ్ళెం వున్నట్టు! రౌతుయొక్క సంకల్పం గుఱ్ఱానికి అర్థమయ్యేటట్టు! **వీడి భాష** (Language)వేరు! **గుఱ్ఱం భాష** (Language)వేరు! వీడి మనస్సు ఉపయోగించే భాషని గుఱ్ఱం భాష(Language)లోకి అనువాదం Translate చేస్తే, ఆ భాష **శరీరానికి** అర్థమవుతుంది! ''కుడి వైపుకు వెళ్ళు'' అని నోటితో చెప్పితే గుర్రానికి, అంటే శరీరానికి, అర్థం అవదు! నరాల ద్వారా నోటి ద్వారా అలా కళ్ళెం లాగినట్లు లాగితే ప్రాణ శక్తికి 'తెలిసి' — అప్పుడు కాని అర్థం కాదు! అప్పుడు **ఆత్మ** యిచ్చే ఆజ్ఞలకు — **శరీరం** కదులుతుంది.

మనం మనస్సుతో ఊరికే సంకల్పించగానే శరీరము నడవదు! ఎట్లా నడుస్తుంది? పక్షవాతంలాంటి రోగాలొచ్చి ఈ మధ్యనున్న మెకానిజం

పాడైపోతేనే మధ్యనుండి అలా ఈ పరికరాలు పాడైపోవడం వల్లనే, అందువల్ల వైద్యంతో నివృత్తి(Rectify) కావు! శరీరంలో వున్నవి కావు ఇవి, అందువల్ల మెడికల్ సైన్సులో వీటిపని ఏమీ అర్థంఅవదు చాలామందికి! శరీరంలో వుండే **పదార్థం-ప్రాణశక్తి,** ఈ శక్తులు రెండూ రెండు రకాలు! ఒకటి కరంటు, రెండు Magnetism కుర్చీలు మొదలైన వాటిని కదిలించటం, లాగటానికి ఉపయోగించేది భౌతికశక్తి (Mechanical Power) 'జడశక్తి' అంటారు, అంటే **భౌతికమైన శక్తి,** (build force mechanical energy) దానికి **జ్ఞానముండదు.** రోడ్డురోలర్‌ని ఇంజన్ లాగినప్పుడు ఉపయోగించేది — ఈ **భౌతికమైన శక్తే!** దాని వెనకాల చైతన్యవంతమైన ప్రాణశక్తి గనక వుంటే అది **'జ్ఞానవంతమైన శక్తి'** (Conscious Power Mental energy) దీనిలో (ప్రాణశక్తిలో) సగంజ్ఞానం సగంజడత్వం రెండూ వుంటాయి.

మూడవది పూర్తి మానసికశక్తి! దాని వెనకాలవుండే ఆత్మకీ ఆలోచనలకీ మధ్య వుండేది **'సంకల్పశక్తి'** అదే **బుద్ధి!**

ఈ మూడూ తేడా తెలియాలి! మనం ముందుగా ఒకప్లాన్ చేసుకొని దాన్ని ఆలోచనలోకి తెచ్చుకోవాలి. అప్పుడది ఎలా పని చేస్తుంది? ఆలోచన దిగివచ్చి అది వరుసగా ప్రాణశక్తిగా, ఆలోచనల్లోంచి నరాలలోకి ప్రవహిస్తుంది. ఈ నరాల్లో వుండే 'జడశక్తి' **ఈ స్థూల శరీరాన్ని** కదుపుతుంది — ఇవి దాని దశలు (Stages)!

ఈ విశ్వంలాగే ఒక నాలుగంతస్థుల 'బిల్డింగ్' లాంటి ది మన దేహం. అంటే, పై అంతస్థులో 'ఆత్మ' తరువాత అంతస్థు పంచభూతాలలో ఒక దానిపై నొకటి పొరలు (Layers) గా ఏర్పడి, ఆత్మ మనస్సుతో కరిగిపోతుంది. కాని సిమెంటుతో చే సినది కదలని బిల్డింగ్ (Building) ఇది. **కదిలే బిల్డింగ్** (Building) అంటే ఏ జాయింట్‌కు ఆ జాయింట్ కీలు కీలూ, కదలాలి! నడవాలి! **ఆలోచించాలి!** అంటే,

చైతన్యమయమైన బిల్డింగు, ఈ శరీరం! అట్లాగే ఈ ప్రపంచం **కూడా**

భౌతిక పదార్థంతో నిండిన పంచ భూతాదులతో, కదిలే బిల్డింగు ఈ సృష్టి అని తెలుసుకోవాలి. ఈ పంచ భూతాలను ముందుగా ఏ ఆకారంలో నిర్మాణం చెయ్యాలి? ఇటుకలు మొదలైన వాటిని ఏ ఆకారంలో పేర్చి వుంచుకోవాలి? దానియొక్క 'ప్లాను' (Plan) వుందే— దాని పేరే 'విశ్వ కర్మ'! **'విశ్వాకారం'** (Universal Plan) దీని ఆధారంతో వచ్చేదే **పదార్థంతో చేసిన ఈ ప్రపంచం!**

ఇది విశ్వం - ప్లాను (World Plan). పంచ భూతాలను ఒక విశ్వంగా నిర్మించాలంటే దానికి ఒక **'విశ్వాకారం'** వుండాలి. ఈ పదార్థమనే వస్తువును ప్రపంచంగా ఒక ఆకారంలోకి నిర్మించాలంటే దానికి 'విశ్వాత్మ' మనస్సులో — ముందే ''ప్లాన్'' కావాలి! ఆ ప్లాన్‌ది **'విశ్వాకారం'** అంటారు.

ఈ ప్లాన్ ఒక్కటే కాకుండా ఈ మానసికమైన 'ఊహా-ప్లాను' (Thought - Form) తయారు చేసింతరువాత ఈ ప్రపంచంయొక్క స్థూల శరీరం (ఫిజికల్ బాడీ) నిర్మాణమయ్యే లోపల ముందుగా, దానికో విశ్వాత్మ కావాలి! దాన్నే విరాట్ పురుషుడుని ఈశ్వరుడని విశ్వపురుషుడని అనవచ్చు.

ఆ 'ఈశ్వరుడు' యొక్క 'మూర్తి' నిర్మాణం జరిగే చోటుకి గనక మనం పైకి ధ్యానంలో పోగలిగితే ఈ ఈశ్వరుడి నిర్మాణమైనచోట దాని సాక్షాత్కారం — ఆవిష్కారం జరుగుతుంది.

ఎవరీ నిర్మాణం చేసేది? - అంటే **తనంతట తానే** నిర్మాణమవుతాడు! అదే **'ఆవిష్కారం' లేక ఆకాశంలో 'ప్రత్యక్షం' అవటం!** అంటే ఒక ఆకారం ధరించిన ఈ ప్రపంచానికి పరిపాలించే మనస్సుగా ఏర్పడతాడు.

అంటే ప్రపంచానికి ఉన్నట్టి జీవచైతన్యం, ప్రాణ చైతన్యం కేవలం ఒక

'ప్లాన్' (Plan)గా మాత్రమే కాకుండా ప్రపంచానికి ఆత్మకూడా కావాలి మన శరీరానికి 'ఆత్మ' ఎటువంటిదో అదేవిధంగా ఈ ప్రపంచాని ''నేను'' అయిన విశ్వాత్మయే ఈ **''విరాట్-పురుషుడు''**!!

అట్లాగే మన శరీరానికి ఈ మనస్సు ఎటువంటిదో ఈ ప్రపంచ అంతటికీ ''బ్రహ్మము'' అట్లాగ! ఆత్మ డైరక్టుగా కార్యక్రమం ప్రకార పనిచేయటానికి **క్రిందికి రాదు**. ఒక పనిముట్టు కావాలి! అదే 'మనస్సు'తో ఆ ప్లాను చేసేవాడు బ్రహ్మ దేవుడు.

ఈ మనస్సుకు ఎప్పుడేం జరగాలో దాన్ని అంచెలుగా ప్లాన్ (Plan)చేసి, దశలు(stages)క్రింద క్రమంతో చేసే పనినే - **'సృష్టి - క్రమం'** అన్నారు ఋషీశ్వరులు.

ఇది ఒక్కరోజు పనికాదు. ఇది నెమ్మదిగా వృద్ధి (Develop) అవుతుంది. తల్లి కడుపులో పిండంలాగ! పిల్లవాడు పుడతాడు, పుట్టి భూమిమీద, పడటానికి తొమ్మిది నెలలు పట్టినట్టుగానే ఈ సృష్టి నిర్మాణంకూడా అంతే. పూర్తిగా ఈ విశ్వం ఒక ఆకారంగా తయారయి నిర్మాణం పూర్తి అవడానికి ఒక ''క్రమం'' (Order) వుంటుంది.

అంటే ఈ క్రమాన్ని కాలంలాగా Time Series గా Sequence లో ఏర్పరిచేవాడే, **'కాలపురుషుడు'**! బ్రహ్మదేవుని క్రింద కాలపురుషుడు ఉంటాడు! ఇతడే **కాలాత్మ!**

### ★'కాలాత్మా, దినకృత్....'

ఈ 'కాలపురుషుడు' సూర్యుడికి అంతరాత్మ! ఈ విశ్వ సూర్యుని లోంచి పుట్టే ఎలక్ట్రిసిటీ మాగ్నటిజమ్, కరెంట్‌వల్లా, తేజస్సువల్లా **'ప్రాణశక్తి'** పుట్టుతోంది! ఆ విశ్వ ప్రాణశక్తి వల్లనే ఇతర గ్రహాలకి శక్తి వస్తుంది. అవి చుట్టూ తిరుగుతుంటాయి. అంటే అప్పుడు మనం 'గ్రైండరు'(Grinder) లో గాని రుబ్బు రోలులో గాని పప్పు రుబ్బినట్లే

పదార్థమయ పంచభూతాలను 'రుబ్బి' సరైన పాకానికి వచ్చేలాగ తయారు చేసుకొస్తాయి ఈ గ్రహాలు!

జడంగా బండల్లా ఉన్న గ్రహాలయొక్క పదార్థములోనుంచి సుస్నిగ్ధ శరీరాలెలా తయారవుతాయి? ఈ గ్రైండరులాగ గ్రహాలు తిరిగి గాళ్ళను పిండి కొట్టి నీళ్ళు కలిపి 'పాకం'గా తయారు చేయాలి — ఇలా పదార్థాన్ని 'పరిపాకం' చేసేటువంటి డ్యూటీ - ఈ గ్రహమండలానిదే!

బియ్యం వేసి నీళ్ళుపోసి వుడకపెట్టి దాన్ని ప్రాణశక్తితో పచనం చేసి 'జీవశక్తి' గా తయారు చెయ్యవచ్చు! దానికి గ్రహమండల కేంద్రం (Centre) లోని అలా పదార్థాన్ని జీర్ణించి పచనం చేసే అధిష్టాన దేవత సూర్యుడు! ఈ అంతటినీ చూస్తూ వుంటాడు. ప్రాణులను నిర్మించిన తరువాత కూడా వారి శరీరాలలోకి 'ఆత్మ'గా దిగి అంతర్యామిగా ఇదేక్రమం జరుగుతోందా? లేదా? అని చూసుకుంటాడు.

## మనలోని –''కాలం''

ప్రతివాడి శరీరంలోను ఈ నవ గ్రహాలు, సూర్యుడూ, వాచీకి 'పెద్దముల్లు', 'చిన్నముల్లులు' ఉన్నట్లే ప్రతివాడి శరీరంలోను 'ఈ సూర్యుడు' 'గ్రహమండలాలూ' 'షట్చక్రాలు' సహస్రారం కలిపి ఏర్పాటు చేసి దానిని విడిచి పెడతారు.

**ప్రతివాడు ఒక 'వాచీ'** — అనగా టైము లేక, ఆయుష్షును కొలిచే యంత్రము (చిత్రం)! ప్రపంచంలో బైట పదార్థాలను పక్వంచేసి పంచ భూతాలను శరీర పదార్థాలక్రింద మార్చినట్లే అంటే 'పచనం' చేసినట్లే మన ఈ శరీరంలోకూడా మనిషికి తెలియకుండా (Solids, liquids, gases) గట్టిగా వుండే ఘనపదార్థం, ద్రవపదార్థమూ, వాయుస్థితి అనే అయిదు రకాల ఆహారాల్ని, అయిదు రకాల పదార్థములను

భుజిస్తుంది. 'పచమ్యాన్నం చతుర్విధం' అని గీత చెప్పినట్లుగా మన శరీరం ఘనాన్ని - మాంసం క్రింద, జలాన్ని — రక్తం క్రింద మారుస్తూ - శ్వాసనేమో ఊపిరి లేక 'ప్రాణ - శక్తి' క్రింద తయారుచేసే 'ఫ్యాక్టరీ' ఇది! దాంతో పని చేసే ఏడు చక్రాలున్నూ ఈ 'కరెంటు' (ప్రాణశక్తి)తో పనిచేస్తాయి! దీనికి శ్వాస ఊపిరితిత్తులు కొలిమితిత్తిగా పచనం చేసే 'ఇంధనం'!

**ఏడంతస్థుల్లో ఏడు లోకాలు :** ఏడంతస్థుల బిల్డింగు ఈ శరీరం - అది ఇంకో పెద్ద ఏడంతస్థుల ఊరిలో కట్టివుంది. యీ ఏడంతస్థుల ఊరు బ్రహ్మాండం! దీని ఏడంతస్థులకూ దాని ఏడంతస్థులకూ సంబంధం — ఒక 'కనెక్షన్' వుంటుంది.

## పైలోకాలకు 7-యోగచక్రాల 'లింకు':

ఎలా వుంటుంది? అంటే ఇది, తాడుతో కట్టినట్టుగా కంటికి కనిపించే 'కనెక్షన్' కాదు! పెద్ద హోటల్‌కెళ్లినప్పుడు ఏ అంతస్థుకి వెళ్ళాలో ఆ నంబరు 'స్విచ్' (Switch) నొక్కితే ఆ అంతస్థుకే 'లిఫ్టు' (Lift) వెడుతుంది గదా? అలాంటి కనెక్షన్!

అంటే మనలో 'లిఫ్టు'లో వున్న స్విచ్ మీద 'నాలుగో నెంబరు' **స్విచ్ నొక్కితే నాల్గోనంబరు అంతస్థుకు కనెక్షన్‌తో ఎలా తీసుకెడుతుందో అలాంటి కనెక్షనే పై లోకాలకూ మన శరీరంలోని ఏడు యోగ చక్రాలకూ** (షట్ చక్రాలు, సహస్రారం) **కనెక్షన్ వుంది!** మనింటి రేడియోలోని 'బ్యాండు' నంబరు మీటరుకు, ఆకాశవాణి ఢిల్లీ ఊరిలోని రేడియో స్టేషనుకూ, కనెక్షనున్నట్టే **పై లోకాలు ఏడూ మనలోని ఏడు చక్రాలతో** 'కనెక్షన్' వుంది!

దాంతో పై లోకానికి వెళ్ళాలన్నా, ఆ లోకం వాళ్ళతో ఇక్కడినుంచి

ఫోనులోలాగ మాట్లాడాలన్నా ఈ చక్రాలు **ఏది ఏలోకంతో కలుపుతుందో** ఆ ఫోన్ నంబరు తెలియాలి! ఆ లోకంతో 'కనెక్టు' (Connect) కావాలి! ఇంతేకాదు. ఐదు (పంచ) భూతాలూ మనస్సూ, ఆత్మకు, బైటా, పంచ భూతములు **'విశ్వాత్మ'** (Universal Mind) **కూ ఇలాంటి కనెక్షనే వుంది!** దానివల్ల మనం జపంచేస్తే ప్రార్థిస్తేనే, ఆ లోకంలోకి వినపడతాయి! శివ లోకంలోకి వెళ్ళి నమశ్శివాయ మంత్రం, విష్ణులోకంలో విష్ణుమంత్రం - అలా ఏలోకానికి ఆ మంత్రం, ఒక 'టెలిఫోన్' నంబరన్న మాట!

## విశ్వంలో జరిగే - 'యజ్ఞం' :

అట్లాగే బయట ప్రపంచంలో సూర్యుడు మండే అగ్ని! అట్లాగే దీని చుట్టూ తిరిగే **రాశి చక్రం** దాన్ని తిప్పుతుందో ఈ మండే మంటను మండింపచేయాలి. **బయట జరిగే ఈ ప్రాసెస్ పేరు యజ్ఞం!** అంటే విశ్వంలోను, మానవ శరీరంలోనూ అన్నింటిలోనూ జరిగేటటువంటిదే! కాబట్టి సృష్టి ఎప్పుడో జరిగి ఆగిపోయేటటువంటిది కాదు. సృష్టి నడుస్తూ వుండాలి. శరీరాలు కదులుతూ వుండాలి. సృష్టిలోని ప్రతి అణువులోనూ ఇది ఇట్లా నిరంతరం ఆగకుండా కంటిన్యూ అవుతూ తిరగలిలా తిరుగుతూ వుండాలి! ఫ్యాక్టరీ (Factory) లో ఎటువంటి 'లీకేజీ' వుండకూడదు. ఏది ఎక్కువ అయితే అది మళ్ళీ సరి చూసుకోవాలి.

ఎవడు పెద్దవాడైతే వాడిని తగ్గిస్తుండాలి! ఏ ఒక్కడూకూడా ప్రపంచాన్ని 'డామినేట్' (dominate) చేయకుండా చూసుకోవాలి! ఇవ్వన్నీ విష్ణుమూర్తి యొక్క డ్యూటీ(duties)లు! ఇదీ విష్ణువంటే!! అంతే కానీ పటం కట్టించితే గోడమీద పటంలో కూర్చుని నైవేద్యాలు తినటం కోసం కాదు. ఆయన ఈ సృష్టిక్రమం అంతా సవ్యంగా తిరుగుతూండేలాగ

నడుపుకోవాలి.

ఒక విధంగా, ఈ 'సృష్టిక్రమం' లేక 'Order of Creation పిండోత్పత్తి క్రమం వంటిది. దశలు-దశలుగా క్రిందికి సృష్టి దిగివచ్చే 'సృష్టి చక్రం' ఇది.

## 'సృష్టి క్రమం' :

ఎప్పటికప్పుడు ఏదోరకంగా మనం సైకిల్ తొక్కుతున్నపుడు లాగా నిత్య **చైతన్య స్థితి,** అంటే (Dynamic Equilibrium) పర్మినెంటుగా 'ఫిక్సిడ్‌గా ఏదీ స్థిరంగా వుండదు. ఎప్పటికప్పుడు ఏదో ఒక కార్యక్రమం జరుగుతోంది. జరిగేదాన్ని నిలకడగా నడుపుకోవాలి! ఇదంతా సృష్టి చేసే 'బ్రహ్మ' గారి హయాము.

## విష్ణువు:

బ్రహ్మ గురించి చెప్పాను. ఈ విష్ణువు గురించి కూడా చెప్పాలి! మనకు క్రింద కనపడే భౌతిక లోకాలను ఇలా **బ్రతికి వుండటం కోసం** దీనిని పోషించి రక్షించేటందుకు ఊర్ధ్వ లోకాలుంటాయి. సూక్ష్మలోకాలు! వాటిని కూడా సృష్టించాలి. ఈ సృష్టిక్రమంలోనే ఊర్ధ్వలోకాలలో భూమీమ్మద చెట్లూ చేమలూ జీవరాశికి ఆహారం ఇస్తాయి. అవి బ్రతికి వుండాలంటే వాటికి నీళ్ళు కావాలి. ప్రతి రోజు నీళ్ళు ఎవరు తెచ్చి పోస్తుంటారు? అందుకే ఆకాశంలో మేఘాల రూపంలో నీళ్ళు వుండాలి - ఆవిరి రూపంలో జలాన్ని సృష్టించాలి! అందుకని జలం (నీరు) అవ్యక్త రూపంలో **ఆవిరిగానూ,** చైతన్య రూపంలో ద్రవంగా, **నీరు** రూపంలో నదులలోని నీటిని సూర్యుడు నిత్యం ఆవిరి చేసి మరలా క్రిందికి 'వర్షం' పొయ్యాలి — ఒక ఎలక్ట్రిసిటీ మోటారు తోడే పంపులాగా ఇది, నిత్యం నడుస్తుండాలి!!

## యజ్ఞ - చక్రంలో సూర్యుడు:

మనకి భోజనం కావాలంటే ప్రపంచంలో భోజనానికి కావలసిన పరికరాల్ని ఎండించే వాయురూపంగా (Gaseous Form) లోకి మార్చి తీసుకెళ్ళి ఆ సూక్ష్మరూపంలోనే అంటే **ఆవిరి** (Vaporized) **రూపంలో** చెట్లకి ఆహారంగా ఇస్తే, ఆ చెట్లు వాటికి కావలసిన ఆహారం 'ప్రోటోప్లాజమ్'గా తయారు చేసుకొనేట్టు **ఆవిరి** లేక అవ్యక్త రూపం కావాలి!

మనం D.D.T. ని '(స్ప్రే)' (Spray)చేసినట్లు (చిమ్మిరి గొట్టం) ఈ ఆహారపదార్థాన్ని ఆకాశంలోకి స్ప్రే రూపంలో నీరెండగా చెట్లపై కొట్టినట్లయితే అదే తిరిగి మనం తినేరూపంలో ఇస్తాయి! ఇదే సూర్యుడు చేస్తున్న పని సూర్యరశ్మి రూపంలో 'శక్తి'ని చెట్లపై స్ప్రే (Spray)చేస్తాడు ఎండ లాగ! మనకి ఈ రూపంలో 'శక్తి'ని అన్నం పెడుతూ వున్నాడు. వాళ్ళు పోషించేవాళ్ళు! **'దేవతలలో పుషా అనే దేవత'** - ఇతడే! - 'పుషా' అంటే 'పోషించటం' అని అర్థం! అదే వాళ్ళ డ్యూటీ (duty).

## 'వైశ్వానరుడు' - జఠరాగ్ని:

అలానే, మనలోకూడా, మనం తిన్న ఆహారం జీర్ణమయ్యేటట్లు చూసేవాడొకడుంటాడు! తిన్న ఆహారం తిన్నట్లు డబ్బాలో పడేసినట్టుగా వున్నట్లుంటే మనిషి చస్తాడు. అందుకని ఆ తిన్న పదార్థం దగ్ధం (burn) అవుతూ ఉండాలి! ఇట్లాంటి పని చేసేవాడే 'వైశ్వానరుడు' అనబడే 'అగ్నిహోత్రుడు'. ఇతడు ప్రతివాడి **కడుపులోనూ** ఉండే జఠరాగ్నియే ఈ 'వైశ్వానరుడు'!

''అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం''

భగవంతుడే మన కడుపులోవుండి అన్నాన్ని నాలుగు విధాలుగా జీర్ణంచేస్తుండేది, (చతుర్భుక్ = చతుర్భుజుడు = నాలుగు విధాలుగా భుజించు వాడు - 'వైశ్వానరుడు!) ఇదంతా ఈ వైశ్వానరుడి రూపంతో నిర్వహిస్తున్నాడు. ఈ 'వైశ్వానరుడే' జీవరాశిలో 'జఠరాగ్ని' రూపంలో ఉంటాడు! బైట 'కాలం'లో మృత్యువే ఈ జఠరాగ్ని!--ఇది భగవద్గీత (అధ్యా.II) చదివితే అర్థం అవుతుంది. కనుక వైశ్వానరుడనేవాడు ప్రతి జీవరాశిలోనూ జఠరాగ్నిగా వుంటాడు.

అట్లాగే విశ్వంలోనూ -- అంటే గ్రహమండలంలోనూ **'శని గ్రహ'** మంటారు శరీరంలో తిన్న ఆహారాన్నంతా వైశ్వానరుడెలా భస్మంచేస్తాడో అట్లాగే అతడే బైట విశ్వంలో పుట్టినటువంటి జీవరాశులని పురుగుల్లాగ భస్మంచేస్తూ ఉంటాడు. బైటప్రపంచంలో ఇవన్నీ మళ్ళీ మళ్ళీ 'పీరియాడికల్' (Periodical) గా తిరిగి, తిరిగి జరుగుతూ వుంటాయి!

దీనివల్ల సౌరమండలంలోని గ్రహమండలంలోకి ఆహారం లభిస్తూ ఉంటుంది. పిండిమరలో ఇన్ని బియ్యం పోస్తేనేగాని పిండిరాదు. ఒక్కో బియ్యం ఒక్కోరకమైనవి. ఇట్లాగే కేవలం మనుష్యులు, పశువులు వీళ్ళంతా భగవద్గీతలో విరాట్ పురుషునికి **ఆహారంగా** వీళ్ళంతా **నోట్లోకి వెళ్ళిపోతూన్నట్లు అర్జునుడికి కనిపించింది.** అంటే ఈ భూమ్మీద పుట్టి సూర్యరశ్మి ఆహారంతో పెరిగిన జీవకోటి 'కాలపురుషుని'కి ఆహారం అవుతారన్నమాట! ఇదే కనిపించింది. విశ్వపురుషుడి ప్రాణానికి యీ ప్రాణులే, ఆహారం! భూమిమీద మొక్కలని పెంచి కూరల్ని పండించినట్లు భూమిమీద జనాల్ని పండించి వృద్ధిచేసి, వాడే తింటుంటాడు. ఇది ఎట్లాగయినా జరగాల్సిందే!

తినే అవసరం **రోజులో** ఒక **టైములో** వచ్చినట్లే ఇది **'కాలంలో యుద్ధాలు'** ప్రళయాలూ--**వేలాదిమందిని కాలం ఒక్కసారి భక్షించే**

'ఆహారసమయం' అన్నమాట!

ఇదే, భగవద్గీతలో చూపిన 'సృష్టిచక్రం' లో 'సంహారం'!!! ఇది భగవద్గీతలో ఉన్న సృష్టిక్రమంయొక్క సూచిక, లేక 'ఔట్లయిన్' (Out line)గా గీసుకొన్న రేఖా చిత్రం యిది!



22

# దేవతల – 'సృష్టి'

## విశ్వశరీరుడైన - 'విరాట్పురుషుని' శరీరంలో దేవతలు!

బైటి విశ్వంలో -- శరీరంలో జరిగే 'యజ్ఞం' లో సూర్యుడు, వైశ్వానరుడు త్రిమూర్తులు విరాట్ పురుషుల గురించి తెలుసుకున్నాం! ఇక మిగతా దేవతలేం చేస్తారో చూద్దాం! ఇక జలాధిదేవత '**వరుణుడు**'. మన శరీరంలోని ఇంద్రియాలలో నాలుకకూ, బైటివిశ్వంలో జలానికీ ఇతడు అధిదేవత! అతడు మన జిహ్వాపై లాలాజలం రూపంలో ఉంటాడు. అలానే '**రుద్రుడు**' విశ్వ పురుషుని క్రోధమునకూ, '**ఇంద్రుడు**' అతని అధికారానికీ ప్రశాంతతకూ, రూపాలు.

విరాట్ పురుషునిలోని దాన గుణమే **కుబేరుడు**! ఆయన యొక్క ఆశాపాశమే వరుణ పాశం. అలానే ధండం **యమధర్మరాజు**! ఇలాగ ఆయున యొక్క **వివిధ లక్షణాలే**' దేవతల '**ఆకారం**' **ధరించి**

వుంటాయి.

ఆయనయొక్క మనస్సు, ఇంద్రియాలను పాలించేది ఇంద్రియాది దేవతయైన -- **ఇంద్రుడు!** ఆయన యొక్క నవ్వు సంతోషము, అవి క్షణకాలం మెరిసిపోతుంటాయి -- అవే **అప్సరసలు!** దేవతలు పైనుంచి కురిసే వర్షం అతనియొక్క వీర్యం! దీనివల్ల చెట్లూ సస్యాలు పుట్టి వీర్యవంతమౌతుంది సృష్టి. ఈ వీర్యంనుంచి పుట్టే మనుష్యుల ఆత్మలు -- అతనియొక్క బీజాలు (Sperms) ! దానినుంచే మానవ సృష్టి పుడుతుంది.

ఇలా ఈ కంటికి **కనిపించని** సృష్టిలో పై లోకాలలో సిద్ధులు, సాధ్యులూ మొదలైన **అనేకమంది దేవతలు** ఇలాగే, వాళ్ళ వాళ్ళ విధుల్ని నిర్వర్తిస్తూ ఉంటారు! ఈ విధంగా ముప్పై మూడు కోట్ల రకరకాల దేవతలు అనేక రకాల విధులను నిర్వర్తిస్తూ ఉంటారని వేదం తెలుపుతుంది. ఇలాంటివారే **'పితృదేవతలు' 'స్వాహా దేవతలు'**, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు, చారణులు అప్సరోగణాలు — ఇలా వీళ్ళందరూ ఆ విరాట్పురుషుని శరీరంలో -మన శరీరంలో అనేక ధాతువులు చేసే పనులే వీళ్ళూ విశ్వంలో -- అంటే 'విరాట్ పురుషుని' 'విశ్వశరీరంలో'నూ చేస్తారు.

ఆ 'విరాట్పురుషుని' వెన్నెముకయే మేరుపర్వతం! ఈ **సప్తలోకాలూ** ఆయనలోని **'యోగ చక్రాలు'**. నిత్యం తిరిగేటటువంటి కాలం 'సుదర్శన చక్రం'! శబ్దాన్ని(Vibration)ఉద్భవింపచేసే ఆకాశమే 'శంఖము'! శయనించే అతనిపడకయే సముద్రం అన్నమాట! పిల్లవాడు గర్భస్థుడుగా-తల్లి కడుపులోని గర్భోదకంలో ఎలా డెవలప్ అవుతూ నిద్రిస్తుంటాడో అలాగే ఈ విశ్వపురుషుడుకూడా విశ్వం పెరుగుతున్నంత కాలం పెరుగుదలలోనే ఉంటాడు.

అందుకే భాగవతంలోనూ, విష్ణుపురాణంలోనూ ఆయన అవతారం భూమీమ్మీదకు రావలసినంత కష్టాలువచ్చి, దేవతలు మొరలు పెట్టుకోడానికి వెడితే ఆయన **'యోగనిద్రలో'** ఉంటాడుట! కారణం ఏమిటంటే 'ఆత్మానంద'స్థితిలో అంతర్ముఖుడై వుంటాడు ! ఆ నారాయణుడు తనయొక్క ఆత్మలోనే తాను ఆనందాన్ని అనుభవిస్తూ ఆత్మానంద స్థితిలో ఉంటాడు!!!

అంటే - సగం మెలకువా, సగం నిద్రాస్థితిలో సగం తనలోకి (ఆత్మలోకి) చూస్తూ, సగం బైటికి బహిర్ముఖుడిగానూ ఉంటాడు. అందుకనే ప్రపంచంలో ఏదైనా ముంచుకొస్తే దేవతలు మేల్కొల్పటం! అప్పుడు అతడి సహాయం --సంకల్పం కావాలి! అందుకనే దేవతలు వేదపురుషుడిని 'మేలుకొలుపుతూ' వుంటారు (సుప్రభాతం). అప్పుడు ఆయన యోగనిద్రలో కదిలి క్షణకాలం విశ్వానికి ఏం కావాలో అది 'సంకల్పించి' అనుగ్రహించి మళ్ళీ పడుకుంటాడు! అవతారం రావటానికి క్రింద భూలోకంలో ఏం జరుగుతుందో అని, ఆయన తన మనస్సు ప్రసరింపచేస్తే, ఆ ఆలోచనే క్రింది లోకాలలోకి **కిరణంగా** దిగివచ్చి **'అవతార'** రూపంలో వచ్చి, పని పూర్తిచేసుకొని, (తన పనిని నిర్వహించి) తిరిగి వెళ్ళి పోతుంది.

## శ్వాస కాలం:

అంటే, విశ్వరూపుడైన వాని ఒక ఉచ్ఛ్వాస - నిశ్వాసముల ప్రాణ స్పందనా కాలమే చతుర్యుగసహస్రములు, అంటే, నాలుగువేల యుగాలన్న మాట!! విరాట్పురుషుడికి క్షణం! అది బ్రహ్మదేవుడికి ఒక్కరోజు! అంటే ఒక అహోరాత్రం అన్నమాట. దేవతలకు ఆరుమాసాలు, పితృదేవతలకు ఆరుమాసాలు కలసి ఒక **సంవత్సరం!** మనకి ఆరు మాసాలు పితృదేవతలకి ఒకరోజు! అట్లాగే మన దగ్గరనుండి బ్రహ్మదాకా -- ఇలా 'అంతస్థులు'

గా కాలప్రమాణంలో కూడా ఉన్నత స్థితులున్నాయి. గవర్నమెంటులో ఎలాగైతే ప్యూను దగ్గరనుండి, ముఖ్యమంత్రి దాకా హోదాలలో **అంతస్థులున్నట్లే** మన దగ్గరనుంచీ బ్రహ్మదాకా ఆయుఃప్రమాణం, కాలప్రమాణంలో అంతస్తులున్నాయి.

దీనికో -- ఉదాహరణ! గడియారంలో మనకి నిమిషాలు, సెకండ్లు, గంటల ముళ్ళు అన్నీకూడా ఆ 12 గళ్ళలోనే తిరుగుతాయి! అలాగే బ్రహ్మయొక్క కాలం, విరాట్పురుషుని కాలమూ, మనకాలమూ, రాశిచక్రంలోని 12--రాసులయొక్కకాల చక్రం మీదే తిరగాల్సిందే! అవి తిరిగే స్పీడు **వేరుగనుక వేర్వేరు లోకాలకు వేరువేరు కాలాలు తద్వారా ఏర్పడుతాయి!**

## కాలచక్రమే-''రాశిచక్రము'' :

కాలం యొక్క విభాగం, దాని ప్లాను (Plan)ఒక్కటే! ఈ పన్నెండు రాసులూ కాల పురుషుడిలో ఒక 'సంవత్సర - చక్రం'!!

''**యజ్ఞః సంవత్సరః**''. ఈ కాలచక్రం ఎప్పుడూ తిరుగ ుతూ వుంటుంది. తిరిగి - తిరిగి ప్రారంభించేది గనుక '**సంవత్సరంః**' అంటే పరిభ్రమిస్తూ (Rotate) పునరావృత్తమవుతూ (recur) ఉంటుందని! తిరిగేది 'ఆవృత్తి' అయ్యేది 'చక్రం' గనుక అదే '**కాలచక్రం**' దాన్నే '**రాశిచక్రం**' అంటారు. ('యత్రకాలే త్వనావృత్తిః ఆవృత్తిశ్చైవ యోగినాం'')

ఆ కాలచక్రంలోనే గుండ్రంగా శయనించి ఉంటాడు -- ఈ విరాట్పురుషుడు! గర్భంలో పిండంగా ఎదిగే శిశువుకూడా ఇంగ్లీషు అక్షరం 'C'ఆకారంలో పాదాలూ శిరస్సూ ఒకదగ్గరేవుంచి గుండ్రంగా చక్రాకారంలో ఉంటాడు చిత్రంగా! శిరస్సు ఎక్కడనుంచి ప్రారంభమౌతుందో కాళ్ళు అక్కడే ఉంటాయి ! అందుకే రాశి చక్రంలో 'మేషరాశి' వెనుక ప్రక్కనే,

'మీన రాశి' పన్నెండు (12) గంటలతర్వాత (1) ఒంటిగంట లా
వుంటాయి. కడుపులోని 'జీవుడెట్లా ఉంటాడో' అక్కడకూడా అలాగే కా
పురుషుని 'ప్లాను' కూడా ఉంటుందికాబట్టి ఈ రాశిచక్రాన్ని అనుసరించే
సంగతి, **పుట్టీవాడి జాతకం,** ప్రపంచ చరిత్ర -- అంతా దాన్ననుసరించే
నడుస్తుంది.

## పురుష సూక్తంలోని నారాయణుడితడే!

ఇదే, వేదములో పురుషసూక్తంలో విరాట్పురుషుడే '**కాలచక్రంలో బంధింపబడినప్పుడు** అతడే, కాలపురుషుడిగా సృష్టిలోకి దిగుతున్నాడు అని తెలుపబడి ఉన్న రహస్యం! ఈ రహస్యంలో జ్యోతిషానికి యోగశాస్త్రానికి 'లింకు' (Link) లేదా కనెక్షన్! సూచనగా రహస్యంగా అందించబడివున్నది!! దీన్ని సైన్సు **దృష్టితో** ఆలోచిస్తేనే దాని అంతరార్థం బోధపడుతుంది.

కాలచక్రం గుండ్రంగా తిరుగుతూ వుంటుంది. ఇది విశ్వానికి **గడియారం** వంటిది. ఈ గడియారంలో కూడా పన్నెండు (12) అంకెలే! పన్నెండు విభాగాల్ని సూచిస్తుంటాయి. ఈ కాలచక్రంలో పురుషుడు 12 గంటల స్థానంలో 'శిరస్సు' ప్రారంభమై గుండ్రంగా 1,2,3 --**గంటలు ఏర్పడే వరుసలోనే** శరీరవయవాలన్నీ ఏర్పాటుగా వ్యాపించి, చివరికి **పాదాలు** తిరిగి 12 **గంటలు పూర్తివచ్చే ఆఖరి బిందువు** వద్దకు, వ్యాపించి వుంటాయి. అంటే, శరీరంలో 12 విభాగాలు కాలంలో 12 రాసులుగా ఏర్పడినాయి!

ఇదే జ్యోతిషశాస్త్రంలో **మేషం** శిరస్సుగానూ, **మీనం** పాదాలుగానూ వచ్చేలాగ 12 రాసులూ శరీరావయువాలుగా '**రాశి-చక్రం**' లో పడుకొనివుంటాడు కాల పురుషుడు -- అని చెప్పబడివుంది! దీని ఉపయోగమేమిటి? అని సందేహం రావచ్చు.

## శరీరంలోని - గడియారం, "జాతకం" :

బైట రాశిచక్రంలో ఏయే గ్రహాలు గడియారంలోని ముళ్ళులాగ ఈ 12 గంటలలోనూ ఏయే స్థానములలో **ఉంటారో** -- ఒక మనిషి **పుట్టిన టైముకు** సరిగ్గా వాడి శరీరంలోని వేరువేరు అవయవాలకు వాటి **వాటి** గ్రహ **దశలలో** రోగవములు గాని, అభివృద్ధిగాని భోగాన్నిగాని -- **ఫలితంగా** ఇస్తారు! అంటే ఉదాహరణకు ముఖస్థానమైన రెండవ రాశిలో శుభగ్రహాలుంటే అందమైన ముఖం, రుచిగల భోజనాన్నీ, సంగీతంవంటి ఆకర్షణగల్గిన వాక్కునూ ఇస్తారు. అలాగే అదే స్థానంలో 'పాప గ్రహాలైన' శని, కుజులుంటే ముఖం మీద వ్రణములు, మచ్చలు, స్ఫోటకంవంటి వికృతాలనూ కల్పిస్తారు! మనిషికి జీవితంలో ఏ గ్రహాలు శరీరంలో ఏ భాగానికి మంచి -- చెడులను కల్పిస్తాయో తెలిపే ''కంప్యూటర్'' ప్లానువంటి కాలపురుషుని 'డి జైన్' అన్నమాట ఈ రాశిచక్రం! ఈ గుండ్రంగా చక్రాకారంలో విరాట్పురుషుడు కాలంగా బంధిపబడివున్నాడు.

**''అబధ్నన్ పురుషం పశుం'' :**

అన్న వేదంలోని **''పురుష సూక్తం''** మంత్రాలకు అర్థం ఇదే!

## కాలపురుషుని నాలుగు భాగాలు

గర్భంలో మనిషికూడా శిరస్సూ పాదాలు దగ్గరగావచ్చేలాగా నొక్కినట్లు పిండంలో పడుకొనివుంటాడు(చిత్రం చూ-A)

బైట విశ్వంలో కూడా భగవంతుడు విరాట్పురుషుడిగా 'నక్షత్ర చక్రం' అంతా వ్యాపించి అన్ని వైపులా తానై పెరిగి ఒక గోళాకారంగా **కాలచక్రంగా** ఉంటాడు. (చూ. చిత్రం-B) మన మామూలు కాలంలో ఈ 'కాలచక్రం' **నాలుగు** (4) జాములు, నాల్గు (4) పొద్దులూ కల్పిస్తున్నట్లే - బైటి విశ్వంలో కూడా కాలపురుషుడు **నాల్గు** (4) **యుగాలను,** నలుగురు (4) **మనువులను** వారి మన్వంతరములనూ నాలుగు (4) **వేదములనూ**

(4) ఆశ్రమములైన బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలుగానూ ఇంకా బ్రహ్మదేవుడి నాలుగు ముఖాలుగానూ వాటినుండి వెలువడే నాలుగు గాయత్రీ పాదాలుగానూ ఇలా ధర్మం నాల్గుపాదాలు (4)దాకా ఏర్పడి వుంది! ఈ ధర్మాన్ని రక్షించడానికి విష్ణుమూర్తి నాల్గు భుజములు - ఈ ప్రపంచాన్ని నిలబెట్టే నాలుగు స్థంభాలుగా వర్ణించబడి ఉన్నాయి.

ఈ కాలచక్రం అంతా 24 గంటల్లో తిరిగే కాలము క్రింద విభాగమై మనకు దర్శనమిస్తున్నది. ఇలా 4 పాదాలలో, 24 అక్షరాలు గల్గిన గాయత్రీ 4 - వ పాదం 'మోక్షపదమని' తెలుపబడినది. ఇది నాలుగు వేదాల సారం! ఈ విధంగా ఏర్పడివున్నది సకల సృష్టి. దీనినే 'సృష్టిక్రమం' అంటారు.

## పైనుంచి 'సృష్టిలోకి దిగివచ్చే పరమాత్మే - మన ఆత్మ':

ఈ సృష్టిలో ఆకారంలేక ఆకాశంలాగ వ్యాపించివుండే పరమాత్మ అయిన దేవుడు - ఆదీ అంతంలేకుండా ఉన్న 'తన' స్థితిలోంచి దిగివచ్చి - నీటి ఆవిరి మేఘాల స్థితినుంచి క్రిందికి దిగివచ్చి వర్షించినట్లుగా 'సృష్టి' రూపంలో క్రిందికి వస్తాడు. ఈ సృష్టికూడా వర్షమువలే క్రిందకు అనుగ్రహంగా వర్షించింది కనుక దీనిని 'విసృష్టి' అంటారు. పైనుంచి కురిసే నీటి బిందువు అంచెలంచెలుగా క్రిందికి దిగుతూ జలపాతంలా ప్రసరించి, అంతస్థులంతస్థులుగా క్రిందికి దిగి, రకరకాల మార్గాలలో సముద్రాన్ని చేరినట్లే - ఈ సృష్టిక్రమంకూడా ఏ రూపమైనా శాఖోపశాఖలుగా అంతటా వ్యాపించి వున్నది ఒక పెద్ద మహా వృక్షంలా! ఈ వృక్షానికి 'వేరు' అనగా - పుట్టుక స్థానం 'ప్రణవం' అని చెప్పబడే 'ఓం' కారం.

పరమాత్మ స్వరూపమైన ఈ

(4)ఆశ్రమములైన బ్రహ్మ చర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలుగానూ ఇంకా బ్రహ్మదేవుడి **నాలుగు ముఖాలుగానూ** వాటినుండి వెలువడే **నాలుగు గాయత్రీ పాదాలుగానూ** ఇలా ధర్మం **నాల్గుపాదాలు** (4)దాకా ఏర్పడి వుంది! ఈ ధర్మాన్ని రక్షించడానికి విష్ణుమూర్తి నాల్గు భుజములు -- ఈ ప్రపంచాన్ని నిలబెట్టే నాలుగు **స్థంభాలుగా** వర్ణించబడి ఉన్నాయి.

ఈ **కాలచక్రం** అంతా 24 గంటల్లో తిరిగే కాలము క్రింద విభాగమై మనకు దర్శనమిస్తున్నది. ఇలా 4 పాదాలలో, 24 - అక్షరాలు గల్గిన గాయత్రీ 4 - వ **పాదం** 'మోక్షపదమని' తెలుపబడినది. ఇది నాలుగు వేదాల సారం! ఈ విధంగా ఏర్పడివున్నది సకల సృష్టి. దీనినే 'సృష్టిక్రమం' అంటారు.

## పైనుంచి 'సృష్టిలోకి దిగివచ్చే పరమాత్మే - మన ఆత్మ' :

ఈ సృష్టిలో ఆకారంలేక ఆకాశంలాగ వ్యాపించివుండే పరమాత్మ అయిన దేవుడు -- ఆదీ అంతంలేకుండా ఉన్న **'తన'** స్థితిలోంచి దిగివచ్చి - నీటి ఆవిరి మేఘాల స్థితినుంచి క్రిందికి దిగివచ్చి వర్షించినట్లుగా 'సృష్టి' రూపంలో క్రిందికి వస్తాడు. ఈ సృష్టికూడా వర్షమువలే క్రిందకు అనుగ్రహంగా వర్షించింది కనుక దీనిని 'విసృష్టి' అంటారు. పైనుంచి కురిసే నీటి బిందువు అంచెలంచెలుగా క్రిందికి దిగుతూ జలపాతంలా ప్రసరించి, అంతస్థులంతస్థులుగా క్రిందికి దిగి, రకరకాల మార్గాలలో సముద్రాన్ని చేరినట్లే -- ఈ సృష్టిక్రమంకూడా ఏక రూపమైనా శాఖోపశాఖలుగా అంతాటా వ్యాపించి వున్నది ఒక పెద్ద **మహా వృక్షంలా!** ఈ వృక్షానికి 'వేరు' అనగా -- పుట్టుక స్థానం 'ప్రణవం' అని చెప్పబడే 'ఓం' కారం.

**తలక్రిందులుగా పెరిగే చెట్టు!** పరమాత్మ స్వరూపమైన ఈ

ఓంకారం నుంచే యావత్ సృష్టి పుట్టింది! అయితే మామూలు చెట్టు నేలలో పుట్టి, పైకి పెరుగుతుంది. కానీ ఈ విశ్వసృష్టి అనే మహావృక్షం పైన పుట్టి బ్రహ్మ మనస్సులోంచి మొలకెత్తి మనదాకా ఇంకా క్రింద పాతాళ నరక లోకాలవరకూ శాఖోపశాఖలుగా విస్తరించింది. దీనినే భగవద్గీత -- ''ఊర్ధ్వమూలము - అధశ్శాఖము'' వేళ్ళు పైనా, మొక్క క్రిందకూ వున్న ''వరుణ-వృక్షము'' అని వేదంలో చెప్పబడిన రహస్యమిదే! ఎవరైతే ఈ రహస్యం తెలుసుకుంటారో వాళ్లు సృష్టి అంతా తెలుసుకున్నట్లే.

''యస్తం వేద సవేదవిత్'' --అని దీన్నే భగవద్గీత చెప్పింది!

## వాన చినుకులవలే - క్రిందకు వర్షించే జీవాత్మలు:

ఈ విధంగా వేదాలలో పురాణాలలో బైట కనబడే ఈ పంచాభూతాత్మకమైన సృష్టి అంతా 'వృష్టి' వర్షంలాగ పైనుంచి క్రిందకు దిగిందని తెలుపబడింది.

దానిలోని అంతస్థులే అంటే ''స్టేజీలు'' (Stages ) దశలలో ఏర్పడే పరిణామక్రమమే -- దేవతలూ, పంచభూతాలూ, గ్రహాలూ, భూమి మానవుడు చెట్లూ, ఆత్మలూ, శరీరాలు, కాలమూ- ఇవన్నీ ఒక దానితో ఒకటి కలుస్తూ విడుతూ పనిచేయటానికి అవసరమైన 'కర్మ' అనబడే ఒక సత్యాన్ని (Scientific Law) ఏర్పరచినట్లు వర్ణించాయి మన హిందూమతంలోని వేదశాస్త్రాలు.



''ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం''

— భగవద్గీత (15)

23

# పంచభూతాలు-సృష్టి

ప్రపంచంలోని అన్నిమతాలకూ హిందూమతానికీ ప్రత్యేకమైన తేడా వున్నది. అది బౌద్ధమతం, క్రిష్టియానిటీ, ఇస్లాం మతాల్లోలాగా ఒక ప్రవక్తగాని, దేవదూతగాని (మరేపేరుతోనైనా) ఒక వ్యక్తియొక్క బోధనలపై ఆధారపడ్డదికాదు! రెండవ భేదం హిందూమతం ఫలానా తేదీనుండి ప్రారంభించిందని చెప్పడానికి వీలుకాదు !

## ప్రపంచ మతం :-

పై కారణాల వల్ల హిందూమతం సృష్ట్యాదినుంచే మానవజాతి సృష్టి నుంచీ ఈ భూమి మీద ప్రపంచమంతటా వ్యాపించి వుండినది! దీనికి దాఖలా ఇతర విషయాలలోనేకాక హిందూమతం మూలసిద్ధాంతం లోనే కొట్టవచ్చినట్టు కనపడుతుంది ! ఉదాహరణకు (1) కర్మ సిద్ధాంతము (2) పునర్జన్మ సిద్ధాంతము (3) నాలుగు యుగాలు (4) అవతార సిద్ధాంతము వంటివి మరే ఇతర మతాలలోనూ కనిపించవు. ఇవి ఒక్క హిందూమతంలోనే కనిపించే

ప్రత్యేకతలు! ఇలాగ ప్రత్యేకంగా హిందూమతం ఒక్కదానిలోనే కనిపించేది సిద్ధాంతం (Theory) పంచభూతాల సృష్టి రహస్యం.

ఈ ప్రపంచం కంటికి కనిపించేదికాక, కంటికి కనిపించని మానసిక, దైవిక లోకాలలో వ్యాపించి వున్నది. ఒక గ్రంథం లేదా కవిత్వంగాని కాగితంమీద వ్రాసేముందుగానే అది కవి మనస్సులో ఏర్పడ్డట్టే! ఇలాగ కంటికి కనిపించని కారణాలను ఈ సృష్టివెనుక దాగివున్న వాటిని పంచభూతాలని, ఈ భౌతికసృష్టికి మూలపదార్థాలుగా భగవద్గీత, ఉపనిషత్తులూ పురాణాలూ బోధిస్తున్నాయి. ఈనాటి స్కూళ్ళలో ఇంగ్లీషు చదువులే నేర్చుకున్న అనేకమంది మన హిందువులకే ఈ 'పంచభూతతత్త్వం' అంటే ఏమిటో అర్థం తెలీదు! అందుకని దానిని విశదంగా తెలియజేస్తాను.

ఈ సృష్టికి అయిదు వస్తువులు (Five Elementary Creations) కలిస్తేనే ఒకరూపం ఏర్పడుతుంది. చేతిలో ఏదైనా వస్తువును పట్టుకోవాలంటే కనీసం ఐదువేళ్ళూ కలిసి పనిచేస్తేనేకాని వీలవదు. మన చేతికివున్న ఐదువేళ్ళ వలెనే సృష్టికర్తకు ఈ ఐదుమూలపదార్థాలూ కలిసి రొట్టెల పిండి కలిపే వంటవాడికి గోధుమ పిండీ, నీళ్ళూ, మిగతా దినుసులూ కలిస్తేనే రొట్టె ఏర్పడ్డట్టే ఈ ఐదు మూలపదార్థాలతో కలిస్తేనే బైట కనిపించే ఈ ప్రపంచం ఏర్పడుతుంది.

ఈ అయిదు మూలపదార్థాలకి 'పంచభూతాలు' అని పేరు. ఈ పంచభూతాలంటే ఏమిటో భగవద్గీతలో స్పష్టంగా ఇలా చెప్పబడి వున్నది.

"భూమిరాపో అనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ।
అహంకార ఇతీయంమే భిన్నాః ప్రకృతి రష్టథాః॥"

అనగా "ఈ కనపడేస్థూల సృష్టికి 1. పృథ్విలేక భూతత్త్వం

(భూగోళంకాదు) 2. జలము (నీళ్ళుకాదు!) 3. అగ్ని 4. వాయువు 5. ఆకాశము ఈ పంచభూతాలూ, భౌతిక కారణాలు. వాటి వెనుక సూక్ష్మకారణాలైన మనస్సు, బుద్ధి అహంకారము మూడు కలిసి మొత్తం 8 విధాలుగా 'అష్టవిధ ప్రకృతి' పనిచేస్తున్నది" అని శ్రీకృష్ణ భగవానుడు యిటు భౌతిక సృష్టికీ అటు ఆధ్యాత్మిక సృష్టికీ మూలవస్తువులను వివరించాడు.

ఈ పంచభూతాలంటే ఏమిటో ఒక్కొక్కటే సైన్సు దృష్ట్యా పరిశీలించే ముందు, సైన్సు దృష్ట్యా ఈ సృష్టిలో కనిపించే వస్తువులే మూలకారణాలన్న ఒక ప్రకృతి సూత్రం (**Law of nature**) అని ఋజువు చేయడానికి ప్రత్యక్షమైన దాఖలాలేమిటి?

యదార్థమైన అంటే భగవంతునిచే నిర్మించబడ్డ ఈ సాక్ష్యాలు ప్రకృతి లోపల ఏర్పడ్డాక 5 విధాలుగా ఏర్పడుతుందని మనకు సహజంగానే లభించే ఉదాహరణలతో స్పష్టంగా ఋజువు కనపడుతోంది. ఉదాహరణకు మనిషి చేతిని పనిచేయించే ఐదువేళ్ళూ కనిపిస్తున్నాయి. ఇది యాదృచ్ఛికమే అనుకున్నా, మనమీ బాహ్య ప్రపంచంలో దేన్ని తెలుసుకోవాలన్నా మనకు పంచేంద్రియాలు (5) ద్వారానే వీలవుతుంది.

అవి **1.** కన్ను **2.** ముక్కు **3.** చెవి **4.** నాలుక **5.** శరీరము

అలానే స్థూలశరీరాన్ని కూడా ఐదు కర్మేంద్రియాలు 1. కాళ్ళు 2. చేతులు 3. వాక్కు (మాట) 4. మలమూత్ర విసర్జనకు యిలా మనం జీవించి వుండేందుకు అవసరమైన శరీర కర్మలన్నీ చేయడానికి అవసరం ! అంతేకాదు ఒక మందార పువ్వులో, యింకా అనేక వృక్షజాతులలో కూడా అయిదు రేకలు. అయిదు రక్షక పత్రాలు యిలా పంచవిధ నిర్మాణం వున్నది. సముద్ర జంతువులలో కూడా నక్షత్రచేప, (**Star Fish**) సముద్రపు ఉమ్మెత్త (**Sea Orchal**) వంటి జంతువులు ఈ అయిదురెమ్మలతో ఏర్పడి వున్నాయి.

అలానే బైటి ప్రపంచంలో కనబడే మూలపదార్థాలు కూడా గాలి, నీరు, నిప్పు, ఆకాశమూ, భూమి అన్న అయిదు మూలపదార్థాలే ఈ భౌతికసృష్టికి మూలవస్తువులని వేదాలలోనూ భగవద్గీతలోనూ ఉపదేశించిన మూల సిద్ధాంతము.

మనిషి శరీరంలో కూడా ఈ పంచభూతాలతో ఏర్పడ్డవే అయిదు తత్వాలూ స్పష్టంగా కనిపిస్తాయి ! 1) ఎముకలు 2) జుట్టు 3) చర్మము 4) రక్తము 5) మాంసము

ఈ అయిదు మూల పదార్థాలతోనే అవయవాలన్నీ నిండివున్నాయి. అయితే ఈ పంచభూతాలంటే గాలి, నీరు, నిప్పు, ఆకాశము; భూమీ మాత్రమేనా ? ఈనాటి సైన్సుచెప్పినట్టు ఖనిజాలు లోహాలవంటి 92 మూలకాలు (Elements) మాటేమిటి? అన్నప్రశ్నను సైన్సుపరంగా హిందూమత మూలసిద్ధాంతమైన పంచభూతసిద్ధాంతంతో విశ్లేషించి పరిశీలించుదాం! పంచభూతాలలో ఒక్కొక్కటే సవివరంగా తెలుసుకుందాం!

## భూమి :–

పంచభూతాలలో భూతత్వం అనగా భూగోళంకాదు ! భూగోళం ఏపదార్థంతో ఏర్పడివుంటుందో అలానే ఇతర గ్రహగోళాల నిర్మాణం కూడా ఏ ఘనపదార్థంతో నిర్మాణం అవుతుందో (Solid metal) అదంతా భూతత్త్వమే! ఈ భూమియొక్క లక్షణం వాసన, లేక పరిమళం; అని చెప్పబడింది ! అంటే వేసవిలో వానచినుకు నేలపై పడ్డప్పుడు మట్టిపరిమళం ఘుమఘుమలాడుతుంది! కొత్తకుండ తడిపినప్పుడు మంచి అందమైన పరిమళం కొత్తమట్టి పరిమళంలా వ్యాపిస్తుంది ! ఇది భూమికి గల సహజగంధం. భూత్తత్వంయొక్క లక్షణంగా చెప్పబడింది !

## జలం :—

జలమనగా కేవలం నీళ్ళుమాత్రమే కాదు ! ద్రవపదార్థాలన్నీ "ప్రవహించేలక్షణం" గల ఏ జలతత్వంయొక్క రూపాంతరాలతో ఏర్పడ్డాయో ఆ మూలతత్త్వమే జలం ! ఈ జలాధిదేవత వరుణుడు! జలము యొక్క లక్షణం రుచి (రసం) మన శరీరంలోని రక్తము, ఇతర ద్రవపదార్థాలు బయట సృష్టిలోని సముద్రాలు, నదులూ, వర్షజలము, చెట్లలోని జంతువుల శరీరంలోని రక్తము, ద్రవము, ఈ జలతత్వంలోనే ఏర్పడివున్నాయి ! ఈజలం లేకుండా ప్రాణులు జీవించలేవని ఈనాటి సైన్సుకూడా తెలుపు తోంది! కాబట్టి సృష్టికవసరమైన అయిదు మూలపదార్థాలలో జలము, జీవనము అనేపేరుతో పిలుస్తారు ! ప్రాణమిచ్చేది అని అర్థం.

## అగ్ని :—

అగ్ని అంటే కేవలం మంట అనిమాత్రమే కాదు ! ఈ అగ్నికి వేడి, కాంతి, (తేజస్సు) అనే రెండులక్షణాలు వున్నాయి ! మన శరీరంలో వెచ్చదనం మనం బ్రతికివుండేలా చేస్తున్నది. ఈఅగ్నితత్వం వల్ల మనశరీరం నిర్మాణం కాబట్టి. పోతే అగ్నియొక్క రెండవలక్షణం అన్ని వస్తువులను హుతం చెయ్యడం లేదా ఆహుతి చేయడం; అనగా కాల్చివేయడం ! కాబట్టి బయట అన్ని వస్తువులను కాల్చే మంట లేక అగ్ని ! ప్రపంచంలో అన్నిటినీ కాల్చివేసే సూర్యుడిలోనిదికూడా అగ్నిహోత్రమే ! అలానే మన కడుపులో వేసిన ఆహారాన్ని హుతం చేసేదికూడా ఆకలి అనేరూపంలో కడుపులో వుండేదికూడా అగ్నియే ! దీనికి జఠరాగ్ని అని పేరు ! అలానే మన మనస్సులో వేసిన ఆలోచనలను హుతం చేసి వాటి అర్థాన్ని తెలుసుకొని జ్ఞానంగా మార్చేదికూడా అగ్నియే ! కాబట్టి మన మనస్సులో ధ్యానాగ్ని అనబడే అగ్నివున్నది ! ఆకాశంలో మెరుపులలోనూ విద్యుత్తులోనూ ఇంకా ఇతరచోట్లకూడా అగ్నిసృష్టిలో సర్వత్రా వ్యాపించివున్నది !

ఈ అగ్నిహోత్రంనకు ఇంకొక లక్షణమేమిటంటే రెండు వస్తువులయొక్క రాపిడివల్ల అగ్నిపుట్టుతోంది ! అడవిలో చెట్లు రాసుకుని మంటలు ప్రజ్వరిల్లుతాయి ! చెకుముకిరాయి రాతి ఒరిపిడివల్ల మెరుపులలో అగ్ని ప్రజ్వరిల్లుతోంది ! అలాగే మనిషి శరీరంలోవున్న అగ్ని స్త్రీపురుషుల స్పర్శవల్ల కాముడిలా ప్రజ్వలించి ప్రాణరూపం ధరించి గర్భంలో సంతానోత్పత్తి కలిగిస్తున్నది ! కామాగ్నికూడా అగ్నియే అని వేదం తెలుపుతున్నది !

అలానే నాలుకపై దవడతో కాని దంతములతోగాని ఒరిపిడివల్ల పుట్టేది మాట. ఈశబ్దముకూడా అగ్నియొక్క రూపాంతరమే ! ఇలాగ కడుపులో జఠరాగ్ని, మనసులో జ్ఞానాగ్ని, అవయవాలలో వెచ్చదనాన్ని ఇచ్చేఅగ్ని, స్త్రీపురుషులవల్ల ఏర్పడే సంతానాగ్ని (కామాగ్ని) చివరకు మనిషి మరణించినపుడు శరీరాన్ని హుతం చేసి తనలో చేర్చుకునే చితాగ్ని ఇలా అయిదుఅగ్నులు పంచాగ్నులు కలిసిన ఈ అగ్నితత్త్వము సృష్టినంతా నిర్వహిస్తున్నది అని వేదం చెప్పుచున్నది! పంచభూతాలలో అగ్ని అతిముఖ్యమైన తత్వం ! యజ్ఞయాగాది వైదిక కర్మలన్నిటికీ అగ్ని మూలము !

## వాయువు :–

పంచభూతాలలో నాలుగవతత్త్వము వాయువు ! వాయువు యొక్క లక్షణం సంచారం లేక చలనం ! మన శరీరంలోని కదలిక, జంతువులు, ఇతరజీవులు సంచారం చేయగలిగే జంగమలక్షణం ఈ వాయుతత్త్వంవల్లనే ఏర్పడుతున్నది! బయట ప్రపంచంలో వాయువు ఊపిరి పీల్చే ప్రాణవాయువు వర్షాలు కురిపించి అన్నం పెట్టే గాలులు, తుఫానులు సృష్టించి ప్రళయాన్ని లేపే సుడిగాలులు ఇలాగ వాయువుకూడా సర్వత్రా వ్యాపించి వున్నది, మనలోపల బయటాకూడా ! చివరికి జడమైన ఈభూగోళం కదలటానికి కూడా గ్రహగోళాలన్ని క్రమబద్ధంగా తిరగడానికికూడా ఈ వాయువే ఆధారం! సూర్యగోళంనుంచి పుట్టి కుమ్మరిసారి గుండ్రంగా తిరిగినట్టు కుండలు

చేయడానికి కారణమైన క్రియాశక్తి ఈ వాయువువల్ల గ్రహగోళాన్నీ కాలచక్రంలో గుండ్రంగా తిరుగుతూ రాశిచక్రాన్ని తిప్పేది ఈ వాయువే ! ఇలా గ్రహాలన్నిటికీ కదిలించే వాయువుపేరు ప్రవాహవాయువు అంటారు ! మనలో ఊపిరిగా మనల్ని బ్రతికించేది ప్రాణవాయువు ! అలాగ మనిషి మరణించిన తర్వాత ఆత్మను బయటకు తీసుకుపోయేది అపానవాయువు లేక మరణవాయువు ! ఇలాగ మనశరీరంలో మలమూత్రములు బయటకునెట్టివేసేది కూడా అపానవాయువే ! మన శరీరంలోని రక్తం శరీరమంతటా సంచారం చేసేలా చేసేది సమానవాయువు ! అలానే జీర్ణమైన ఆహారసారాన్ని అవయవాలకు అందించేది ఉదానవాయువు ! శరీరంలో జరిగే అన్ని ప్రక్రియలకు ఒక సమతుల్యంగా **(Balance)** వుండేది వ్యానవాయువు ! ఇలాగ ఈ వాయువు మన శరీరంలో అయిదు విధాలుగా **(1)** ప్రాణ **(2)** అపాన **(3)** వ్యాన **(4)** సమాన **(5)** ఉదాన వాయువు లనబడే పంచప్రాణములతో మనల్ని బతికిస్తున్నది! అందువలన ప్రతిహిందువు పూజలో అయిదు వస్తువులు సమర్పించి చేసేది పంచపూజ ! శరీరంలో జరిగే ఈ పంచకర్మలకు సూచిక! చివరకు మనసుకూడా ఈ వాయుతత్వంవల్లనే ఆలోచనారూపంలో పరిగెడుతున్నది !

ఆకాశం :-

పంచభూతాలలో ఆఖరిది ఆకాశతత్త్వం ! అంటే బయట కనిపించే నీలాకాశం మాత్రమే కాదు ! ఆకాశతత్త్వంయొక్కలక్షణం శబ్దతరంగాల్ని మోసుకువెళ్ళడం"వైబ్రేషన్స్" స్పందనలను ప్రకంపనలుగా ప్రసారం చెయ్యడం **(Space Vibrations)** ! ఆకాశం అంటే ఖాళీస్థలంకాదు. అంటే ఏమీలేని శూన్యం కాదు ! సర్వవస్తువులు ఎక్కడైనా వుండాలంటే అవి వుండేందుకో స్థలం కావాలి ! ఇలాగ ఈ యావత్ సృష్టి ఒకచోట ఉండడానికి కావలసిన అవకాశమే ఈ ఆకాశం !

ఆకాశతత్త్వమే ఈ భూమికి పైనా భూమికి క్రిందా సర్వత్రా వ్యాపించివుంది కాబట్టి వ్యాపక గుణమే ఆకాశలక్షణం ! మనమనస్సులో ఏఆలోచనలూ లేనప్పుడు నిర్మలంగా స్ఫటికంగా మేఘాలులేని ఆకాశంలా వుంటుంది! అది ఆకాశతత్వంయొక్క ఉత్కృష్ట స్థితి ! సృష్ట్యారంభంలో ఈ మానసిక ఆకాశంనుండే సృష్టికర్త యొక్క సంకల్పం బయలుదేరి ఆలోచనారూపంలో తర్వాత క్రమంగా పంచభూతాలను ఏర్పాటు చేసిందని వేదంలోని సృష్టిరహస్యం తెలుపుతోంది,

మనలో ఈ ఆకాశతత్వం వుండబట్టే 'నేనున్నాను' అన్న ప్రజ్ఞ లేక జ్ఞానం కలుగుతున్నది ! ఇది నిర్జీవాలకు వుండదు! పై అయిదు మూలతత్వాలు కలసి బయట బ్రంహ్మాండంలోనూ ఇటు మనశరీరంలోనూ సృష్టిలా నిలిచివున్నది! ఇలా అయిదు వస్తువులతో తయారయింది కనుకనే దీనికి ప్రపంచము అనిపేరు! ప్ర+పంచ= అయిదు వస్తువులతో ఏర్పడినది ప్రపంచము! ఇవి సంగ్రహంగా పంచభూత సృష్టి సిద్ధాంతాలు.



24

# విశ్వంలో దేవతలు – శరీరంలో 'అధి దేవతలూ!'

ఈ విశ్వమంతా విరాట్ పురుషుని శరీరమే. పురుషసూక్తంలో వేదము ''సహస్ర శీర్షా పురుషః'' అనగా వేలకొలది శిరస్సులూ, కళ్ళూ, కాళ్ళూ, చేతులూ వుండే ఈ సృష్టికి ఆధారభూతుడైన 'విశ్వపురుషుని' గురించే చెబుతుంది. ఈ విశ్వపురుషుని శరీరంలోనే దేవతలు — వేరువేరు అవయవాలుగా వున్నారు! మన శరీరంలో ఏయే అవయవం ఏయే పని చేస్తున్నదో సరిగ్గా ఆ విశ్వపురుషుని శరీరంలోకూడా ఆయా సంబంధితమైన దేవత ఆయా అవయవములో ఆ పనిని నిర్వహిస్తుంటాడు. ఆ దేవతలే మన శరీరంలోనూ అంటే మానవుని శరీరంలో వివిధ అవయవములలోనూ తమతమ దేవతాంశతో నిలిచి — విశ్వంలోలాగే పనిచేస్తూ వుంటారు!

ఇలా దేవతలు భూతజాలములయొక్క (జీవుల యొక్క) శరీరములలో నిలిచి పనిచేయడాన్ని వేదం 'అధిభూతం' (పంచభూతములను అధిష్టించుకుని వానిలో పనిచేయు అధిపతులు)గా తెలుపబడి వున్నది. ఇది భగవద్గీతలో కూడా శ్రీకృష్ణుడు విశ్వరూపం చూపి, ఆ విరాట్ పురుషుని శరీరంలో వున్న దేవతలే మనిషి శరీరంలోనూ ఇంద్రియాలను ఆశ్రయించి వాటిచే పని చేయిస్తూవుంటారని అర్జునుడికి చూపాడు. వీటిని 'అధిభూతం' అంటారు. భౌతిక పదార్థాలలో వుండేది అధిభౌతికము.

ఈ అధి-దేవతలే విశాల విశ్వంలో తమతమ లోకాలలో నిలిచి విశ్వరూపియైన విరాట్పురుషుని శరీరంలో అవయవాలలాగా ఈ సృష్టి అంతటా పనిచేస్తూ ఉన్నారు -- ఈ రెండు వ దానిపేరే 'అధిదైవతము'

**''అధిభూతం క్షరోభావః పురుషశ్చా అధిదైవతం''**

— భగవద్గీత

అని ఈ విశ్వవ్యాప్తమైన ''అధిదైవతం''గానూ భూతములలో నివసించి వుండి అధిభూతంగానూ పనిచేసే ఈ రెండింటినీ సమన్వయంచేసి — అంటే విశ్వం బైటజరిగేదీ, మన శరీరంలో జరిగేవీ — ఈ రెండింటినీ కలిపి పని చేయిస్తూవుండే శక్తి - ''పురుషోత్తముడు'' అనే పేరుతో వేదములలో తెలుపబడిన 'యజ్ఞపురుషుడు'! ఈయనను అధియజ్ఞం అంటారు.

**'అధియజ్ఞో అహమేవాత్ర'**

— భగవద్గీత

ఇలా మన శరీరంలోనూ, విశ్వంలోనూ ఏకకాలంలోనే విరివిగా పనులు నిర్వహిస్తున్న భగవత్ శక్తిని పామరులకుకూడా తెలిసేలాగ మన దేవాలయాలలో సూచించబడ్డది. దేహమే — దేవాలయము! ఈ దేహంలో వుండే అంతరాత్మే దేవాలయంలోని గర్భగుడిలో వుండే

దేవునివిగ్రహం!! ఆ విగ్రహం పైన చుట్టూ గోపురంపైన ఆలయశిఖరం చుట్టూరా — మన శరీరానికి పైనంతటా, వ్యాపించిన **బ్రహ్మాండంలోని దేవతలు చెక్కబడి వుంటారు!** ఇదే ఆలయ విమానం! దాని చుట్టూరా వుండే అనేక దేవతలు విశ్వమంతటా పైలోకాలుగా వ్యాపించిన దేవతా లోకాలలో వారివారి పదవులను గుడిపై వరుసలలో అంతస్థులుగా నిర్మించారు! అన్నిటికిపైన ఉండే శిఖరం ఓంకార శిఖరమే మన శరీరంలో అంతర్యామిగా ఉండే దేవుడినీ, పైలోకాలలో విశ్వమంతటా వ్యాపించివున్న దేవతలనూ కలిపి పని చేయించే కేంద్రం — ఇది సృష్టి కేంద్రము! **ప్రతి జీవుడూ ఒక దేవాలయం!** ఈ విశ్వమంతా ఒక దేవాలయము -- ఒక దానిలో యింకొకటి వుండి పని చేస్తూవున్నాయి! ఇదే 'ఆగమశాస్త్రం' అనబడే ఆలయ నిర్మాణం చేసే **మంత్రశాస్త్రం యొుక్క** — మూలసూత్రం.

## 'గుడి'లో దేవతలు - శరీరంలో నైవేద్యం

ఈ సూత్రాన్ని ఆధారంచేసుకునే గుడిలో ఎక్కడెక్కడ ఏదేవతను ఏయే స్థానాలలో పెట్టాలో, ఎవరెవరికి ఏయే నైవేద్యం పెట్టాలో నిర్ణయించి 'ఆలయ స్థాపన'లో చేస్తారు. దీన్నిబట్టే గుడి ఎదుట 'గరుడాళ్వారూ,' ఆ ముందు బలిపీఠం. తూర్పునుండి ప్రదక్షిణంగా ఇంద్రుడు మొదలుకొని అష్టదిక్పాలకులను ఎనిమిది దిక్కులలోనూ స్థాపించి వుండటం మనకు గుడిలో కనిపిస్తుంది ప్రదక్షిణంగా చూస్తూ వెడితే!

వీటన్నిటికీ ఉదయం 'నైవేద్యం' సమయంలో అర్చకస్వాములు అన్నాన్ని ప్రసాదంగా బలివేస్తూ ఎనిమిది దిక్కులకూ చుట్టూరా తిరిగి గంటకొడుతూ సమర్పిస్తారు. --దీనిని **'బలిహరణం'** అంటారు.

**ఇది, అవయవాలకు నైవేద్యమయ్యే ఆహారం**

ఇది మన శరీరంలోని అవయవాలలో నిలచిన దేవతలకు నిత్యం

ఆహారం ప్రతి అవయవానికి క్రమంగా ఎలాసరఫరా అవుతోందో అలాగే 'ప్రదక్షిణంగా' తిరుగుతూ బలివేస్తారు!! సైన్సుకూడా శరీరంలో రక్తం ఆహారాన్ని తీసుకుని హృదయంలోంచి బయలుదేరి-- ప్రదక్షిణంగా శరీరమంతటా తిరిగి -- మళ్ళీ హృదయాన్ని చేరుకుంటుంది అని చెప్పడానికి సర్క్యులేషన్ (Circulation of blood - is circulation in motion)అని వర్ణించబడిన ఆధ్యాత్మిక సూత్రమే ఈ సైన్సు సూత్రం కూడా.

## మూలవిరాట్

అన్ని దేవాలయాలలో గర్భగుడిలోని దేవుడు నిలబడి వుంటాడు. కాని--**శ్రీరంగంలోని రంగనాధుడు మాత్రం** పడుకుని వుంటాడు! ఎందుకంటే ప్రతిగుడిలో నిలబడివుండే విగ్రహం శ్రీరంగంలో పడుకునివుండే నారాయణుడు-- **''ఆత్మలకు ఆత్మ అయిన పరమాత్మ''**-- అంటే ఆత్మలన్నీ ఎవరినుంచి జన్మిస్తున్నాయో (శరీరంకాదు, ఆత్మ జన్మించటం) ఆయన వైకుంఠంలో యోగనిద్రలో సమాధిలో శయనించివుంటాడు గనుక, ప్రళయం సమయంలో **సృష్టి ఇంకా ఆరంభం కాకముందు పరమాత్మ వుండే (పరవాసుదేవుని) స్థితి, ఇది!** అందుకే శయనించివున్న నారాయణుడైన ఈ పరమాత్మ నాభినుండి సృష్టికి మూలకారుడైన బ్రహ్మ తామరపువ్వులో ఆకాశాన నిలిచి, తన నాలుగు ముఖాలతో నాలుగు వేదాలు చదువుతూ సర్వ జగత్తుకూ ఆత్మ అయిన భగవంతుని స్తుతిస్తూవున్నట్లు శ్రీరంగంలోని విగ్రహంలో కనబడుతుంది.!

విశ్వపురుషుడైన నారాయణుని నాభినుండి బ్రహ్మకు తామరకాడ పొడుగ్గా కనెక్షన్ వున్నట్లే-- తల్లికి బిడ్డకి వుండే నాభి కనెక్షన్ (Umbilical Card) వుంది! ఇదే, పుట్టగానే **బొడ్డుకోయకముందు** వుండే

నాభినాళం! ఇదే పైనున్న విశ్వానికీ మనిషి శరీరంలో ఉన్న భగవంతునికీ ఉన్న తల్లీ బిడ్డలవంటి **పోలిక!**

జీవునికి విరాట్పురుషునితో కనెక్షన్‌కూడా యిలాగే బొడ్డు దగ్గరనుంచి తేజస్సుతో వెలిగే నాడి 'సూక్ష్మశరీరానికి' కట్టబడి వుంటుంది. మనిషి మరణించేముందు అతడి శరీరానికి జీవుడు వుండే **సూక్ష్మశరీరాన్ని** కలిపిఉంచే కనెక్షన్ తెగిపోతుంది! అదే మరణం అంటే! ఈ సూత్రాన్ని బట్టి విరాట్పురుషునినుంచి సర్వదేవతాసృష్టి జీవుల (ఆత్మల సృష్టి) బ్రహ్మసృష్టి ఏర్పడి వున్నదని తెలుస్తుంది!

## నిర్గుణం - సగుణం:

ఆకారంలేని నిర్గుణస్థితి నుంచి వేర్వేరు ఆకారంతో సగుణంగా వున్న సృష్టి ఎలా ఏర్పడుతుందో ఇప్పుడు మీకు తెలుపుతాను

ముందుగా జరిగేది **ఆత్మల సృష్టి,** తర్వాత జరిగేది **ఆకారాల సృష్టి!** ఈ ఆకారాల సృష్టిలోనే శరీరాల సృష్టి జరుగుతుంది. ఈ శరీరాలలో ఆత్మలు ప్రవేశించి ఆ తరువాత 'జన్మించటం' జరుగుతుంది. ఈ నాలుగూ -- నాలుగు వేర్వేరు దశలు.

ముందుగా **'ఆకారాల సృష్టి'** ఏర్పడుతుంది. ఇదంతా దేవతా సృష్టి! బయటకి కనిపించేది కాదు. దేవతా సృష్టి అయ్యాక జీవాత్మల సృష్టి జరుగుతుంది! ఆ తరువాత పంచభూతాత్మకమైన సృష్టి ఏర్పడుతుంది.

**ఇదీ, సృష్టి క్రమం అంటే!**



25

# శరీరంలో జగత్తు - పిండాండము

విరాట్పురుషుని శరీరంలో సర్వ ప్రపంచమూ ఎలావున్నదో గమనించాము. విరాట్పురుషోపాసన గురించి కూడా గత అధ్యాయాలలో సూచనగా గమనించాము. ఇతడు బ్రహ్మాండమే శరీరముగాగల — **'విరాట్!** ఇప్పుడు ఈ అధ్యాయంలో **మానవ శరీరంలో వున్న బ్రహ్మాండం గురించి** తెలుసుకుందాం.

ఇక్కడ అది సవిస్తరంగా వివరాలతో విశదపరుస్తాను. శరీరంలోవున్న జీవుడు **పిండాండ** -మనబడును. విశ్వమంతా నిండిన వ్యక్తినే బ్రహ్మాండమని అంటాము. ఈ పిండాండ బ్రహ్మాండములు రెండూ ఒకదానికొకటి 'కాపీ'లేక బింబ **ప్రతిబింబములుగా** వున్నాయన్న సత్యాన్ని అనుభవం ద్వారా - గ్రహించటమే **విరాట్పురుష విద్యలోని మూలసూత్రం!.**

బ్రహ్మాండమూ, పిండాండమూ ఒకటేనని కేవలం మనసుతో అనుకోగానే సరిపోదు! ఇది నిత్యభావనగా స్థిరపడాలి! అలా స్థిరపడకుండా మనకి నిత్యం జీవితంలో కలిగే సుఖదుఃఖాలు మనస్సును చలింపజేసి ఈ స్థిరమైన ధారణను భగ్నం చేయడానికి యత్నిస్తాయి! ఇదే 'మాయ'! మనకి నిత్యం సమాజంలో ఇతర వ్యక్తుల వల్ల కలుగుతున్న సుఖదుఃఖాల ప్రభావం వల్ల సుడిగాలివలే, అహంకార మమకారాలు చెలరేగి స్థిరమైన భావన నిలబడకుండా ఉగ్రరూపతలూగించివేస్తూ వుంటాయి. **ఈ పెనుతుఫానులకు తట్టుకొని నిత్యం తన శరీరంలోని జగత్తును దర్శించటమే సాధన!** దీన్ని పట్టువిడవకుండా చేయడమే నిష్ఠ!!! దీనికి కొన్ని యోగరహస్యాలు తెలియాలి ! కేవలం ఊహ, లేక 'నేనే విరాట్పురుషుణ్ణి' అన్న భావన ఒకటే చాలదు. దీనికి **విరాట్పురుషోపాసనా రహస్యాలు తెలియాలి!** ఈ రహస్యాలు బహు గుప్తమై సామాన్యులకందకుండా రహస్య పరిభాషలో అనాది కాలంనుంచీ వస్తున్నాయి.

సిద్ధ పురుషులైన గురువులే (లోకపాలక వర్గములోని అధికార పురుషులే ఈ సిద్ధగురువులు) ఈ రహస్యాన్ని తెలిపినవారు! అందువలన ఈ విరాట్పురుష రహస్యాలను కొన్నిటిని ఇక్కడ వివరిస్తాను. 'పురుషసూక్తము' లోని విరాట్పురుషునే **మన శరీరంలో దర్శించే** విద్యను సాధకుల కందించాలనే సంకల్పంతోనే ఈ క్రింది వివరాలు ఉపదేశించటం జరిగింది.

## రాజవిద్య :-

ఈ విరాట్పురుషోపాసన ఒక పరమ రహస్యమైన రాజవిద్య!

*''రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమం''*

అని భగవద్గీతలో విరాట్పురుషుని సహస్ర శీర్షబాహు - పాదములతో -తన శరీరంలోనే చూపించిన శ్రీకృష్ణుడు అర్జునునకు ఈ విద్యనే

క్లుప్తంగా తెలియజేశాడు!

ఇది కేవలం భాగవద్గీతలోని ఈ ఒక్క అధ్యాయం చదివితే అర్థం కాదు. దాని రహస్యాలు తెలియాలి! ఈ విద్య సహస్రశీర్ష పురుషుడైన నారాయణునినుంచి బ్రహ్మ ఉపదేశం పొంది సర్వజీవులనూ తనలోంచే సృష్టించాడు! ఈ విద్యనే మనకు నిత్యం కనబడే సూర్యుడు విరాట్పురుషుని నుంచి ఉపదేశంగా పొందాడు! ఆయననుంచి **వైవస్వత మనువు** గ్రహించి (ఇతడు సూర్యుని కుమారుడు) మానవజాతికి మొదటి చక్రవర్తిగా తన వంశీయులైన సామ్రాట్టులందరికీ ఉపదేశించాడు. రాజులచే అభ్యసించబడినది **రాజవిద్య** అయింది!

ఇక్కడ 'రాజు' అంటే దేశాన్ని పరిపాలించే రాజనికాదు అర్థం - విరాట్పురుషుడు అని అర్థం! తేజోమయుడు రాజు. అనగా తేజస్సును వెదజల్లే ఆత్మ గలిగినవాడు **రాజు! రాజిల్లేవాడే రాజు.** 'రాజ సృదీప్తౌ' అని ఉత్పత్తి! సూర్యునిలోవున్న సూర్యాంతర్వర్తియైన ఆదిత్యపురుషుని **సహస్రశీర్షా పురుషునిగా** దర్శించే రహస్యమే - ఈ రాజవిద్య!! ఇది సమస్త విద్యలలోకి రాజు. అందుకని రాజవిద్య లేక **రాజయోగము** అనబడినది! దీనివలన మానవుడు 'సామ్రాట్టు' అవుతాడు. అనగా స్వరాజ్యమును పొందుతాడు. (''ఆప్నోతి స్వారాజ్యమ్'' అని వేదము చెబుతున్నది.) ఇక్కడ **''స్వారాజ్య''** అంటే శరీరంలోని ఇంద్రియాలూ, మనస్సు, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలకు **ఆత్మ లోబడకుండా వుండుటయే** - అనగా సరాసరి తానే రాజుగా **ఆత్మయే ప్రాణములను పరిపాలించే యోగశక్తియే 'స్వరాజ్యము'**. ఇదియే ఆత్మ సామ్రాజ్యము — ఆత్మయే పరిపాలించునది.

మనం మనస్సుచే పరిపాలించబడుచున్నాము. కోపాలకు లొంగి పరిస్థితులవల్ల పరిపాలింపబడుచున్నాము. అన్నమునకులొంగి అన్న

వస్త్రములకు లోబడి బ్రతుకుచున్నాము (ఉద్యోగము వలన). ఇలా ఇందరు యజమానులకు సేవకుడై మానవుడు పారతంత్ర్యమున జీవించుచున్నాడు. ఇది వదలి **స్వాతంత్ర్యము** నొందుటయే **పరిపూర్ణ మానవత్వము!** అది పొందినవాడే **మనువు!**

ఇక పరిపూర్ణ మానవత్వమును దాటి దైవత్వమునుగూడా పొందవలెనంటే తనలోనే గ్రహమండలమును దర్శించి వానిని జయించవలెను. దీనివలన గ్రహాధిపత్యము వచ్చును. పూర్వము ఇట్లు మోక్షముపొంది గ్రహత్వము సంపాదించుకున్నవారే **ఒకానొకప్పుడు మానవులుగా వుండిన** బృహస్పతీ, శుక్రుడూ, సూర్యుడూ మొదలగువారు. తనలోని సూర్యుని దర్శించి సాక్షాత్కరింప జేసుకొనుటచే జీవుడు **ఆదిత్యులలో** నొకడగును. ఇలాగ తన శరీరంపైన ఏదేవుని ఉపాసించి వేనిసిద్ధిని పొందునో ఆ దేవాతాస్థితినే తాను పొందుతున్నాడు. పురాణాలలోని గాధలలో జీవులు ఇంద్రత్వమూ, దేవత్వమూ, బ్రహ్మత్వమూ, ధృవపథమూ మొదలగు స్థితులను పొందుటలోని రహస్యము ఇదే!

ఇట్లు ఏదో **ఒక దేవతను** ఉపాసించుటగాక తన శరీరములో **సర్వదేవతలనూ** దర్శించుట వలన ఇది విరాట్పురుషోపాసన అగును. శరీరములో విరాట్టును లేక సర్వబ్రహ్మాండమునూ కనుగొను రహస్య సూత్రములు కొన్ని ఈ క్రింద వివరించబడినవి.

## మానవ శరీరములో 'విరాట్టు':-

ఆరు అడుగులు ప్రమాణము కలిగిన ఈ మానవశరీరమే **సర్వసృష్టి స్వరూపము!** ఇందు వెన్నెముక మేరుస్థానము. వెన్నెముక అడుగు భాగము (అనగా ఆసనమునకూ లింగమునకు మధ్యభాగము) మూలాధారము. ఈ మూలాధారములో ఒక తామర దుంపవలె

మూలకందము (కందమూలము) కలదు. దుంపకు వేళ్లు కలిగినట్లే ఈ కందమునుండి అన్నివైపులకూ 72,000 నాడులువున్నాయి.

## నాడులు :-

ఈ 72,000 - నాడులలో 14 నాడులు ప్రధానమైనవి. ఈ 14 నాడులూ **పాడ్యమి** మొదలుగా **చతుర్దశి** వరకునూ గల ఒకటినుంచి -14 తిధులతో సంబంధము కలిగివున్నవి.

అంతేకాదు, శుక్లపక్షములోని ఈ **14-తిధులకున్న** అధిపతులే సృష్టికల్పములోని **14 గురు మనువులు!**

ఈ 14-నాడులకూ పేర్లు :-

1. పింగళ
2. ఇడ
3. సరస్వతీ
4. పూషా
5. వరుణ
6. హస్తి జిహ్వా
7. యశస్వినీ
8. అలంబుస
9. కుహు
10. విశ్వోదార
11. పయస్వినీ
12. శంఖినీ
13. గాంధార
14. సుషుమ్నా

పై 14 నాడులలో ఇంకనూ ప్రధానమైనవి మూడు నాడులు. ఇవి త్రిమూర్తులకు సంబంధించినవి. ఇవి 1. ఇడ 2. పింగళ 3. సుషుమ్న. ఈ మూడు నాడులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులైన త్రిమూర్తులను అధిదేవతలుగా కలిగియున్నవి. ఇడానాడికి విష్ణువు అధిపతి. పింగళకు రుద్రుడు అధిపతి! సుషుమ్ననాడికి యోగశాస్త్రములో కూడా "**బ్రహ్మనాడి**" అనిపేరు గలదు.

## సుషుమ్న నాడి:-

ఇది, ఇడా పింగళా నాడులకు మధ్యన గలదు. దీనినే లక్ష్మీ సహస్రనామములో 'ఇడా పింగళి కా మధ్య సుషుమ్నా గ్రంధిభేదినీ!' అని చెప్పబడింది. **ఈ సుషుమ్నా నాడియే మోక్షమును ప్రసాదించును!** మోక్షమును ప్రసాదించుటకు ముందుగా బంధత్రయమును ఛేదించవలెను. ఈ మూడు బంధములూ మన ఆత్మను బంధించియున్నవి. ఈ మూడుగ్రంధులను ఛేదించి, జీవుడు మూడు బంధములనుండి విముక్తుడగుచున్నాడు.

ఇడా, పింగళ, సుషుమ్నా నాడులు-మెలకువా, నిద్ర, సుషుప్తి అను మూడు స్థితులకు సంబంధించినవి. సుషుప్తికి సంబందించినది గనకనే 'సుషుమ్నానాడి' అనిపేరు.

## కుండలినీ :-

మూలాధారంలోనున్న మూలకందమునకు పైన **కుండలినీ శక్తి** యున్నది! అనేక తంత్రగ్రంధాలలో ఆదిశక్తియని, మూలప్రకృతియని, జగన్మాతయనీ, గాయత్రి అని అనేక పేర్లతో పిలువబడే స్త్రీస్వరూపిణియైన శక్తి ఈ కుండలినీ శక్తియే! ఇది చాల నిగూఢమైన రహస్యము.

ఈ కుండలినీ శక్తిని మేల్కొలిపితే మూలాధారం నుంచి పైకిలేచి సుషుమ్నా నాడియొక్క ద్వారములో ప్రవేశించి గొట్టములోనించి పైకెక్కే నీరువలె, **వెన్నెముకలోని బ్రహ్మదండము ద్వారా,** శిరస్సులోని సహస్రారమును చేరును! ఇది ప్రయాణంచేసే దారిలో ఆరుచక్రములున్నవి. సహస్రారముతో కలిపి మొత్తం ఇవి ఏడు చక్రములూ, గాయత్రీ దేవత యొక్క సప్త వ్యాహృతులే వెన్నెముకలోని, వెన్నుపూసలో కూడా 7 x 7 = 49, (సప్త సప్తి) అని వేదము తెలుపుచున్నది. దీని వివరములు 'గాయత్రీ మంత్రార్థము' అనే గ్రంథంలో ఇవ్వబడినవి గావున ప్రస్తుతమిది

చాలును.

## నాడులు :-

మూలకందము నుండి 72,000 నాడులు బయల్పడి అందులో 14 ముఖ్యమైనవని తెలుసుకొంటిమి. ఇందులో :-

1) సుషుమ్నానాడికి ఎడమవైపున ఇడానాడి వున్నది. కుడివైపున పింగళనాడి యున్నది.

2) సుషుమ్నానాడికి బైటగా రెండు పార్శ్వములయందూ సరస్వతీ నాడి, కుహూనాడి కలవు.

3) ఇడానాడికి వెనుక గాంధారనాడి యున్నది. అట్లే హస్తిజిహ్వ అను నాడి ఇడానాడికి ముందరగా యున్నది.

4) అదే విధముగా, పింగళ నాడికి వెనుక 'పూష' అనేనాడి, ముందరగా 'యశస్వినీ' (పయశ్వినీ) అనే నాడియూ కలవు.

5) 'కుహు'నాడికినీ 'హస్తిజిహ్వ' నాడికినీ మధ్యగా నున్నది **'విశ్వోదరా'** అనేనాడి.

6) అదేవిధముగా 'యశస్వినీ' నాడికినీ 'కుహు' నాడికినీ మధ్యభాగములో 'వరుణ' నాడియున్నది.

7) సరస్వతీ నాడికినీ, 'పూష' అనే నాడికినీ మధ్యగా యశస్వినీనాడి యున్నది.

8) సరస్వతీ నాడికి, గాంధారి నాడికిని, మధ్యభాగములో శంఖినీనాడి గలదు.

9) మూలకందమునకు మధ్యగా గుదస్థానము వరకూ, 'అలంబుస'అనే పేరుగల నాడియున్నది.

పై నాడులన్నీ ఎందుకని చెప్పవలసినదంటే ఈ నాడుల్ని ఆశ్రయించి

మన శరీరంలో దేవతలున్నారు!!! విరాట్పురుషవిద్యలో సర్వదేవతలనూ, శరీరములో దర్శించు రహస్యము గలదు గదా? అందువలన మన శరీరములో దేవతలు ఏయే ప్రదేశములో నున్నారో తెలియుటకే నాడీజ్ఞాన మవసరము. ఈ క్రింది పట్టికలో ఏయే నాడికి ఏ అధిదేవత సంబంధించియున్నాడో ఆ వివరములు తెలుపబడినవి.

1) విష్ణువు = ఇడానాడి
2) శివుడు = పింగళానాడి
3) బ్రహ్మ = సరస్వతినాడి
4) విరాట్ = సుషుమ్నానాడి
5) వరుణుడు = హస్తిజిహ్వానాడి
6) సూర్యుడు = యశస్వినీనాడి
7) వాయువు = వరుణానాడి
8) పూష = పూషానాడి
9) చంద్రుడు = గాంధారనాడి
10) అబాత్మయగు వరుణుడు = అంబుసా నాడి
11) అగ్ని = విశ్వోదరనాడి
12) ప్రజాపతి = పయస్వినీనాడి
13) చంద్రమసుడు = శంఖినీనాడి
14) క్షత్తు = కుహునాడి

ఈ విధముగా ఒక్కొక్క నాడికీ ఇలాగే ఒక్కొక్క అధిదేవత వున్నాడు.



26

# మన శరీరంలో వున్న - అధిష్ఠాన దేవతలు

## అవయవములలో దేవతలు :-

పైన చెప్పబడినవి నాడీసంబంధమైన దేవతలు. ఇక చెప్పబోవునది శరీరములోని ఏయే అవయవమునకు ఏయే దేవత అధిష్ఠించియున్నాడో ఆ రహస్యము! ఇది పురుషసూక్తమున బాహ్యముగానే (అందరికీ తెలియునట్లు) వర్ణింపబడినది.

1) హృదయము = బ్రహ్మస్థానము అనగా బ్రహ్మదేవుడు హృదయములో అధిష్టించియున్నాడు.

2) ముఖములో = అగ్నిహోత్రుడు

3) వాక్కులో = ఇంద్రుడు ('ముఖాదింద్రశ్చాగ్నిశ్చ'- అని వేదం!)

4) శ్వాసయందు = వాయువు

5) మనస్సున = చంద్రుడు

6) లింగమున = ప్రజాపతి

7) వృషణములందు = జలదేవతయైన వరుణుడు

8) నాలుకయందు = మిత్రావరుణులు

9) పాదములయందు = భూదేవత (భూమి)

10) నాభియందు = అంతరిక్షము

11) చెవులయందు = దిక్కులు

12) శిరస్సునందు = బ్రహ్మలోకం (దినము)

ఇట్లు సర్వావయవములలోనూ, శరీరకార్యములను నిర్వహించుటకు దేవతలు పనిచేయుచున్నారు. శరీరములో దేవతలున్నట్లే కాలస్వరూపమైన సంవత్సరము, యజ్ఞస్వరూపమైన రాశిచక్రము మొదలగు కాలస్వరూపం యావత్తుగూడా వున్నది.

## శరీరములో ''కాల చక్రము'' సంవత్సరము :-

'యజ్ఞః సంవత్సరః' అని వేదము, సంవత్సరమే యజ్ఞస్వరూపమని తెలిసినది కదా! ఈ 'యజ్ఞమే' యజ్ఞపురుషుని ఆకారము. అంతేగాక వేదము మన శరీరములో ప్రాణ సంచారమువలన ఏవిధముగా సంవత్సర రూపేణ యజ్ఞము జరుగుచున్నదో తెలుసుకొమ్మని ''ప్రాణో యజ్ఞేన కల్పతాం'' అని ఉపదేశించినది. ఇది ఒక యోగ రహస్యము. దీనివల్ల శరీరములోని సంవత్సరాత్మకమైన కాలగమనము యోగికి తెలియును. శరీరములో ప్రాణమే సూర్యుడు! ఈ ప్రాణము యొక్క సంచారమే సంవత్సర చక్రములోని సూర్యుని సంచారము.

ప్రాణము **పింగళనాడి** యందు సంచరించునప్పుడు యోగులు రహస్య పరిభాషలో **'ఉత్తరాయణమని'** తెలుపుచున్నారు. అదేవిధముగా ప్రాణము ఇడానాడియందు సంచరించునప్పుడు **దక్షిణాయనమని** తెలియగలరు. ఇడా పింగళా నాడులు **కలిసి సంధింపబడి** ప్రాణ సంచారము నడిపించునదే **అమావాస్య !** ఎందుకనగా ఇడానాడిని చంద్రనాడనియూ, పింగళనాడిని సూర్యనాడి అనియూ పిలుతురు. సూర్యుడు, చంద్రుడూ కలియుటయే కదా అమావాస్య ! అందుకని ప్రాణము ఇడా పింగళనాడులు రెంటియందూ సంచరించు సమయమే **అమావాస్య!** సూర్యచంద్ర సంయోగాత్మకమైన యజ్ఞమే 'దర్శ', ఇష్టి (యజ్ఞం)! పౌర్ణమినాడు జరుగునదే **'పౌర్ణిమాసేష్టి'.**

ఇట్లే ప్రాణము ఇడాపింగళ నాడులు రెండింటినీ పొందక పోవుటచే సూర్యచంద్ర నాడులు రెండునూ విడి వడి ప్రాణ సంచారము లేకయుండును. అది కేవలకుంభకము! కేవల కుంభకమే 'పూర్ణిమ' యనబడుచున్నది! సూర్యుడునూ, చంద్రుడునూ విడివిడిగా దూరదూరమున ఉన్నపుడే గదా పౌర్ణమి అగుచున్నది. అందుకని ప్రాణసంచారమువలన జరుగు ఈ యజ్ఞములో కేవల కుంభకమే పౌర్ణిమాశ్టేష్టి! ఈ విధముగా దర్శ పౌర్ణిమాసేష్టులు అనబడే **రెండు యజ్ఞములనూ** ప్రాణ సంచారముతోనే తెలియవలయును.

## విషువత్ పుణ్యాకాలము :-

మనకు సంవత్సరములో రాత్రింబవళ్ళు **సమానముగా** గడిచే రోజు **విషువత్ పుణ్యకాలమని** పిలువబడుచున్నది! ప్రస్తుత కాలములో మార్చి 22వతేదీనా, సెప్టెంబరు 23వ తేదీన ఈ విషువత్ పుణ్యదినములు వచ్చుచున్నవి! ఈ రెండు రోజులలోనూ **రాత్రీపగలూ సమానముగా నుండను.** మేషరాశిలోనూ, సెప్టెంబరులోని విషువత్ దినము సూర్యుడు

తులారాశిన పొందినపుడూ జరుగునని విష్ణుపురాణము.

**'మేషాదౌచ తులాదౌచ మైత్రేయ విషువం స్మృతమ్'**

అని సంవత్సరములో కలుగు రెండు విషువద్దినములనూ తెలిపినది.

శరీరములో ప్రాణమే సూర్యుడు! ప్రాణసంచారమే సూర్యుని సంచారము. అందుకని । ప్రాణవాయువు శరీరములో ప్రవేశించినపుడు అదే మేషాదిన కలుగు విషువత్ అనబడును. ఇదే విధముగా ప్రాణము మూలాధారమున ప్రవేశించినపుడు తులా విషువత్ యేర్పడును.

సూర్యగ్రహణ, చంద్రగ్రహణములు కూడా ఇలాగే శరీరములో జరుగు సంవత్సర యజ్ఞములోనిట్లే ఏర్పడుచున్నవి. ప్రాణవాయువు ఇడానాడిలోంచి కుండలినీ స్థానము పొందినపుడు అది ''చంద్రగ్రహణ''మని రహస్య యోగపరి భాషలో పిలుతురు. అలాగే ప్రాణము పింగళానాడినుండి కుండలినీ స్థానము ప్రవేశించినపుడు అది **'సూర్యగ్రహణ'** మని యోగులు పిలుతురు! ఈ సంవత్సరాత్మకమైన యజ్ఞమునే **'ప్రాణోయజ్ఞేన కల్పతామ్'** అను మంత్రముతో యజుర్వేదము తెలిపినది. వివరములతో శుక్ల యజుర్వేద సంబంధమైన **దర్శనోపనిషత్తు** ఈ విషయమును సప్రమాణముగ తెల్పుచున్నది. సామవేదమునకు సంబంధించిన పదునెనిమిది ఉపనిషత్తులలో ఈ దర్శనోపనిషత్తు ఒకటి! దీనికి గురువు త్రిమూర్త్యాత్మకమైన **దత్తాత్రేయుడే. ఆయనయే శరీరములో జరుగు ఈ సంవత్సర యజ్ఞమును ఇట్లు తెలిపినాడు.**

## ఆత్మయే పురుషుడు :-

శరీరములోని నాడులూ, నాడీదేవతలు, శరీరావయవ సంబంధమైన **అధిష్ఠాన దేవతలు,** ప్రాణసంచార రూపకమగు సంవత్సరమూ, తెలిసిన తరువాత ముఖ్యముగా తెలియవలసినది **'పరబ్రహ్మ రూపకమగు'** పురుషుని ఉపాసన.

ఆత్మయే పురుషుడు అనుధ్యానము నాలుగు వేదములలోనూ తెలుపబడినది. అది **'జ్ఞానం బ్రహ్మ'** అను మహావాక్యముతో ఋగ్వేదం తెలిపినది. దీనినే **'అహం బ్రహ్మాస్మి'** అను మహావాక్యముతో యజుర్వేదం తెలిపినది. సామవేదము **'తత్త్వమసి'** అను మహావాక్యముతో తెలిపినది. చివరకు అథర్వణ వేదము **'అయమాత్మా బ్రహ్మ'** అను మంత్రముతో ఉపదేశించినది. ఇట్లు నాలుగు వేదములూ, పురుషుడినే బ్రహ్మగా, ఆత్మస్వరూపమునే శరీరములో భావనచేయవలెనని తెలిపినది.

## నాలుగువేదముల సారమే పురుషసూక్తము :-

అందుకని పై నాలుగు వేదములలోని మహావాక్యములలో శరీరముతో ఒకనాత్మని ఉపాసించు పద్ధతిని భగవంతుడైన **దత్తాత్రేయుడు** 'కైవల్యోపనిషత్తు'లోని ఈ క్రింది నాలుగు మంత్రాలలోనూ తెలిపియున్నాడు.

1. ఋగ్వేద మహావాక్యంలోని 'ప్రజ్ఞానం బ్రహ్మ' యను మంత్రము.

**'మయ్యేవ సకలంజాతం మయి సర్వం ప్రతిష్ఠితం**
**మయిసర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం'**

అనగా పరబ్రహ్మ స్వరూపమగు 'నేను' అనుతత్త్వమునుంచియే సకల ప్రపంచమూ పుట్టుచున్నది. నాయందే సర్వమూ ప్రతిష్టింపబడియున్నది. నాయందే సకలము ప్రళయము చెందుచున్నది. కనుక త్రిమూర్త్యాత్మకమగు నానుంచే సృష్టి, స్థితి, లయములు కలుగుచున్నవి, అని అర్థము.

2. యజుర్వేద మహావాక్యమున **'అహంబ్రహ్మాస్మి'** అను మంత్రమును ఉపాసించే పద్ధతి ఇట్లు తెలుపబడినది.

కాబట్టి యజుర్వేదము యజ్ఞమునకు సంబంధించినది. యజ్ఞపురుషుడే యజుర్వేదాధిష్టాన దేవతయగు **సహస్ర శీర్ష పురుషుడు!** అందుకని.

'అణోరణీయం సమమేవ తద్వన్మహాసహం విశ్వ మిదం విచిత్రమ్ !
పురాతనో హం పురుషోహ మిశో హిరణ్మయో హం శివరూప మస్మి'!

అనగా సహస్ర శీర్ష పురుషుడను నేనే! పురాతనుడైన పురుషుడను నేనే! అణువుకన్న చిన్నగానూ, విశ్వముకంటే పెద్దగానూ వ్యాపించే విచిత్రము నేనే. **హిరణ్మయస్వరూపుడను** ('**హ**'కార '**ర**' కారము బీజాక్షరములుగా కలిగిన శివుడను. హర లేక **హరి-విష్ణువు**) నేనే!

3. సామవేద మహావాక్యమునకు '**తత్త్వమసి**' అను మంత్రమును ఉపాసించు విధానమిట్లు తెలుపబడినది.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపఞ్చం యత్ప్రకాశతే
తద్బ్రహ్మా హమితి జ్ఞాత్వా సర్వబంధై ప్రముచ్యతే.

అనగా జాగ్రత్ స్వప్నము, సుషుప్తి మొదలగువాని యందు ఏప్రపంచము కనబడుచున్నదో అది '**నేనే**' అని తెలిసినవడల సకల బంధమునుండియు విముక్తి నొందును. అనగా బంధవిముక్తియే **మోక్షమని** అర్థము.

4. **అధర్వణవేద** మహావాక్యమైన ''అయమాత్మా బ్రహ్మ'' అనే మంత్రమును అనుసంధించు విధానము కైవల్యోపనిషత్తులో ఇట్లు చెప్పబడినది.

''త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్
తేభ్యో విలక్షణస్సాక్షీ చిన్మాత్రోహం సదాశివః''

అనగా త్రివిధ దేహములనెడు (స్థూల, సూక్ష్మ కారణ) మూడు స్థానముల యందునూ అనుభవింపబడునది, అనుభవించువాడు. అనుభవము, అనునవి ఏదియో దానికంటే వేరైన వాడును, సాక్షియును, చిన్మాత్రస్వరూపుడునూ అగు **సదాశివుడనే నేను!**

ఈ విధముగా నాల్గు వేదములలోను ప్రతిపాద్యుడైన వేదపురుషుని ఆత్మగానూ, బ్రహ్మగానూ, ప్రజ్ఞానముగాను, యజ్ఞపురుషునిగాను --

ఉపాసించు విధానము తెలుపబడినది! ఇట్లు ఒకే వేదపురుషుని ఉపాసించుటకు నాలుగు వేదములూ తెలుపుటలోని రహస్యం నాలుగు వేదములూ పరమాత్మనుగూర్చి నాలుగు రకముల భోగ్యతను ఎందుకు తెలిపెననగా- మనశరీరములో **అన్నము నాలుగు విధములుగా పచనము చేయబడుచున్నది.** 'పచామ్యన్నం చతుర్విధం' - ఒకే అన్నము జీర్ణమై నాలుగు విధములుగా మారుచున్నదిగదా! అన్నమునుండి ప్రాణము, ప్రాణమునుండి మనస్సూ మనస్సు నుండి విజ్ఞానము కలుగుతున్నదని తెలియజేయుటకే ఋగ్వేదము ''ప్రజ్ఞానం బ్రహ్మ'' అని ఉపదేశము ప్రారంభించుట. ఒకే విషయమును (వేద పురుషుని) **ఋతం** (సత్యము) గా ఋక్కులద్వారా తెలుపునదే **ఋగ్వేదము.** దీనినే యజ్ఞమునకు **యజ్ఞపురుషుని** స్వరూపములో వివరించునది **యజుర్వేదము. సామగానములో** ఈ మంత్రాలను గానము చేయునది **సామవేదము.** దీనికి తిరిగి వ్యవహారిక ప్రపంచములోని సైన్సు ప్రకారము వినియోగపరచు రహస్యమును అధర్వణ వేదము తెలుపును. ఈ కారణము చేతనేగదా ఈ నాటి యంత్రములు, విమానములు మొదలైన సైన్సు జర్మనీలో అధర్వణ వేదముపై జేసిన పరిశోధనల ద్వారా లభించుట! ఒకే సత్యమును నాలుగు విధములుగా వినియోగించుచున్నాము.

పురుషసూక్తము నాలుగు వేదములలో కనిపించుటకిదే కారణము.

ఇట్లు ఈ **'విరాట్పురుషోపాసన విద్య'**, సంగ్రహముగ ఈ అధ్యాయమున తెలుపబడినది.

ఈ రహస్యం తెలియాలంటే 'పురుష సూక్త రహస్యము' తెలియాలి. యజస్సులు, సామములు, ఛంధస్సులూ, ఇవన్నీ గూడా అంటే ఋగ్యజుస్సామధర్వణ వేదములయొక్క సారములు. ఈ నాలుగున్నూ పురుషునియందు ఎట్లా ఉద్భవించినాయో ఈ పురుషుని ప్రాణస్పందనలో ఎట్లా ఉన్నవో, ఈ పురుషునియొక్క సూక్ష్మరూపముగా మానవుడు

ఎలాగ అయినాడో అన్న ఈరహస్యాన్ని గురించి తెలుపుతుంది 'పురుషసూక్తము'.

ఇందులో ఇంకనూ, అనేక రహస్యాలు గహనమైన బహుశాస్త్రములను ఏకీకరణంచేసే మూలసూత్రములూ ఇమిడివున్నాయి.

కాని అవన్నీ విస్తరించడానికి ప్రస్తుతం ఇక్కడ స్థలము సరిపోదు. ఈ వేదాలయొక్క సారమూ, సర్వబ్రహ్మాండము యొక్క సమిష్టిస్వరూపమునూ తెలిపిన కారణముచేతనే పురుషసూక్తము నాలుగు వేదాలసారమనిచెప్పబడినది. ఇందులోవున్న ఒక్కొక్క అంశం విడివిడిగా గమనించవచ్చు. సాధన చేయుదలచినవారు ఆయా శాస్త్రానికి దీన్ని అన్వయించినట్లయితే ఆ సంబంధమైన రహస్యాలు ఇందులోనే ఇంకా ఎన్నో ఎన్నో అవగతమవుతాయి!

